సరస్వతీ గ్రంథమండలి ౫౮

# భారతము - తిక్కన రచన

## (A Critical Study)

గ్రంథకర్త

విద్వాన్ భూపతి లక్ష్మీనారాయణరావు, ఎమ్. ఏ., బి. ఇడి.

# BHĀRATAMU - THIKKANA RACHANA

(A Critical Study on Thikkana Maha Bharatam)

By
Vidwan BHUPATI LAKSHMINARAYANA RAO

First Edition 1949
Second Edition - October 1968 - Price

Rights reserved by the Publishers



Publishers: ADDEPALLY & Co.
SARASWATHI POWER PRESS
RAJAHMUNDRY (A. P.) India

# ఉపోద్ఘాతము

ఆంధ్రభారత రచనా విశిష్టతను సహేతుకముగ వివరించి, పాఠకులకు నందు ముఖ్యముగ విద్యార్థులకు భారత పఠనమునం దాసక్తినిఁ గల్గించు నుద్దేశముతో నేనీ సమీక్ష నారంభించినాను. ప్రస్తుత గ్రంథమందలి విమర్శ తిక్కన భారత భాగమునకు మాత్రమే పరిమితమై యున్నది.

ఆంధ్రభారత ముదాత్తమగు స్వతంత్ర రచన యని పండిత విమర్శకుల నిశ్చితాభిప్రాయము. ఇతివృత్తమును సంస్కృతమునుండి గ్రహించి, తమ ప్రతిభాసామర్థ్యములచే నుదాత్తము, సర్వాంగసుందరము నగు మహాకావ్యముగఁ గవిత్రయమువా రాంధ్ర భారతమును రచించినారు. మూలము నందలి యుత్కృష్ట భావము లనేకము లిందు వచ్చి చేరినవి. కావ్య విధానమున కనుకూలింపని విషయములు త్యక్తములైనవి. రసపోషణకై కొన్ని వర్ణనలు కల్పితములును నైనవి. ఇట్లు కవిత్రయమువారు భారతమును దీర్చిదిద్దినారు. సంస్కృత భారతరచన యందుఁ గావ్యరీతికంటెను పౌరాణికవిధాన మెక్కువ ప్రాధాన్యము వహించినది. ఆంధ్ర భారతమునఁ బ్రాముఖ్యము వహించినది కావ్యరీతి. కనుక, రచనా విధానముం బట్టి, ఆంధ్రభారతము స్వతంత్రకావ్యమగును. తిక్కన భారత భాగమునుండి విమర్శకై నేగ్రహించిన ఘట్టములను మూలముతోఁ బోల్చిచూడగా నాకుఁ గల్గిన యభిప్రాయ మిట్టిది. శ్రీయుతులు గుఱ్ఱం సుబ్బరామయ్య, కోరాడ రామకృష్ణయ్య, కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు - మున్నగు పండిత విమర్శకుల యభిప్రాయము నిదియే. కవిత్రయము వారి యనువాద విధానమును గూర్చి వీరిదివఱకే కొంత ప్రశంస గావించియున్నారు.

కావ్యములను విమర్శించుపట్ల, స్వతంత్ర కావ్యముల విషయమున నొక విధానమును, ననువాద గ్రంథముల విషయమున వేఱొక విధాన మును నవలంబింప వలసి యుండును. మూల గ్రంథము నందలి భావ ములు, రసవత్తరములగు సన్నివేశములు, విశిష్ట శబ్దార్థాలంకారము

లచే సిద్ధించు మనోహరములగు ధ్వనులు, - మున్నగునవి యనువాదమునఁ బోషితమైన విధమునుబట్టియు, ననువాద పఠనము వలనఁ గలుగు చిత్తవికాసమును బురస్కరించుకొనియు, ననువాద గ్రంథములు విమర్శింపఁబడును. మూలగ్రంథ రచనా ప్రయోజన మనువాదముచేఁ గూడ సిద్ధించినదా, యను చర్చ యిందు ముఖ్యము. స్వతంత్ర రచనల విమర్శన విధానము వేరు. కావ్యరచన యందుఁ గవి యుద్దేశము, కావ్యప్రయోజనము, వివిధ సన్నివేశములకును, సంఘటనలకును బ్రధానేతివృత్తముతోఁ గల సన్నిహిత సంబంధము, వస్తురస పోషణ గావింపఁబడిన విధానము, పాత్రల శీల, స్వభావ, మనస్తత్త్వముల యావిష్కరణము, కావ్యమున వ్యక్తమగు లోకజీవితము, కవితారీతి, కావ్యపఠనము వలన సిద్ధించు హృదయ వికాసము - మున్నగు లక్షణములను బురస్కరించుకొని, స్వతంత్రరచనల ప్రాశస్త్యమును నిర్ణయించుట విమర్శక సంప్రదాయము.

తిక్కన భారతభాగసమీక్షయందు నే ననుసరించిన విధానమును నిదియే. సంస్కృత భాషాజ్ఞానము చాలని పాఠకులను గూడ నాంధ్ర భారత పఠనకై ప్రోత్సహించుట నాయాశయ మగుటచే నే నీ మార్గము నవలంబించియున్నాను.

ఈ గ్రంథముచే నాయాశయ మెంతవఱకు సిద్ధించు ననుటకు సహృదయ పండిత విమర్శక లోకమే ప్రమాణము.

ఎంత జాగ్రతతోఁ బరిశీలించినను ముద్రణదోషములు కొన్ని తప్ప లేదు. ఇవి కాక, నా దృష్టిపథము నుండి తప్పిపోయినవియు నుండ వచ్చును. పాఠకమిత్రులు వానిని గుర్తించి, నాకుఁ దెల్పినచోఁ గృతజ్ఞతతో గ్రహించి, వానిని సవరించెదను.

# భారతము - తిక్కన రచన

## విషయసూచిక

### 1. భారతీయ విజ్ఞాన సర్వస్వము

సంస్కృత వాఙ్మయమున మహాభారతమునకుఁ గల విశిష్టత - వేదవాఙ్మయ లౌకిక వాఙ్మయములందుఁ బ్రతిబింబించిన భారతీయ జీవితము - భారతీయ విజ్ఞాన స్వరూపము - భారతేతివృత్త వైశిష్ట్యము - భారతేతివృత్త మాధారముగ వివరింపఁబడిన ప్రకృతి తత్త్వము - పుణ్యపాపముల సంఘర్షణ - పరమేశ్వరుని సర్వశక్తిత్వ, సర్వజ్ఞత్వములు, సంచిత కర్మపరిపాక ప్రాబల్యము - భారతమునకుఁ గల వేదతుల్యత్వము - వేదమునకును, భారతమునకును గల తారతమ్యము - వ్యాసరచిత జయేతిహాసము - తత్ప్రయోజనము - తత్కాల సంఘస్థితి - ధర్మన్యాయముల పరిస్థితి - వ్యాసుని యున్నతాశయము - భారత గ్రంథ క్రమ పరివృద్ధి - వైశంపాయన రౌమహర్షణుల యాశయములు - ప్రక్షిప్త భాగముల స్వరూప ప్రయోజనములు - భారతమితిహాసము, పురాణము, వేదాంత గ్రంథము, ధర్మశాస్త్రము, కావ్యము నగును - పరబ్రహ్మతత్త్వ, విధిప్రభావములు - విజ్ఞాన వ్యాప్తియు, లోక సంగ్రహణమును, భారత రచనా ప్రధాన ప్రయోజనములు - భారతము మహాకావ్యము కూడ నగును - మహాకావ్య లక్షణములు - రామాయణ మహాభారతముల భేద సాదృశ్యములు - భారతవైశిష్ట్యము.

భారతాంధ్రీకరణ ప్రయోజనము - రాజరాజు కాలమున సంఘస్థితి - మత విషయకమగు నశాంతి, సంఘవిచ్ఛిత్తికి హేతువు - చార్వాకాది క్షుద్ర మత వ్యాప్తి వలన ధర్మచ్యుతి - రాజరాజు నాశయము - తిక్కన నాటి సాంఘిక పరిస్థితులు - జైన బౌద్ధములు - వీరశైవ ప్రాబల్య ఫలము - శైవ వైష్ణవభేదములు - తిక్కన యాశయము - హరిహరారాధన ప్రయత్న విజయము - మతసౌమనస్యము - దక్షిణాపథమున మతముల వ్యాప్తి - ఆంధ్రదేశమున నద్వైత మతవ్యాప్తికిఁ గారణము - సంస్కృత భారతరచనకును, నాంధ్రభారత రచనకు సిద్ధించిన ప్రయోజన తుల్యత్వము - భారతరచనయందుఁ గవిత్రయము వారి అర్హత - కవిత్రయము వారు ఋషితుల్యులు, భారతరచనవలన వీరాశించినది భవబంధ విమోచనము - భారతామ్నాయ కర్మనిర్వహణమున వీరిదీక్ష - యోగివరుల సంయమనము - కవిత్రయము వారి రచనలయందలి ప్రధానగుణములు - భారత మాంధ్రుల విజ్ఞాన సర్వస్వము - నాగరికతకు జాతిగౌరవమునకు మూలకందము - ఆంధ్రభారతము విస్మృతమగుటకుఁ గారణములు - పాశ్చాత్యులకును మనకునుగల తారతమ్యము - నిజమగు జాతీయాభిమాన మెట్టిది -

సారస్వత కర్తలకు దేశమున గల స్థానము – వచన వాఙ్మయస్థితి – విమర్శక గ్రంథముల యభావమునకుఁ గారణములు – ఈవిమర్శ యాశయము.

## 2. విరాట పర్వము

రసవత్తరమగు నితివృత్త వైశిష్ట్యము – సన్నివేశములు లోక జీవితమునకు సన్నిహితము లగుట – కీచక వృత్తాంతమునఁ బోషితమైన లోకవృత్తము – కాముక ప్రవృత్తి, తత్పరిణామము, ఫలము – ఇతివృత్తము ప్రబంధ రచన కనుకూలించుట – మానవ స్వభావ వ్యక్తీకరణము – భావావేశ, భావోద్వేగముల ప్రదర్శన కనుకూల పరిస్థితి – పాతివ్రత్య పోషణకై ధీరయగు క్షత్రియ కాంత యొనర్చు ప్రయత్నము – తత్క్రమ పరిణామము లోకము నాకర్షించుట – దైనందిన జీవితమునకు సన్నిహితము.

సూర్యోదయ, సూర్యాస్తమయ, యుద్యానవనముల వర్ణనలు భావి ప్రబంధరీతికి బీజములు – భావనా ప్రధానములగు వర్ణనలు, అలంకారములు, శబ్దప్రయోగ చాతుర్యము, ఇత్యాది ప్రబంధ లక్షణములు – ప్రౌఢ కావ్య లక్షణములు – కీచక విషయగత శృంగార రసాభాస ప్రయోజనము – భీమ కీచకుల స్వభావ వ్యక్తీకరణము.

ఉత్తరగోగ్రహణము భావి యుద్ధపర్వముల రచనావిధాన సూచకము – యుద్ధ వర్ణనయందలి విశిష్టత – విశిష్టార్థ స్ఫోరక శబ్దప్రయోగ చాతురి – ఉదాత్తార్థ గాంభీర్యము – శబ్దార్థశక్తి మూల కాలంకారార్థ ధ్వనులు – ప్రౌఢ ప్రబంధముల రచన కుత్తమాదర్శమగు పద్యమునకు భావవివరణము.

ఉత్తరాభిమన్యుల వివాహఘట్టము లలిత శృంగారమున కాదర్శము – వధూవరుల మనోహర స్వరూపములు – ఉత్తరాదేవి ముగ్ధ మోహనమూర్తి – వివాహవర్ణనవలనఁ బాఠకులకుఁ గలుగు పూర్వానుభవ స్మృతి – తలఁబ్రాలు, పాణిగ్రహణము, లాజహోమము, మున్నగు వాని మనోహర వర్ణనలందలి వైశిష్ట్యము – వివరణ – ప్రకృతి సౌందర్యముతో సమన్వయము – వధూవరుల వర్ణనయం దుపయుక్తములైన యుపమానముల విశిష్టత – వైషయిక సంబంధ రహితము, లలితము, సహజసిద్ధము నగు శృంగార పోషణ – రసధ్వని ప్రధానమగు రచన.

## 3. ఉద్యోగ పర్వము

రాజకీయ విషయ ప్రాధాన్యము – పిత్రార్జితమగు సంపదకై దాయాదులు కలహించుట లోకసిద్ధము – ఇతివృత్తము లౌకికవిషయ సంబంధి – పాండవు లజ్ఞాతవాస నియమమును సక్రమముగ జరిపి భావి కర్తవ్యమును నిశ్చయించుట – భారతేతి వృత్తమందలి ప్రధాన పాత్రల కందఱికిని విషమపరిస్థితి యేర్పడియుండుట – లోకశాంతి, లోకావస్థముల వినిశ్చయము ప్రధాన విషయము – పాత్రల మనస్తత్త్వముల యావిష్కరణమునకు హేతువులగు సన్నివేశములు.

పురోహితుని రాయబారము రచితమైన విధము — ఔచితీపోషణ — రాజకార్య పరిజ్ఞానము లేని ఖండితవాదుల స్వభావము — భీష్ముని సమయజ్ఞత — సంజయుని రాయబారిగాఁ బంపుటలో ధృతరాష్ట్రుని యభిప్రాయము — సంజయుఁడు కర్తవ్యమును నిర్వహించిన విధానము — సంజయుని వాక్చాతుర్యము, రాజకార్యమై పుణ్యము-ధర్మార్జున శ్రీకృష్ణుల సదుత్తరములు — నాటకరీతి — పురోహిత సంజయ రాయబారములవైవిధ్యము — సంజయుని పల్కులర్థవిశిష్టములు — అతని యింగితజ్ఞానము — అతఁడుధృతరాష్ట్రుని స్వభావమును విమర్శించిన పద్ధతి-ధృతరాష్ట్రుని నైజస్వభావము.

కృష్ణరాయబార ప్రయోజనము, తద్విశిష్టత — శ్రీకృష్ణుని యాశయము — సామాద్యుపాయ ప్రయోగము — సత్యధర్మముల రక్షణకై కృష్ణుఁ డొనర్చిన ప్రయత్నము— శ్రీకృష్ణుని జీవిత తత్త్వమునకు సూచన — అతఁడు కురుసభలో గావించిన మహోపన్యాసము — ఉక్తిచాతుర్యము — విశిష్టార్థ స్ఫోరకములు, గంభీరములు, సుదాత్తములు నగు నతని సంధివాక్యములు — విశిష్ట ధర్మబోధ — అధర్మముగాడ నుపేక్షవహించిన భీష్మద్రోణాదులను హెచ్చరించుట — సత్య ధర్మములు తప్పక దైవముచే రక్షితములగునను కృష్ణుని పల్కులయందలి ధ్వని — పురోహిత, సంజయ, కృష్ణ రాయబారముల రచనయందలి వైవిధ్యము—రాయబారుల స్థానభేదముల ననుసరించిన యౌచిత్యము.

వివిధ సన్నివేశములు. రసవత్తరములగు నాటకరంగములవలె రచితములు — కుంతీ ద్రౌపదుల పల్కులు, వారి శీలస్వభావములు — క్షాత్రధర్మ బోధకములగు కుంతి పల్కుల అర్థము — స్వధర్మ వైశిష్ట్యమును బోధించుట — కుంతి వాక్యములందలి తీవ్రత, వ్యంగ్యార్థస్ఫూర్తి.

సంభాషణాత్మకమగు భాష — శిష్ట వ్యవహారస్థమగు తెలుఁగు నుడికారమునకు ప్రాధాన్యము — తెలుఁగు జాతీయములు, లోకోక్తులు — దేశీయతకుఁగల ప్రాముఖ్యము.

## 4. యుద్ధ పంచకము

యుద్ధవీరము శృంగారమువలె దైనందిన జీవితమునకు సన్నిహితము కాదు — రౌద్ర బీభత్సములు సర్వజన హృదయంగమములు కావు — యుద్ధాది భారత భాగమున కధిక వ్యాప్తి లేకుండుటకుఁ గారణములు — తిక్కన రచనను గూర్చిన యపచార మూలకమగు నొక యపోహ — సమాధానము — యుద్ధపర్వమాదియగు భారతభాగ రచన యందలి విశిష్టత.

యుద్ధవర్ణనాదియందలి సంజయుని వాక్యము తిక్కనయొక వర్తిం మను - ప్రకృతి సిద్ధములు, హృదయంగమములు నగు నుపమానములచే యుద్ధవర్ణనకు మనోహరత్వము నాపాదించుట - భీష్మునిఁ గూర్చి విలపించు ధృతరాష్ట్రుని వాక్యములు — భీష్మ రహితమగు కురుసేన దైన్యస్థితి — యుద్ధమునకుఁ బోవు పాండవ కుమారవర్గము —

అభిమన్యుని ప్రథమ యుద్ధము, విశిష్టత – భావి పద్మవ్యూహ యుద్ధమున కిది నాంది యగును – పద్మవ్యూహమునం దభిమన్యుని వీర విహారము – పద్మవ్యూహమును ప్రవేశించుచు నభిమన్యుఁడు పల్కిన వాక్యములు భావ్యనర్థ సూచకములు – అభిమన్యు మరణము.

సైంధవ వధనాఁడు వ్యూహమును బ్రవేశించు భీముని వర్ణన – ద్రోణుఁ డడ్డుపడుట– మనోహరమగు సన్నివేశము – రౌద్ర బీభత్స ప్రధానమగు రణరంగమును రమణీయమగు ప్రకృతి దృశ్యముగ మార్చుట – భీష్మునిపై కృష్ణుఁడు పోఁబోవుట – అస్తమింపనున్న కర్ణుని వర్ణన – ధ్వని ప్రధానమగు రచన – భీముఁడు గజసమూహముపై విజృంభించుట – సైంధవ వధనాఁటి యర్జునుని వీర విహారము – అతఁడొనర్చిన మహాద్భుత చర్యలు.

భీకరమగు యుద్ధరంగమునకుఁ గోమలతా లాలిత్య ప్రధానమగు స్త్రీ సౌందర్యము నాపాదించుట – వివరణము – యుద్ధమునకు శృంగారమును జతగూర్చుట – రమణీయములగు సదృశ వస్తు వర్ణనలచే జుగుప్సను కప్పిపుచ్చుట – వివరణము – సంపూర్ణ సామ్యముగల సహజోపమానముల నుచితరీతిఁ బ్రయోగించి అర్థపోషణఁ గావించుట.

రౌద్ర రసోత్పాదకమగు వర్ణనలు – దుశ్శాసన వధ – అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని జంపుట – రెండు సన్నివేశములకును గల భేద సాదృశ్యములు – భీమాశ్వత్థామల స్వభావ తారతమ్యములు – మనస్తత్త్వములు – ఒకే విధములగు సన్నివేశములలో భిన్నవ్యక్తుల ప్రవర్తన – అర్జునుఁడు వృషసేనుని జంపిన విధానము – అభిమన్యుని వధకు ద్రోణుఁడు కారకుఁడగుట – మనస్తత్త్వము – యుద్ధ ప్రవర్తనయందు బ్రాహ్మణ క్షత్రియుల ప్రవర్తనయందలి వైవిధ్యము.

యుద్ధమధ్యమునఁ బోషితమైన కరుణ – గురుబంధు భావాదులు, వ్యక్తుల హృదయ మార్దవము – అర్జున, ద్రోణ, ధర్మజ, భీమాదుల హృదయములు – పుత్ర శోకాతురుఁడైన యర్జునుని యవస్థ – మానవప్రకృతి – సుభద్ర విలాపము పోషితమైన విధము – ఆమె పల్కులలోని ధ్వని – పుత్ర శోకాతురయైన ద్రౌపది స్థితి – సైంధవ వధార్థ మొంటరిగ నేగిన యర్జునుని గూర్చి ధర్మజుఁడు చింతించుట – సాత్యకిని సహాయముంపు సన్నివేశము – పిమ్మట భీముని వారికి తోడుపంపుట – ధర్మజుని పల్కులలోని యౌచిత్యము – ధర్మజుని శీల ప్రదర్శనము – ద్రోణుని వధ విషయమై ధర్మార్జున భీములకు జరిగిన సంభాషణ – అందలి విశిష్టత – యుద్ధవృత్తాంతమును వినుచున్న ధృతరాష్ట్రునియందుఁ గలుగు భావోద్వేగాదులు – అతని నైజప్రకృతి – భీమ దుర్యోధనుల గదాయుద్ధ ఘట్టము – ధర్మ దుర్యోధనుల శీలములు వ్యక్తములగుట – మానవ స్వభావము – ధర్మజుని శీలమందలి లోపము – కృష్ణుని విమర్శ – అతని ప్రయత్నము.

అభిప్రాయభేదము కారణముగఁ గలిగిన వికారభావములు హృదయమున సుప్తస్థితియం దుండుట – తత్కారణమగు జనుల ప్రవర్తన – ధర్మార్జునులు కలహించుట–

వారి హృదయములను పశ్చాత్తాప తప్తములు గావించి, వారి జీవితములను కృష్ణుఁడు విశుద్ధములుగఁ జేయుట – శరతల్పగతుఁడగు భీష్ముఁడెడఁ గర్ణుని ప్రవర్తన – కర్ణుని యందుఁ గలిగిన మార్పు – మానవ స్వభావము – కర్ణుని మానసిక ప్రవృత్తి – తిక్కన చిత్రించిన లోక జీవితము.

## 5. స్త్రీ పర్వము

యుద్ధ పరిసమాప్తితో నుత్సాహము శోక నిర్వేదములకుఁ దావిచ్చినది – కౌరవ పాండవ స్త్రీల యాక్రందనములందు శోకము కరుణముగ సిద్ధించినది – ధర్మజునకుఁ గలిగిన నిర్వేదము – హృదయములు శోకాగ్ని తప్తములు కావలసియుండుట – ధర్మన్యాయముల స్మృతి లోకమునఁ గలుగుటకు హేతువులు – ధర్మజుని హృదయము ప్రశాంతినందుటకీ పరితాపమవసరము – ధృతరాష్ట్రుని ప్రలాపము – అతని స్థితి – సంజయుఁ డతని ప్రవర్తనను విమర్శించిన విధానము – అందలి యౌచితి – విదురుని సాంత్వన వాక్యములు వైరాగ్య బోధకములు – ఉత్కృష్టోదాహరణముల విశిష్టత – తిక్కన యవలంబించిన శైలీ వైవిధ్యము.

ధృతరాష్ట్రుఁడు వధూవర్గముతోఁ బోరికలనికిఁ బోవుట – కౌరవ వధూజన వర్ణన యందలి విశిష్టత – అభిజాత్య గాంభీర్య ప్రదర్శకములగు నుచితోపమాన ప్రయోగము – ధర్మజుని హృదయ క్షోభకు హేతువులు – ధృతరాష్ట్రుఁడు భీమునిఁ జంప యత్నించుట – కృష్ణుని రక్షణ – ధృతరాష్ట్రుని నటన – కృష్ణుని విమర్శ – నాటకోచితమగు రచన – గాంధారి భీము నధిక్షేపించుట – భీముని సదుత్తరము – గాంధారీ ధృతరాష్ట్రుల స్వభావములు వ్యక్తములగుట – మాతృ గర్భ శోకము – గాంధారి వాక్యముల విశిష్టత – భీభత్సమగు రణరంగమును, కురుకాంతల దీనావస్థను గాంధారి వర్ణించి, కృష్ణునకుఁ జెప్పుట – నవ వధువగు నుత్తర ముగ్ధ స్వరూప చిత్రణము – భీభత్స శృంగారముల సంయోగము – కరుణ రసోత్పత్తి – గాంధారి కృష్ణుని శపించుట – తన ధర్మలోపమును దా గుర్తింపని గాంధారి మోహావిష్టత – లోక స్వభావము.

## 6. శాంత్యనుశాసనికాశ్వమేధ పర్వములు

స్త్రీపర్వమునఁ బోషితమైన నిర్వేదము శాంతిగఁ బరిణమించుట – ధర్మజుని జీవిత పరిణామముతో సమన్వయము – ప్రజాపాలన విషయమున వ్యాసాదుల యభిప్రాయము – ధర్మజుని ప్రకృతస్థితి – ప్రతిహింస వలని ఫలము – మనో వైకల్యము వలనఁ గలిగిన పశ్చాత్తాపము – గురూపదేశమును గ్రహించుటకుఁ దగిన పరిస్థితి – ధర్మజుఁడు జ్ఞానియుఁ, గర్మయోగియుఁ గావలసియున్నది – అట్టివాఁడు ప్రజాపాలకుం డైనచో ధర్మము సుప్రతిష్ఠము కాఁగలదు.

శాంత్యనుశాసనిక పర్వములందలి యితివృత్తము — తద్వైశిష్ట్యత – వస్తువునందును, రచనయందును సౌమ్యభావము – ధర్మజునియందుఁగలిగిన మార్పు – దృష్టి ఆముష్మికమునకు మరలినది – ప్రధానేతివృత్తములో శాంత్యనుశాసనిక భాగమునకుఁ గల సంబంధము—భీష్ముని విశిష్ట ధర్మ బోధ – గురు శిష్యులగు భీష్మ ధర్మజుల విశిష్టత – బోధ్యమగు విషయమునకుఁ దగిన రచనావిధానము-సంయమనము ప్రధాన లక్షణము – యుద్ధప్రశంస సందర్భమునఁదిక్కన పాటించిన సంయమనము—అశ్వమేధ పర్వగత యుద్ధవర్ణనయం దవలంబించిన విధానము.

కావ్య రచనకును, శాస్త్రరచనకును గల భేదములు – కావ్య రచనయందు ప్రధానాశయము — శాస్త్ర రచనయందు ధ్యేయము — తిక్కన రచనా విధానము, శైలి – తద్వివరణము – శాంత్యను శాసనిక పర్వముల ప్రాశస్త్యము – వీనిని రచించుటలోఁ దిక్కన విశిష్టత – చక్కనిలోక న్యాయములు, దృష్టాంతములు-వీని సాహాయ్యమున శాస్త్రార్థములను వివరించుట – వర్ణాశ్రమ ధర్మములు, ధర్మాధర్మ, సత్యాసత్యములఁ గూర్చిన క్లిష్టసమస్యలు, సాంఖ్యాది యోగ సూత్రములు, పరబ్రహ్మతత్త్వము, మున్నగు వానిని సుగమమొనర్చుట – తిక్కన ఆంధ్రుల పాలిటి వ్యాసుఁడు.

## 7. ఆశ్రమవాస మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణములు.

ఆశ్రమవాసపర్వ ప్రయోజనము – ధృతరాష్ట్రుల తపోవన గమనము – కుంతీ హృదయము – పాండవుల హృదయ పరివర్తనము – వ్యాసుని యోగమహిమచే మృత బంధు దర్శనము – కుంతీ గాంధారీ ధృతరాష్ట్రుల మరణము – పాండవు లిహలోక విముఖులగుట – బంధములు సడలుట.

మౌసల పర్వేతివృత్తమునకు భారతమునఁ గల ప్రాధాన్యము – శ్రీకృష్ణుని జీవిత రహస్యము — కృష్ణావతార ప్రయోజనము — యాదవ సంఘస్థితి — అధర్మ ప్రాబల్యము — యాదవుల యుక్మార్గ వర్తనము — అవినీతి — కృష్ణుఁడు ధర్మము ప్రతిష్ఠించిన విధము.

ఉత్పాతములు – కణ్వాదుల శాపము – కృష్ణుని యుపేక్ష – యాదవనాశము తీర్థ సమీపభూమియం దగుట మంచిదని కృష్ణుఁడు నిశ్చయించి వారిని సముద్ర ప్రాంతమునకుఁ దరలించుకొని పోవుట, కృష్ణ బలరాముల ప్రవర్తన – కాలపురుషుని ప్రశాంతతా గాంభీర్యములు – సాత్యకి ప్రద్యుమ్నాది యాదవుల ప్రవర్తన – మద్యపాన మత్తులైన సాత్యకి కృతవర్మల కలహము – కృష్ణుని దోహదము – యాదవుల యన్యోన్య హననము – కృష్ణుఁడు హతశేషులను జంపి గాంధారీ శాపమును సార్థక మొందించుట – బలరాముని యోగనిష్ఠ – అతని యాత్మ అనంతునియందుఁ జేరుట – కృష్ణుని తనువిముక్తికి నిమిత్తము – భగవంతుఁ డవతారమును జాలించి నిజ పదవిం బొందుట – ఇంద్రాదుల స్తోత్రము – కృష్ణార్జునుల జన్మ రహస్యము —

వారి యన్యోన్య సంబంధము – అర్జునుఁడు నిర్వహించిన కార్యభారము – వేద వ్యాసుఁ డర్జునునకుఁగావించిన బోధ – విధివిలాస, కాలప్రభావములు – అర్జునుని నిశ్చయము కృష్ణావతారమునకు మౌసలపర్వము ప్రత్యక్ష వ్యాఖ్య.

మౌసలపర్వము సమగ్రమగు కావ్యము – అంగాంగ భావ సామరస్యము – ఉత్తమ కావ్యలక్షణములతో సమన్వయము – వస్తు, రస, నాయక, ప్రయోజన, రచనా విధానముల విశిష్టత — వస్తు రసములు పోషితమైన విధానము – రూపక లక్షణము లనువర్తించుట – వస్త్వైక్యత సిద్ధించినది – ఆరంభము మొదలు నిర్వహణము వఱకును నితివృత్తము పోషితమైన విధము – అంగి యగురసమును, దత్పోషకములగు నంగ ములు – మహాభారతమునందు ముఖ్యరసమగు శాంతియు, భారతరచనా ప్రయోజన మును మౌసల పర్వముచే సిద్ధించినవి – కృష్ణ నిర్యాణముతోఁ బాండవుల కిహలోక సంబంధము పూర్తిగాఁ దొలఁగినది – ధర్మజాదుల నిశ్చయము – యాదవ కుమారుల రక్షణ – సత్యభామాదుల తపోవన గమనము – ధర్మజాదుల మహాప్రస్థానము – ద్రౌప ద్యాదుల నిర్యాణము – ధర్మజుని యలౌకిక శీల, ప్రవర్తనలు – స్వర్గప్రాప్తి — ఆత్మసాక్షాత్కారము.

## 8. కర్మయోగి – వాఙ్మయ యజ్ఞము.

పాండవుల జీవిత పరిణామ క్రమము – భారతేతివృత్త పరిణామ క్రమము — అన్యోన్య సంయోగము – లోక జీవితముతో సమన్వయము – తిక్కన రచనా పరిణామ క్రమము — భారతమువలన గ్రహింపనగు తిక్కన మనస్తత్త్వము — యోగము, వేద ములు, ఉపనిషదుత్తరమీమాంసలు, పరతత్త్వము, వీనియం దతనికిఁగల భక్తి — వ్యాసుని యందును, భారతము నందును దిక్కనకుఁ గల పవిత్ర. పూజ్య భావము— భారత రచన వాఙ్మయ యజ్ఞ మను తిక్కన యుదాత్త భావము – తన వాఙ్మయా ద్వరార్చనచే భగవంతుఁడు ప్రీతుఁడగుటయే తిక్కన యాశయము – ఆత్మ నీశ్వరా ర్పణ గావించిన కర్మయోగి – భగవద్గీతార్థమును వాచ్యము చేయక యనుష్ఠానముచేఁ బ్రతిపాదించినాఁడు — తానేర్చిన విద్యకు నాల్గవ దశయగు ప్రచారమును గల్పించి, లోకము తరించుటకు మార్గమును జూపినాఁడు.

ఆశ్వాసాంత పద్యముల వలనఁ దెలియనగు తిక్కన మానసము — ఆత్మపరమా త్మానుసంధాన సాధనమగు యోగము, నిర్మలాంతఃకరణము, పరమార్థ ప్రతిపాదక మగు విశిష్టజ్ఞానము, ఆత్మసాక్షాత్కార జన్యమగు నానందము, ఇవి తిక్కన యభీష్ట ములు — మహా కవిత్వ దీక్షతోఁ బాటు వాఙ్మయ యజ్ఞరూపమగు యోగదీక్ష — శబ్దబ్రహ్మైక్య సంధానమునం జేసి జ్ఞానజ్యోతి స్వరూప సాక్షాత్కారము — జన్మరాహిత్యము.

# అంకితము

…○…

నిరంతరమగు

భాషా సారస్వత కృషిచే

ఆంధ్ర దేశమున విజ్ఞాన వ్యాప్తికి

దోహద మొనర్చుచున్న

అస్మదాచార్యులు, కళాప్రపూర్ణ, డాక్టరు, బ్రహ్మశ్రీ

చిలుకూరి నారాయణరావు. పంతులు

(M. A., Ph. D., L. T.)

గారికి

ఈ కృతిని

భక్తితో సమర్పించుచున్నాను

ఓం

# భారతము - తిక్కన రచన

## భారతీయ విజ్ఞాన సర్వస్వము

ప్రాచీన భారతీయార్యుల విజ్ఞానమును, నాగరికతను వ్యక్తపఱచు నుద్గ్రంథములలో వ్యాసప్రణీతమగు మహాభారతము ముఖ్యమైనది. మానవుల భౌతికమానసికాధ్యాత్మికజీవితనుంతయు భారతమునఁ బ్రతిబింబించియున్నది. సారస్వతము మానవజీవితమునకు శబ్ద వర్ణ చిత్రితాలేఖ్య మని చెప్పనగును. భిన్న కాలములం దుత్పన్నమైనసారస్వత మాయా కాలముల జనుల నాగరికతను, సాంఘిక వ్యవస్థను, సంస్కృతిని వ్యక్తము చేయఁగలుగుచున్నది. ఇతరములగు చారిత్రికాధారములకంటెను సారస్వతగతములగు నాధారములు తత్తజ్జాతి చరిత్రలను వ్యక్తపఱచుట కెక్కువ యుపకరింపఁగలవు. వేదవాఙ్మయమందలి ప్రతిభాగమును నార్యుల జీవితమందలి యొక్కొక భాగమునకు వ్యాఖ్యారూపకవివరణము వలె నొప్పుచున్నది. వేదభాగములగు నారణ్యకములు బ్రాహ్మణములు, నుపనిషత్తులు, పూర్వోత్తర మీమాంసలు, నార్యుల యాధ్యాత్మిక సంపదకుఁ బ్రమాణములై వారియౌన్నత్యమును జాటుచున్నవి. అర్థశాస్త్ర, నీతిశాస్త్ర, ధర్మశాస్త్రాదులు వారి సాంఘిక వ్యవస్థకును, నాగరికతకును బ్రబల సాక్ష్యము లగుచున్నవి. వైదికవాఙ్మయ కాలమున నాధ్యాత్మికతత్త్వ ప్రధానముగనున్న యార్యుల సాంఘికజీవితము లౌకిక వాఙ్మయమునాటికి భౌతికవిషయప్రధానమైనది. అప్పుడు చతుష్షష్టికళలును సర్వతోముఖముగ వృద్ధిఁ జెందినవి. యజ్ఞయాగాదికర్మలు విస్మృతములు కాకున్నను లౌకిక జీవితమునఁ దమ పూర్వ ప్రాధాన్యమును గోల్పోయినవి. మాన-

వుని యైహిక జీవితమునందలి యార్థికస్థితి, సుఖదుఃఖములు, రాగద్వే షాదులు, తత్పరిణామము నిత్యాదులకుఁ గ్రమముగఁ బ్రాధాన్యము కలిగినది. దృశ్య శ్రవ్య ప్రబంధాత్మకమగు లౌకిక వాఙ్మయము వృద్ధి బొందుటయు, నాధ్యాత్మిక విషయ సంబంధమగు గ్రంథరచన సన్న గిల్లుటయు, నిందులకు నిదర్శనములు. ఇట్లు సంఘపరిణామము ననుస రించి సారస్వత స్వరూపము క్రమముగ మారుచువచ్చినది. ఐనను, భారతీయార్యుల జీవితమునకు మూలాధారమగు మతము మాత్రము మణిహారమందలి సూత్రము వలె వారి సారస్వతమంతటను బ్రాకి యున్నది. భారతీయుల జీవితమున నాటికిని నేటికినిఁ గూడ ప్రాధా న్యము వహించియున్నది మతమే. వేదాంతగ్రంథములు మాత్రమే కాక శాస్త్రాదులును, గావ్యములునుఁ గూడ, ధర్మార్థకామమోక్షము లను బ్రయోజనములుగఁ బోషించుచు, నాముష్మికమును జీవితధ్యేయ ముగ బోధించుచున్నవి. ఇహలోక జీవితమును, దద్గతభోగములును బరమార్థములుగ నే కావ్యమును బ్రతిపాదించలేదు సోమసిద్ధాంత చార్వాకాది క్షుద్రమతము లన్నియు వివిధకావ్యములలో నందందుఁ దిరస్కృతము లైనవి. మానవజీవితమున కత్యంతము సన్నిహితము లగు సాంసారిక విషయ ప్రధానములైన దృశ్యప్రబంధములు కూడ నాముష్మికమునే జీవితపరమావధిగ సూచించుచున్నవి. వేదాంత శాస్త్ర మత గ్రంథములు, లౌకిక శాస్త్రములు, కావ్య ప్రబంధాదులు, నార్యుల జీవితమందలి యాధ్యాత్మిక మానసిక భౌతిక భాగములకుఁ గ్రమముగ వ్యాఖ్యలగుచున్నవి. ఇట్టి విజ్ఞానభాగములు మన ప్రాచీనుల జీవితమం దొక్కొక్క భాగమును బ్రధానముగ వ్యక్తీకరించుచుండ మహాభారతము వారి సమగ్రజీవితమును సువ్యక్తముఁ జేయుచున్నది. ప్రాచీన విజ్ఞానమునంతను సులభగ్రాహ్య మగు విధమున బోధించు చుండుటయే కాక రసవత్తరమగు లౌకికేతి వృత్తముతో నొప్పు మహా

కావ్యము కూడ నగుటచే భారతము సంస్కృతసారస్వతమునం దొక విశిష్ట రచనయై యొప్పుచున్నది.

కావ్యకర్త లోకసంగ్రహమునకుఁ బూనిన మహర్షి యగుటయు, నితివృత్తముదాత్తమై యుండుటయు, నాధ్యాత్మికవిషయము ప్రాధాన్యము వహించుటయు హేతువులుగ భారతము విశిష్టరచన యగుచున్నది. సత్యాసత్యములకును, ధర్మాధర్మములకును, దైవరాక్షస భావములకును జరుగు సంఘర్షణ మీ యితివృత్తమునఁ బోషితమైన నిగూఢార్థము. ప్రాచీనమగు వేదవాఙ్మయమందుఁ గూడ నందందు సురాసుర సంఘర్షణము నితివృత్తముగఁగల్గిన కథ లుదాహృతములై యున్నవి. లోకమునఁ బుణ్యపాపములకు జరుగు నిరంతర సంఘర్షణ యిట్లు కథా రూపమునఁ బ్రతిపాదితమైనది. భారతమందును నిట్టి విషయమే ప్రధానేతివృత్తమైయున్నది. పరమేశ్వరుని సర్వశక్తిత్వసర్వజ్ఞత్వములును, సంచిత కర్మపరిపాక ప్రాబల్యమును, భారతేతివృత్తసాహాయ్యమునఁ బ్రత్యక్షీకరింపఁ బడినవి. ఇంతియేకాక సకల వేదశాఖలకును జెందిన వైదికవాఙ్మయ సర్వస్వమును భారతమునఁ బ్రతిపాదితమైయున్నది. ఏతద్విషయ ప్రాధాన్యమును బట్టియే భారతమునకు వేదతుల్యత్వము సిద్ధించినది. వేదములకును భారతమునకును ముఖ్యభేద మొకవిషయమునఁ గలదు. ఉపపాదితమైన విషయమునకు మాత్రమే కాక, ప్రయుక్తములైన శబ్దములకుఁ గూడ వేదములం దధికప్రాధాన్య మున్నది. అందలి యే శబ్దమును గాని తొలఁగించి, తత్సమానార్థకమగు నితర శబ్దము నా స్థానమునఁ జేర్ప వీలులేదు. 'అగ్నిమీడే' యిత్యాదిస్థలములలో 'అగ్ని' శబ్దస్థానమునఁ దత్సమానార్థకమగు 'వహ్ని' శబ్దము నుంచుటచే నర్థభేదముగాని, ఛందోభంగముగాని, ఆపాతతః కలుగుగకపోయినను, వేదత్వమునకు మాత్రము భంగము కలుగక తప్పదు. భారతమున నర్థమునకు మాత్రమే

ప్రాధాన్యమున్నది కాని, శబ్దమునకుఁ బ్రాధాన్యము లేదు. కనుక నూతనాంశము లనేకముల నా యా సందర్భములఁ బురస్కరించుకొని యిందుఁ జేర్చుటకు వీలగుచున్నది. వేదములనుండి యే శబ్దమును గూడ తొలఁగించుటకు వీలు లేనట్లె, యధికముగ నొక శబ్దమును జేర్చుటకుఁ గూడ వీలు లేదు. భారతేతిహాసము విషయ ప్రాధాన్యమగు గ్రంథమగుటచేఁ, దరువాతి కాలమునం దనేక విషయముల నుచిత స్థలములలోఁ గూర్చుట కవకాశము కలిగినది. ఈ కారణముననే అనేకవిషయములు భారతమునఁ జేరుట కవకాశముకలిగినది. వ్యాస మహర్షి జయనామక భారతేతిహాసము నెనిమిదివేల యెనిమిదివందల శ్లోకములలో రచించెననియు, నీగ్రంథము రానురాను బ్రక్షిప్తముల కారణమున వృద్ధిఁ జెంది, లక్షశ్లోక విస్తృతమయ్యెననియు, భారతము వలననే నిశ్చయింపవచ్చును. వ్యాసుఁడు జయేతిహాసమును రచించి తన శిష్యులగు వైశంపాయన, సుమంత, పైల, జైమినులకును, బుత్రుఁడగు శుకునకును బోధించి, వారిచే దానిని లోకమునఁ బ్రచారము చేయించెనని తెలియుచున్నది. ఈయైదుగురును మూలగ్రంథమునుఁ బ్రచారమున కనుకూలించు విధమునఁ గొంత మార్చినట్లు గూడ భారతమునందే సూచనకలదు. వైశంపాయనుఁడు ప్రచారము గావించిన గ్రంథము మాత్రమే మనకు లభించియున్నది. జనమేయుని సర్ప సత్రసమయమున వైశంపాయనుఁడు భారతపఠనముఁ గావించెననియు, నాగ్రంథ మిరువదినాల్గువేల శ్లోకముల నొప్పెననియుఁ దెలియుచున్నది కనుక వైశంపాయనుఁడును, తదనుయాయులును మూలగ్రంథమును విస్తరింపఁజేసిన ట్లూహింపనగుచున్నది. తరువాత రౌమహర్షణి యగు సౌతి కాలమున కీగ్రంథము లక్షశ్లోక విస్తృతమైనది. పురాణ సమయమున దేశకాల వ్యవస్థల ననుసరించి పౌరాణికులు నూతన విషయములను మూలమునకు వ్యాఖ్యాన రూపముగఁ జేర్చుటయు

నచ్చటచ్చట కన్పడుచున్నది. భారత పఠనవేళ జనమేజయుఁ డనేక విషయములఁ గూర్చి వైశంపాయనునిఁ బ్రశ్నించుటయు, తవఁడందు లకుఁ దగిన సదుత్తరముల నిచ్చుటయు భారతమునఁ గాననగును. అట్లే సౌతియు మునుల ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములుగ ననేక విషయములఁ గూర్చి యుపన్యసించినాఁడు. ఈ ప్రశ్నోత్తరరూప విషయము వ్యాస రచిత మూలగ్రంథమున నుండుటకు వీలులేదనుట నిర్వివాదాంశము. వ్యాఖ్యారూపముగ నుదాహృతమగు విషయమంతయు గ్రంథమునఁ జేరుట మూలము విస్తృతిఁ గాంచుట కొక కారణము. అంతియకాక పౌరాణికుల యభిప్రాయమును బట్టియు, వారు భారత ప్రచారముచే సాధింపనెంచిన ప్రయోజనములను బురస్కరించుకొనియు, ననేకము లగు నూతన విషయములు గ్రంథమునఁ జేరుట కెంతేని యవకాశము కలదు. ప్రఖ్యాత పౌరాణికుఁడును, గవియు నగు రోమహర్షణి (సౌతి) చాలవరకు భారత గ్రంథవిస్తృతికిఁ గారకుఁడై యుండవచ్చు నని విమర్శకుల యభిప్రాయము. భాషావిషయక భేదములును, శైలీ వైవిధ్యమునుగూడ నీ యభిప్రాయమునకు దోహద మొనర్చుచున్నవి. ఇట్లు మనకులభించిన మహాభారతమున,వ్యాసరచితమైన భాగమెద్దియో యిదమిత్థమని నిర్ణయింప వీలులేదు. వేదాంత ధర్మశాస్త్రాది విషయ ములు, నుదాహృతములగు నుపాఖ్యానములు మున్నగునవి కథాసంద ర్భములతోఁ జక్కగ ననుసంధింపఁబడియుండుట వలనఁ బ్రక్షిప్తము లను వేరుపఱచుటకును సాధ్యము కాదు. ఇదికాక వేదాంత శాస్త్ర విషయములన్నియుఁ బ్రక్షిప్తము లనుటయును సమంజసము కాదు. మూల గ్రంథమునందే వేదాంత ధర్మనీతి శాస్త్రవిషయక భాగము లకుఁ బ్రాధాన్యము కలదనుట నిర్వివాదాంశము. లోకోద్ధరణమం ప్రయోజనముగ వేద విభాగముఁ గావించిన వ్యాసుఁడు భారతమును గూడ నట్టి ప్రయోజనము తోడనే రచించినాఁడు. వేదాధ్యయనము

చేయనివారికిని, ననధికారులకును గూడ ప్రాచీన విజ్ఞానము నందఁజేసి ననేకాని వ్యాసుని లోక సంగ్రహణము పూర్తికాదు. వేద ప్రతిపాదితములగు ప్రకృతి సత్యములను, ధర్మములను, కథామూలమున వ్యాప్తిచేయు చుండుటవలననే పురాణములకు నుపబృంహణము లని పేరు కలిగినది.

'ఇతి—హ—ఆస' అను వ్యుత్పత్తి ననుసరించి, పూర్వుల భౌతికాధ్యాత్మిక జీవితసర్వస్వమును చిత్రించుట యితిహాసముల యాశయమని తెలియుచున్నది. ఇట్టి యర్థవిశేషము ననుసరించియే భారతమితిహాసమని వ్యవహరింపఁబడుచున్నది. భారతమున కితిహాసమను వ్యవహారము ప్రసిద్ధమై యుండుటవలన భారతకథ కల్పితము కాదనియు, నదిజరిగిన విషయమనియు నిశ్చయింపవచ్చును. కురుపాండవ వంశములకుజరిగిన ప్రసిద్ధమగుకథ నిందితివృత్తముగ వ్యాసుడు గ్రహించినాఁడు. భారతకథతో వ్యాసునకును సంబంధమధికముగఁగలదు తన ప్రత్యక్షానుభవమునకుఁ జెందిన యీప్రసిద్ధేతివృత్తముత్కృష్టప్రయోజనము కొరకై వ్యాసునిచే నుపయుక్తమైనది. భారతకథను గావ్యరూపమునఁ బోషించుటమాత్రమే వ్యాసుని యుద్దేశము కాదనియు, విజ్ఞానవ్యాప్తిచే లోకము నుద్ధరించుట యతని యాశయమనియు విదితమగుచున్నది. తత్ప్రయోజనసిద్ధికై యతఁ డాధ్యాత్మిక శాస్త్ర విజ్ఞానసారమును జేర్చియే జయ మను నితిహాసరూప కావ్యమును రచించెనని నిశ్చయమగుచున్నది. భారతము ప్రమాణ గ్రంథముగ బ్రహ్మసూత్రాది వేదాంత గ్రంథములలో నుదాహృతమై యుండుటకు భారతస్థమగునీ విషయమే కారణమైనది. మూలగ్రంథ మాధ్యాత్మికవిషయ ప్రధానమగుటవలననే తరువాతి కాలమున నట్టివిషయ మింకను జేరుట కవకాశము కలిగినది. ఇట్లుగుహా భారతమునఁగల వేదాంత, ధర్మశాస్త్ర, నీతిశాస్త్రాది విషయమంతయును బ్రక్షిప్తము కాదనియు, వ్యాసుని

గ్రంథమునందే యీవిషయము ప్రాధాన్యము వహించినదనియు, నిశ్చయింపవచ్చును. ఈ విషయములను జేర్చుటలో వ్యాసునియొక్కయు, నతని యనుయాయులయొక్కయు నాశయ మొక్కటియే. లౌకికమగు భారతేతివృత్తము నాధారముగఁ గొని, పరబ్రహ్మస్వరూపమును, విధిప్రభావమును, లోకులకు వ్యక్తపఱచి, సత్యధర్మములను సంఘమునఁ బ్రతిష్ఠించుటయే వారి యుదాత్తాశయము.

ఇట్లు పరిష్కృతిఁ జెందిన మహాభారత మాధ్యాత్మిక విషయప్రధానమగు వైదికవాఙ్మయమును, భౌతికవిషయ ప్రధానమగు లౌకికజీవితముతో ననుసంధింపఁ జేయుచు, నాకాలపు సంఘజీవితమును సంస్కరించుట కుపకరించినది. పూర్వవిజ్ఞానమును సులభగ్రాహ్యమగువిధమునఁ బోషించుచుండుటయే కాక, రసవత్తరమగు లౌకికేతివృత్తముతో నొప్పు మహాకావ్యముకూడనై యుండుటచే మహాభారతము సంస్కృత సారస్వతమున విశిష్టరచన యగుచున్నది.

భారత మితిహాసము. కథ ప్రత్యక్షముగ జరిగినదియగుటచే నాకర్షణీయమై, లోకోద్ధరణ కెక్కువగ నుపకరించుచున్నది. మఱియు, వేద వాఙ్మయ సారమంతయు నిందుఁ బ్రతిపాదితమై యుండుటచే భారతమునకు వేదతుల్యత్వము సిద్ధించినది. ఇక, ధర్మశాస్త్ర నీతిశాస్త్రాదుల యందలివిషయము లన్నియు నిందు సులభ గ్రాహ్యమగురీతి వివరింపఁబడి యున్నకారణమున భారతము స్మృతి గ్రంథముకూడనగును. అంతియ కాక "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ, వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం," అను పురాణలక్షణము లైదును భారతయమునఁ గూడ సమన్వయ మగుచుండుటచే నియ్యది పురాణ సముచ్చయమనికూడ వ్యవహరింపఁ బడుచున్నది. సకలోపనిషత్సారమును నిందుఁ బ్రతిపాదితమై యుండుటవలన భారతము వేదాంత గ్రంథముకూడ నగును. ఇట్టి మహోత్కృష్టమగు నుద్గ్రంథమునకుఁ గర్త

విష్ణ్వంశసంభూతుఁడగు కృష్ణద్వైపాయనుడు. "వ్యాసో నారాయణో హరిః." వేదవిభాగముఁ గావించిన కారణమున "వ్యాసుఁ డను బిరుదము నందిన వేదవేదాంగాదివిజ్ఞాననిధియు, బ్రహ్మజ్ఞానియు, వాఙ్మయవిశ్వవిధాతయునగు కృష్ణద్వైపాయనునకు మాత్రమే యిట్టి మహాగ్రంథసృష్టి సాధ్యమైనది. వ్యాసకృత జయేతిహాసమును విపులముఁ గావించి, మహాభారతముగఁ బరిణమింపఁ జేసిన వైశంపాయన రౌమహర్షణాదులు కూడ, మహర్షులు, విజ్ఞాన వేత్తలు నగుటచే గ్రంథ పరివృద్ధి యుదాత్తమార్గమున జరిగినది.

ఇతివృత్తమును విశాలమైనది యగుటచే, జీవితమును సమగ్రముగఁ బోషించుట కనువైనది. ఒక్క కౌరవవంశమే కాక యాదవ పాంచాలమాత్స్య వంశములన్నియు నిందు ప్రాధాన్యము వహించినవి. ఈయితివృత్త మాధారముగ భారతీయ జీవితచరిత్రయంతయు నీ మహాకావ్యమునఁ జిత్రితమైనది. ఐహిక జీవితమున సంభవించు వివిధములగు సంఘటనలు, సమస్యలు, సాంసారిక సుఖదుఃఖాద్యనుభవములు, పాప పుణ్యముల ఫలములు, మున్నగునవన్నియు భారతమునఁ బ్రస్ఫుటము లగుచున్నవి. శంతనుని చరిత్రతో నారంభమై, యనేకముఖముల విస్తృతిఁ జెంది, పాండవుల స్వర్గప్రాప్తితో సమాప్తిఁ జెందిన ప్రధానేతివృత్తమాధారముగ నీగ్రంథమున సర్వతోముఖమగు లోకజీవితము ప్రతిబింబించినది. సత్యధర్మములను సంఘమున స్థాపించుట మహాభారత రచనాప్రయోజనము. అప్పుడట్టి యవసరమునుగలిగినది. మహాభారత కథాకాలము నాటి కార్యులసంఘము బహుముఖముల విస్తరించి యార్యావర్తమున వ్యాపించినది. ఆర్యానార్య సమ్మేళనము కూడ జరిగి సంఘము వృద్ధియైనది. ఈ కారణమువలనఁ బలువిధములగు నాచార వ్యవహారములు, సంఘ సూత్రములు, మతములుకూడ వివిధ ప్రదేశములలోఁ దలలెత్తినవి. ప్రజల కైహికములం దాసక్తియు, నాము

ష్మికములందు నిరాదరణమును,గలుగ సాగినది. తత్ఫలముగ సంఘమున న్యాయధర్మములు క్షీణించినవి. ఆ యధర్మ పరిణామఫలమే భారత యుద్ధము. భారతయుద్ధమునఁగలిగిన సర్వనాశమును బ్రత్యక్షముగఁ జూచినవాఁడగుటచే వ్యాసుఁడా యితివృత్తము నాలంబముగఁ గొని, ధర్మప్రచారముఁ గావించి సంఘమును బునరుద్ధరింపఁ బూనినాఁడు. విస్తారవ్యాప్తిఁ జెంది, బహుధా భిన్నమై యుండిన యార్యసంఘమును వేదమతైకసూత్రబద్ధము గావించుటయే వ్యాసుని యాశయము. తదాశయ సిద్ధికై ఆర్యవిజ్ఞాన సర్వస్వమును లోకమున వ్యాప్తిఁ గావింప వలసి వచ్చినది. కనుకనే వేదవాఙ్మయమునఁ బ్రతిపాదితమైన యార్య విజ్ఞానము నంతను భారతమునఁ గథా సందర్భముల ననుసరించి వ్యాసుఁడు చేర్చి యున్నాఁడు. ప్రజాబాహుళ్యమున కందుబాటులో లేని వేదాంత ధర్మ శాస్త్రాంతర్గత విషయములను లోకహితార్థము ప్రచారముచేయుట యింకొక ప్రయోజనము. భారతకథాభాగమంతయు నిరువదినాల్గువేల శ్లోకములలో నిమిడియున్నను గ్రంథము లక్షశ్లోక విస్తృతమై యుండుటకుఁ గారణ మిదియే యైయున్నది. వ్యాసుని యాశయము ననుసరించి యితివృత్తముకంటెను నాధ్యాత్మిక ధర్మశాస్త్రాది విషయమే ప్రధాన మగుటచే నీ భాగము కథకు మూఁడు రెట్లుండుటలో నాశ్చర్యము లేదు. వేదాంతశాస్త్ర గ్రంథ జాలమునుండి సందర్భముల కనుకూలించు ననేక భాగములను గ్రహించి భారతమున నితరులు చేర్చి యుండవచ్చు నను నభిప్రాయము కూడ సమంజసముగనే కనుపట్టుచున్నది. భారతమునకు సంహిత యను పేరుండుట యీయభిప్రాయమును బలపఱచు చున్నది. ప్రక్షిప్తమని చెప్పఁబడు నీ విజ్ఞానవిషయ ప్రాధాన్యముం బట్టియే భారతమునకుఁ బంచమవేదమనియు, స్మృతిగ్రంథ మనియుఁ బ్రఖ్యాతి కల్గినది.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్షణం బనియును
నైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ"

అను నన్నయ పద్యమువలన మహాభారత ప్రాశస్త్యము బాగుగ వ్యక్తమగుచున్నది. లోకజీవితమునకు సన్నిహితమగు నితివృత్తమును గావ్య రూపమునఁ బోషించి, తదాధారమున వైదిక లౌకిక వాఙ్మయ సారము నంతను వ్యాసుఁడు ప్రతిపాదించి యుండుటచే భారతము విశిష్టమగు నుద్గ్రంథమైనది. వేద విభాగముఁ గావించిన మహర్షియు బ్రహ్మ జ్ఞానియు, విపుల వాఙ్మయకర్తయు నగు కృష్ణద్వైపాయనుఁడు కావ్యకర్త యగుటచే మహాభారతరచన యలౌకికముగఁ బరిణమించి నది. రామాయణ మహాభారతములు రెండును ధర్మమునే ప్రయోజనముగఁ బ్రతిపాదించుచున్నను, రచనావిధానమునందు భిన్నము లగుచున్నవి. రామాయణము విశుద్ధమగు మహాకావ్యమగుటచే నందు రసోత్కర్ష ప్రాధాన్యము వహించినది. మానవ జీవితమునకు సన్నిహితము, నాకర్షణీయము, ప్రసిద్ధము నగు నితివృత్తము కావ్యరచనకుఁ దగినవస్తువు. అట్టి రమణీయమగు వస్తువును రసోత్పాదకమగు రచనచే బోషించుట కావ్య లక్షణము. కనుక వస్తు, రచనలు రెండును గావ్యమునఁ బ్రధాన విషయము లగును. ఐనను, పాఠక చిత్త వికాసమునకును, రససిద్ధికిని రచనావిశేషమే ప్రధానహేతు వగుటచే నది కావ్యములలోఁ బ్రాముఖ్యము వహించు చున్నది. ఇది కావ్య

సామాన్య లక్షణము. ఇఁక, మహాకావ్యమున వీరము ప్రధాన రసమగును. ధీరోదాత్తుఁడగు నాయకుని చరిత్ర ఆదినుండియుఁ దుదివఱకు ప్రాధాన్యము వహించును. సంధర్భములఁ బురస్కరించు కొని పోషితములైన యష్టాదశవర్ణనలు రచనకు సౌందర్యము నాపాదించును. నాయికానాయకుల సచ్చరిత్ర, వారికిఁ గలిగిన కష్ట సుఖములు, వారి ధర్మపరత్వ సత్ప్రవర్తనాదులు, తుదకు వారుపొందిన ధర్మవిజయము-మున్నగునవి లోకమున ధర్మ, న్యాయ, సత్య ములను బ్రతిష్ఠించుటకు సాధనము లగుచున్నవి. నాయికానాయకుల జీవితముతో ననుసంధించునట్లు, సన్నివేశము లన్నియుఁ, గావ్య ఫలాగమార్థము పోషితములు కావలెను. వివిధ సన్నివేశములు, సంఘటనలు, నిత్యాదులు రసవత్తరమగు విధమున రచితములగుటచేఁ గావ్య మాస్వాదయోగ్య మగుచున్నది. శాస్త్ర సంబంధములగు విష యము లందందుఁ గథాసందర్భముల ననుసరించిఁ స్మరింపబడినను, నవి కావ్యమునఁ బ్రాధాన్యము వహించవు. ఉపాఖ్యానములు, వేదాంత, ధర్మ, నీతి శాస్త్ర విషయములు, మున్నగునవి కథావేగమునకుఁ బ్రతిబంధకము లగుటచేఁ గావ్యరచనయందవి గృహీతములగుట లేదు.

ఇట్టి మహా కావ్యలక్షణములన్నియు రామాయణము నెడఁ జక్కగ సమన్వయముం బొందుచున్నవి. సీతారాముల యుదంతమే రామాయణమునం దాదినుండి తుదివఱకును బ్రధానేతివృత్తము. తక్కిన ప్రాసంగికేతివృత్తము లన్నియు నానుషంగికములై, ప్రధానేతి వృత్తమునకుఁ బోషకములగుచు. నందే యంతర్భావమును బొందుచున్నవి. ఇందు వీరరసము ప్రధానమును, దానికి శృంగార, కరుణములు ముఖ్యాంగములు నగును. పుత్రధర్మ, భ్రాతృధర్మ, భర్తృధర్మ,సతీధర్మ, ప్రభుధర్మములు రామాయణేతివృత్తమునఁ బరాకాష్ఠనందినవి. భారతసతీత్వము సీతాదేవి యందును, ధర్మవీరము రామునియందును మూర్తీభవించినవి. ఇతివృత్తమాదినుండియుఁ దుది

వలెకును, నేకధారగ ఫలోన్ముఖమై ప్రవహించు చున్నది. ఉత్తర కాండమందుఁ గూడ సీతాచరిత్రమే ముఖ్యేతివృత్తమును, ధర్మమే కావ్యప్రయోజనము నైయున్నవి. సందర్భోచితములుం, భావ పోషకములు నగు ప్రకృతివర్ణనలచే నొప్పుచు, రచన రసవత్తరమై, చిత్తవికాసమునకు హేతువగుచున్నది. కనుకనే రామాయణము మహాకావ్యమని పండితులచే నిశ్చయింపఁబడినది.

మహాకావ్య లక్షణములు భారతమునకుఁ గూడ వర్తింపకపోవు. కాని, రామాయణమునందువలె భారతమున వానికిఁ బ్రాధాన్యము లేదు. భారతమునం దర్థగౌరవమును, రామాయణమున రసోత్కర్షయు ముఖ్యములు. ఇతిహాస ధర్మశాస్త్ర లక్షణములు భారతముతో జక్కగ సమన్వయమును బొందుచున్నవి.

ఆదర్శ ధర్మవీరుఁడగు రామునిచరిత్రను గావ్యరూపమునఁ జిత్రించుటయే వాల్మీకి యాశయము. సీతారామలక్ష్మణుల జీవితములు మన కున్న తాదర్శము లగుచున్నవి. రామాయణ పఠనమువలన మనకు నీతి, ధర్మాదిజ్ఞానము పరోక్షముగ గల్గినను, బ్రత్యక్షముగ సిద్ధించునది సాత్త్వికమగు చిత్తవికాసము, సద్యఃపరనిర్వృతి. కనుక రామాయణరచన యందుఁ బ్రాధాన్యము వహించినది కావ్యపద్ధతి. విపులసంఘుసంస్కరణ వ్యాసుని యాశయమగుటచే భారత రచనా విధానము కావ్యరచనకంటె విశిష్టముగ నున్నది. భారతము శాంత రసప్రధానమనియు, దానికి నాయకుఁడు శ్రీకృష్ణుఁడనియుఁ బెద్దలు నిశ్చయించినారు. రచనయందు రసోత్కర్షకన్న నర్థగౌరవమున కెక్కువ ప్రాధాన్యము కలిగినది. మతసూత్రములను, నాధ్యాత్మిక విషయములను, నీతిధర్మసూత్రములను, లోకమునఁ బ్రచారముగావించుటకు శాస్త్ర గ్రంథములకంటెను గావ్యములెక్కువగ ననుకూలించుటచే, వ్యాసుఁడు పాండవేతివృత్తమును గావ్యముగ రచించి, తదాలంబనమున దన యాశయమును నెరవేర్చుకొన్నాఁడు. కనుక

భారతము కావ్యము, శాస్త్రము కూడ నగుచున్నది. ఇతివృత్తము లౌకికమును, దన్మూలమునఁ బ్రతిపాదితమగువిషయమాధ్యాత్మికము, నగుటచే భారతము లోకకల్యాణసిద్ధి కుత్కృష్టసాధన మగుచున్నది.

"కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంత సాధనంబైనదాని"

అని యీవిషయము భారతమునందే వివరింపఁబడినది.

ఆయుష్యం బతివాస వస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తి నిమిత్తముత్తమ సభాసేవ్యంబు లోకాగమ
న్యాయైకాంత గృహంబు నాఁబరగి నానావేద వేదాంత
విద్యాయుక్తంబగు దానిఁ జెప్పఁదొడఁగెం దద్భారతాఖ్యానమున్.

ఇట్టి విశిష్ట ప్రయోజన సాధనమగు నీ యుద్గ్రంథము ననువదించుఁటతో నాంధ్రసారస్వత మారంభమగుట ఆంధ్రుల భాగ్యవిశేషము. భారతాంధ్రీ కరణమునకు గూడ లోకహితమే ప్రయోజనము. రాజరాజు కాలమునాటి కాంధ్రదేశము సంఘమత కల్లోలములకు లోనై యుండినది. విజాతీయులగు శత్రువుల దండయాత్రల వలనను, జైన బౌద్ధ మతముల వ్యాప్తివలనను, వేద ప్రమాణములను దిరస్కరించుఁ కౌత్స, చార్వాకాది మతముల వ్యాప్తివలనను, నార్యధర్మములు వెనుకఁబడినవి. స్వార్థపరులు గావించుచున్న నిరీశ్వరాది మత ప్రచారము ప్రజలలో నైక్యమును నశింపఁజేసి, సంఘవిచ్ఛిత్తికి గారణమైనది. ఇట్టి క్లిష్ట పరిస్థితియందున్న యార్యసంఘమును బున రుద్ధరింపఁ బూనుకొనిన వారిలోఁ గుమారిలభట్టు ముఖ్యుడు. శంకరాచార్యులకు బ్రాచీనుఁడగు నీ కుమారిలభట్టు పూర్వమీమాంసా విధానమును బహుళ ప్రచారముఁ గావించియున్నాఁడు. తత్ఫలితముగ యజ్ఞయాగాది వైదికక్రియలకు మరల నాంధ్రదేశమునఁ బునః ప్రచారము కలుగసాగినది. ఈ యార్యమత పునరుద్ధారణ కాలముననే రాజరాజు పాలకుఁడగుట తటస్థించినది.

ఆర్య మతావలంబియగు నీతఁడు సారస్వత మూలమున మతవ్యాప్తిఁ గావింప నిశ్చయించినాఁడు. వేద పురాణాదుల యందును, మను, గౌతమ, పరాశరాదిఋషిప్రోక్త స్మృతులయందును, ప్రపంచితములైన సకలధర్మముల నొప్పి, వర్ణాశ్రమ ధర్మములకు నిలయమై, వేదసార మనఁదగిన భారతము నాంధ్రీకరించి, దేశమునఁ బ్రచారముఁ గావించినచో నార్య మతము పునరుద్ధృత మగుననియు, సంఘమున నైక్యము సిద్ధించుననియుఁ దలఁచి, రాజరాజు తన్మహాకార్యనిర్వహణ మునకు నన్నయను బ్రోత్సహించినాఁడు. లోకహితముఁగోరిన నన్నయ వ్యాసు ననుసరించి యాంధ్ర భారతరచన నారంభించినాడు. ఇట్లు సంస్కృతభారత రచనకును, నాంధ్రభారత రచనారంభమునకును గూడ లోకసంగ్రహేచ్ఛయే హేతువైనది. ఇఁక, తిక్కన్ననాటి కాంధ్రదేశమునఁ బరిస్థితులు మారినవి. చార్వాకాది మతములకు వ్యాప్తిలేకున్నను, జైనమత మింకను విజృంభించియే యున్నది. పాలకుల యభిమాన మాధారముగ నొకప్పుడు వైదికమతమును, నొకప్పుడు జైనమతమును, బ్రాబల్యము వహించు చుండినవి. ఇది గాక పాల్కురికి సోమనాథాదుల రచనలవల్లను, బండితత్రయము వారి కాంధ్రదేశమున నుండిన పలుకుబడివల్లను, వీరశైవము ప్రబలి సంఘమున మతకలహములకు హేతువైనది. బ్రాహ్మణమతావలంబు లగువారియందే శైవ వైష్ణవ మతములు స్థిరపడి క్రొత్తతెగలను సృష్టించినవి. సంఘమునకు మార్గదర్శకులు కావలసిన కవులయందును మతవిషయక విభేదము లేర్పడినవి. శివకవులు భవికవులను నిరసించుట యిందులకుఁ దార్కాణ మగుచున్నది. ఇట్టి క్లిష్టపరిస్థితుల నుండి సంఘమును రక్షించు నుద్దేశముతోఁ దిక్కన భారతమును బూర్తి చేయ సంకల్పించినాఁడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరబ్రహ్మయొక్క యంశములు. వీరొనర్చు సృష్టిస్థితిలయములు సగుణాత్మకమగు పరబ్రహ్మలీలలు, కనుక శివకేశవు లా

పరమాత్మ యొక్క భిన్నమూర్తులు అను జ్ఞానము ప్రజలకుఁ గలిగించుటకై తిక్కన హరిహరమూర్తి నిష్టదేవతగా స్తుతించి తన భారత మా దేవున కంకిత మొనర్చినాఁడు. ఇతని యుదారాశయము ఫలించి సంఘమున శివ కేశవ భేదము లడఁగినవి. తిక్కన తరువాత వచ్చిన నాచనసోముఁడును, దిక్కన మనుమఁడును శిష్యుఁడును నగు కేతనయు, నీ యుత్తమాదర్శము నవలంబించి హరి హరునిఁ బూజించినారు. గౌరవి గోపరాజుకూడ హరిహరారాధకుఁడే. తిక్కన తరువాతి కవులు వైష్ణవులైనను శైవులైనను బరమత దూషణఁ గావింపలేదు. మీఁదుమిక్కిలి పరమత సహనమునే ప్రదర్శించినారు. ఇట్లు తిక్కన, శివ కేశవ భేదమును బరిహరించుట యేకాక, జీవాత్మ బరమాత్మైక్యమును బోధించు నద్వైతమును భారతమునఁ బ్రతిపాదించి, యాంధ్రసంఘము నేకైక మతసూత్రనిబద్ధ మగునట్లు గావించినాఁడు. దక్షిణాపథమునం దాంధ్ర దేశమున నద్వైత మునకున్న ప్రాధాన్యము ద్వైతవిశిష్టాద్వైతములకు లేకుండులకు తిక్కన భారతము కారణమని చెప్పవచ్చును. తమిళ దేశమున నద్వైత విశిష్టాద్వైతములును, కన్నడ దేశమున ద్వైత, విశిష్టాద్వైత వీర శైవములును, ప్రాధాన్యము వహించియున్నవి. తమిళ దేశమున వైష్ణవ మతవ్యాప్తికి నాళ్వారులును, శైవమునకు నాయనారులును, నెక్కువగ దోహద మొనర్చియున్నారు. అట్లే కన్నడ దేశమున వీర శైవ విజృంభణమునకు గురుజంగములు మూలపురుషులు. ఈ మతములన్నియు భక్తి నాలంబముగఁ గొని తదనుయాయుల భావావేశ ప్రాబల్యముచే నెక్కువ వ్యాప్తిఁ జెందినవి. జ్ఞానమార్గము కంటెను భక్తిమార్గము సులభ సాధ్యమగుటచే, పామరజనసంఘ మధికముగ నీమతముల నవలంబించుటకు వీలైనది. వేదాంత శాస్త్ర జ్ఞానమును, దార్కికదృష్టియు నుండిననే కాని యద్వైతము సుబోధకము కాదు. అద్వైతమును సులభగ్రాహ్య మగు విధమునఁ

ప్రజలకు బోధించు గ్రంథములు తమిళ కర్ణాటభాషలలో నంతవఱకును వెలువడకుండుటచే నా దేశములలో నద్వైతవ్యాప్తి కవకాశము లేకపోయినది. వేదసారమును, నద్వైతమత ప్రతిపాదకమును, నగు మహాభారతమును దేశభాషయగు జానుదెనుఁగునఁ దిక్కన రచించుటవలన, నాంధ్రదేశమునఁ దన్మతవ్యాప్తి యెక్కువగ జరిగినది. నన్నయ తిక్కనల యున్నతాశయములను సిద్ధిఁబొందింపఁ జేయు నుద్దేశముతో నెఱ్ఱాప్రెగడయు నరణ్యపర్వ శేషభాగమును బూర్తిచేసి, భారతానుబంధ మగు హరివంశమునుగూడ రచించి యున్నాఁడు. ఇట్లు వ్యాసభారత రచనకును, భారతాంధ్రీకరణమునకును ప్రయోజనతుల్యత్వము సిద్ధించియుండు టాశ్చర్యము. అంతియకాక, పంచమ వేదమనియు, ధర్మశాస్త్రమనియుఁ బ్రసిద్ధిఁగెంది పవిత్ర గ్రంథముగఁ బూజింపఁబడుచున్న మహాభారతమును దెనుఁగున రచించుటకు, సాధారణులగు లౌకిక కవులుకాక ఋషితుల్యులగు కవిత్రయమువంటి వారు లభించుటయు, వారి యాశయము ప్రజాహిత మగుటయుఁ, దెలుఁగువారి భాగ్యము. 'నానృషిః కురుతే కావ్యమ్'' అను నార్యోక్తి కవిత్రయమువారి విషయమున బూర్తిగ సమన్వయించుచున్నది. రాజాశ్రయమును గాంచి, యైహిక విషయములతో సంబంధమున్న వారయ్యును వీరి యాంతరదృష్టి సర్వదా యాముష్మికము వైపే ప్రసరించినదని వీరిరచనల వలననే తెలియుచున్నది. భారత రచనవలన వీ రాశించినది భవబంధ విమోచనము.

"భారత భారతీ శుభ గభస్తి చయంబులఁ జేసి ఘోరసం
సారవికార సంతమస జాల విజృంభము వాపి సూరి చే
తో రుచిరాబ్జబోధన రతుండగు దివ్య పరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్చి"

అను వాక్యమువలన, నన్నయ భారత రచనచే సంసారబంధములఁ దొలఁగించుకొనఁ దలఁచినాఁడని యూహింప నగుచున్నది.

కలయందు గోచరించిన హరిహరనాథునకుఁ దిక్కన భక్తిఁజేసి "యింక జన్మాంతర దుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే" యని ప్రార్థించిన నజ్జగన్నాథుండు,

"జనన మరణాదులైనసంసార దురిత
ములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువు
గను వెలుంగు నీకిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ."

మేలుకాంచినాఁడు. ఇట్లు తిక్కన యాశయమును భవబంధవిమోచన మని తెలియుచున్నది. ఇంతియ కాక,

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహా కవిత్వ దీ
క్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్."

అను తిక్కనపల్కువలన నతని యుదారాశయము వ్యక్తమగుచున్నది. "భారతామృతము" అను ప్రయోగమున నభేదరూపకము గావింపఁబడినది. అమృత శబ్దము 'పరబ్రహ్మ' వాచి. పరబ్రహ్మజ్ఞాన మననాదిక యోగముచే నానందసిద్ధి గలుగునట్లు భారతాఖ్యాన శ్రవణముచే నాంధ్రుల కానందము సిద్ధించునను విశిష్టార్థ మిందు స్ఫురించుచున్నది.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే" పరబ్రహ్మ సాక్షాత్కారమునకు సాధన మగునది విద్య, యను నర్థము భారతమునెడ తిక్కనసమన్వయింపఁజేసినాఁడు. భారతరచన తనకును, తన జాతివారికినిఁ గూడ నిత్యశ్రేయమును గలుగఁజేయునను తిక్కన యాశయ ముదాత్తమైనది. వీరిట్లు నిత్యమగు మోక్షఫలమును గోరిన వారగుటచే భారతామ్నాయ కర్మనిర్వహణమునందు యోగు

లైనారు. కనుక యోగులయందువలెనే కవిత్రయమువారి రచనల యందును సంయమనము విశిష్టలక్షణమై యొప్పినది. కొలదిమాటలలో విపులార్థము నిమిడించుటయు, విశేషార్థములు వలయుచోట దానిని వాచ్యముచేయక వ్యంగ్యశక్తిచే స్ఫురింపజేయుటయు, గాంభీర్యగుణప్రసన్నధాములుగ బాత్రల శీల స్వభావాదులను జిత్రించుటయు, వర్ణనల విషయమున నలంకార చమత్కార వ్యామోహము నకు లోనుగాక సహజ సిద్ధమగు రమ్యత నర్థగౌరవముచే వికసింపజేయుటయు—నివి కవిత్రయము వారి రచనలయందలి ప్రధానగుణములు. ఇట్టి సంయమనము తరువాతి కవులలోఁ గానరాదు. కాలము ననుసరించియు, సంఘజీవితము ననుసరించియుఁ, బ్రజల జీవితాదర్శములును, వానితోఁ గావ్యరచనను గూర్చిన యభిప్రాయములును మారుచువచ్చినవి. తదనుగుణముగఁ గవుల జీవితములును వేఱైనవి. కవిత్వదీక్షను బూని, సంయమియై, లోకహితముఁ గోరి, కావ్యరచనఁ గావించు కవి లేకపోవుటవలన భారతముతోఁ దూఁగఁగల కావ్యమింతవఱకును మఱల సృష్టికిరాలేదు. నాఁటికిని నేఁటికినిఁ గవిత్రయ భారతము లోకకల్యాణ ప్రతిపాదకమగు మహాకావ్యమగుటయేకాక, ఆంధ్రుల విజ్ఞాన సర్వస్వము నైయున్నది.

డాంటే రచించిన డివైన్ కామిడీ (Divine Comedy) ఇటలీ దేశస్థులకును, హోమరు రచించిన ఇలియడ్ (Iliad) గ్రీకులకును, షేక్సుపియర్ రూపకములును, మిల్టను పారడైజ్ లాస్ట్ (Paradise Lost) అను గ్రంథ మాంగ్లేయులకును, నెట్లు జాతీయ జీవితసర్వస్వములో, అట్లే భారత మాంధ్రుల జాతీయ జీవితసర్వస్వమగుచున్నది. ఒక జాతియందుఁ బెంపొందిన సారస్వతమును, దన్మూలముగ జరిగిన విజ్ఞానాభివృద్ధియుఁ, బ్రపంచచరిత్రయందా జాతికి లభించు గౌరవము నకు హేతువులగుచున్నవి. రాజకీయరంగమున నొక దేశమునకుఁ

గలుగు ప్రాధాన్యము స్థిరమైనదియుఁగాదు, సత్యమైనదియుఁగాదు. ఉత్కృష్టసారస్వత నిర్మాతలై, స్వార్థరహితులై, విజ్ఞానవ్యాప్తిఁ గావించి, లోకహితము నాచరించిన మహామహులే నిజమగు జాతీయ నాయకులని పాశ్చాత్యుల యభిప్రాయ మగుటచే వారి దేశములలో సారస్వతస్రష్టల కనన్యలభ్యమగు గౌరవము కలదు. రాజ్యతంత్రము లను ధీసామర్థ్యముతో నిర్వహించి, దేశీయార్థికస్థితిని బాగుపఱచిన యేమహామంత్రికిని, నాంగ్ల దేశమున మిల్టను బెర్నార్డుషాల వంటి మహాకవులకున్న పూజ్యస్థానము లేదు. రాజకీయకల్లోలములు పెచ్చు పెరిగిన యీ రోజులలోఁగూడ షేక్సుపియరు జన్మస్థానము నొకపవిత్ర స్థలముగఁ బ్రభుత్వమువారు రక్షించుచుండుటయు, విద్యావంతు లా ప్రదేశమునకు యాత్ర పోవుచుండుటయు నిందులకు నిదర్శనములు. కార్లైలు రచించిన వీరపూజ (Hero Worship) అను వ్యాససంపు టికిఁ గల బహుళ ప్రచారమా దేశమునఁ గవులకుఁ, బండితులకుఁ, గల గౌరవమునకుఁ బ్రబల సాక్ష్యము.

షేక్సుపియరు రచనలనుగురించిన సద్విమర్శక గ్రంథములు, వ్యాసములు నసంఖ్యాకములు. ఆంగ్లేయుల దేశీయాభిమాన భాషాభి మానములును, వారి విజ్ఞానాసక్తియు, నిందులకుఁ గారణములు. ఆంధ్రుల ప్రాచీన నాగరికతకును, సంస్కృతికినిఁ బ్రత్యక్షప్రమాణ మగు నాంధ్రమహాభారతరచన పూర్తియై యిప్పటి కారు శతాబ్ద ములు గడచినను, దదుద్గ్రంథమును గూర్చిన సమగ్రమగు విమర్శక గ్రంథ మింకను సృష్టికి రాలేదు. ఆదినుండియు నాంధ్రమున వచన రచన కాదరము లేకపోవుట యిందులకొక కారణము. ఆంధ్రాభి మానము పూర్తిగ రాజకీయములందే వినియుక్తమై సారస్వత విజ్ఞానాది విషయముల కేమియు మిగులకపోవుట మఱియొక హేతువు. సరియగు విద్యావ్యాప్తి లేకపోవుటచే నుద్గ్రంథపఠనమే దేశమున్న

లోపించినది. ఆముష్మిక దృష్టి సంఘమున నున్నంతకాలము భారత రామాయణములను పురాణములుగఁ జెప్పించి విను నలవాటైనఁ గొంత యుండెడిది. కాని ప్రజలలో నార్థికదృష్టి మితిమీరి ప్రబలుటచేఁ బురాణ శ్రవణాదులకుఁ గూడ నవకాశము లేకపోయినది. తాత్కాలికాహ్లాద వినోదములు గూర్చు కథలకును, నింద్రియోద్రేకమును గలిగించు రచనలకును, సంఘమున నున్నంత ప్రచార మున్నత కావ్యములకును, విజ్ఞాన గ్రంథములకును లేదు. సామాన్యులగు నక్షరాస్యులు మాత్రమే కాక విద్యావంతులు కూడ నిట్టివానినే యన్వేషించుచు, భారతాది గ్రంథములను స్మరింపకుండునట్టి స్థితి యేర్పడినది. పూర్వగ్రంథములను బఠించువారు ఛాందసులుగను, నభ్యుదయ ప్రతిబంధకులుగను, గణింపఁబడుట కూడ జరుగుచుండుటచేఁ గొంద అభిమానముండియుఁ, బరిహాసపాత్రుల మగుదు మను భీతిచే నుద్గ్రంథముల ప్రశంస చేయుట లేదు. సామ్యవాదసిద్ధాంతములు గావ్యప్రపంచమునఁగూడ ప్రవేశించుటవలన, నక్షరజ్ఞానశూన్యులగు మిల్లుకూలీల కందుబాటులో లేని భారతాదులగు నుద్గ్రంథములు నిరర్థకములుగఁ బరిగణింపఁబడు దుస్థితి యేర్పడినది. పరీక్షల కింకను భారతాది గ్రంథములలోని భాగములు పాఠ్యములుగ నిర్ణీతము లగుచుండుట వలననే నధ్యాపకులును, విద్యార్థులును, దప్పనిసరియై వానినిఁ బఠించుచున్నారు.

ఇట్లు మూలగ్రంథమే విస్మృతమగుచున్న కారణమున విమర్శకనుకూల పరిస్థితులే లేకపోయినవి. ఐనను భాషాభిమానము జాత్యభిమానముగల కొందఱు పండిత విమర్శకుల స్వయంకృషి ఫలితముగ నొకటిరెండు విమర్శగ్రంథములు, వ్యాసములు వెలువడకపోలేదు. 'కవిత్రయ కవితా విమర్శనము'న నన్నయాదుల అనువాద విధానమునుగూర్చియు, తదౌచిత్యమును గూర్చియుఁ బ్రశంసించుట ప్రధాన

విషయము. 'తిక్కన సోమయాజి', 'భారత కవితా విమర్శనము' మున్నగు గ్రంథములలోఁ దిక్కన కాలపు చారిత్రిక విషయములకును, విరాటపర్వ రచనాప్రాశస్త్యమునకును మాత్రమే ప్రాధాన్యము కల్గినది. ఆదికవియుఁ, గవితాపట్టాభిషిక్తుఁడు నగు నన్నయ్య రచననుగూర్చి రామలింగారెడ్డిగారి వ్యాస మొక్కటియే మినుకు మినుకు మనుచున్నది. కావున నేటివఱకు భారతము నామూలాగ్రముగ విమర్శించుటలో నేమాత్రమును బ్రయత్నము జరుగలేదనియే చెప్పవచ్చును. భారతము మహాసముద్రము. దుర్గమార్గజల గౌరవ భారత భారతీ సముద్రము నీదుటకు విధాత్మనకైనను శక్యము కాదని, అనన్యప్రతిభాశాలియగు నన్నయయే సంకోచమును బ్రకటించి యుండఁ, దద్గ్రంథ విమర్శనము అస్మదాదులకు దుష్కరమనుటనిజము. ఐనను భారత విమర్శనకుఁ బండిత విమర్శకులను బ్రోత్సహించు నుద్దేశముతో, నే నీ గ్రంథరచనకు సాహసించుచున్నాను. ఇందుఁ గూడ నింతవఱకు విమర్శకులచే స్పృశింపఁ బడని భారతభాగమునకు, నందులోఁ దిక్కనరచనకు మాత్రమే నా యీ విమర్శ పరిమితమై యున్నది. నన్నయ యెఱ్ఱనల భారతభాగ రచననుగూర్చిన విమర్శ యింకను జరుగవలసియున్నది. కావ్యమునందలి రసవత్తరములగు ఘట్టములను, నర్థవిశేషములను, బాత్రల శీలపోషణౌచిత్యాదులను, సహేతుకముగ వివరించి, గ్రంథపఠనమందుఁ బాఠకుల కాసక్తినిఁ గల్గించుట విమర్శకుఁ బ్రధాన ప్రయోజనమను సూత్రము నా కీ రచనయం దాదర్శమగుచున్నది.

# విరాటపర్వము

"హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానా రసాభ్యుదయోల్లాసి విరాటపర్వము" అని తిక్కన తత్పర్వగతేతివృత్తమెట్లు ప్రబంధరచన కనుకూలించుచున్నదియుఁ, దత్ప్రారంభముననే వ్యక్తముఁ జేసియున్నాఁడు. ఇందలి యితివృత్తము మానవజీవితమున కత్యంతము సన్నిహితమును, వీరశృంగారాది రసముల కాశ్రయమును నగుటచే హృదయాహ్లాది యగుచున్నది. సాధారణముగ లోకమున సంభవించు వివిధ సన్నివేశములు, తత్తత్సందర్భములలో వ్యక్తుల ప్రవర్తనలవలన వ్యక్తములగు వారివారి నైజ శీల స్వభావములు, మున్నగువాని కీ కథాభాగమున నెక్కువ యవకాశమున్నది కావుననే లౌకిక జీవితమిందు సంపూర్ణముగఁ బ్రతిబింబించిన దనవచ్చును.

కీచక వృత్తాంతము, ఉత్తరగోగ్రహణము, అభిమన్యు వివాహము-ఇవి యీపర్వమునఁ ప్రధాన ఘట్టములు. కీచకవృత్తమున వీరరస మంగియు, రౌద్రరస మంగమును గాఁగా నుత్తర గోగ్రహణ కథయందు వీర మంగియు, హాస్యము తదంగము నైనవి. ఉత్తరాభిమన్యు వివాహఘట్టము లలిత శృంగార ప్రధానమై మనోహరమైనది. అసహాయస్థితియందున్న పతివ్రతకు దుర్మార్గులవలన పరాభవము జరుగుట, శీలరక్షణకై యామె ప్రయత్నమొనర్చుట, వానిననుసరించిన యితర పరిణామములు, మున్నగునవన్నియు లోక సామాన్యములగుటచేఁ గీచకేతివృత్తము సహజముగనే ఆకర్షణీయమైనది. అట్టి యితివృత్తమును బోషించుటలోఁ దిక్కన, ఆఖ్యాన మార్గమును గాక, ప్రబంధమార్గము ననుసరించుటవలన నీ రచనకుఁ గడుంగడు మనోహరత్వము సిద్ధించినది. పరాశ్రయవృత్తి జీవనమందును, దాస, రాజాశ్రయమందునుగల కష్టములు పాండవుల విరాటనగర జీవితమువలన వ్యక్తములగుచున్నవి. విరాటుని వినోదమునకొఱకు భీముఁడు

జెట్టిమల్లురతో మాత్రమే కాక సింహాది క్రూరసత్త్వములతోఁ గూడఁ బోరవలసి వచ్చుటయు, దాస్యభావమునం జేసి స్వామిని యగు సుధేష్ణ యాజ్ఞను మీరఁజాలక, యాసవముఁ దెచ్చుటకై ద్రౌపది కీచకునింటికిఁ బోవుటయు, నాత్మాభిప్రాయము నధిక్షేపించిన ధర్మజుని విరటుఁడు పాచికలతోఁ గొట్టుటయు, నిత్యాదు లందులకు నిదర్శనములు. ద్రౌపదీ ధర్మజాదుల దాస్యమే వారి నిస్సహాయ స్థితికిఁ గారణమైనది. కీచకుని కాముక వ్యాపారము, వీరక్షత్రియ నారీమణియగు ద్రౌపది యొనర్చిన కీచకవధోద్యోగము, తత్ఫలితముగఁ గలిగిన సన్నివేశములు, నిత్యాదులు సుధేష్ణాకీచకుల యొక్కయు, ద్రౌపదీ ధర్మజాదుల యొక్కయు నంతః ప్రకృతులను, శీలస్వభావాదులను వ్యక్తపఱచు ఘట్టములు. దైనందిన మానవ జీవితమునఁ గాననగు కాముక స్త్రీలోలుపత, యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యత, తత్పరిణామము, కీచకవృత్తాంతమున వర్ణితములై యుండుటచే నీ ఘట్ట మాహ్లాదకర మగుచున్నది. భీమకీచకులు నాయక ప్రతినాయకులుగను, వీరము ప్రధాన రసముగను, ధర్మార్థములు ఫలముగను గలిగిన యీ ఘట్టము నొకచిన్న ప్రబంధముగఁ దిక్కన పోషించియున్నాఁడు. లోకజీవితము నందు సాధారణముగఁ ప్రాధాన్యము వహించు నింద్రియ వ్యాపారములైన కామక్రోధాదు లీ కీచక వృత్తాంతమున ముఖ్యవిషయము లగుటవలన, దిక్కన రచనయు, వాని కనుగుణముగఁ బ్రబంధ మార్గమున నడచినది.

తిక్కన యీ ఘట్టమున రచించిన ఉద్యానవన, సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనములు తరువాతి కాలమునఁ బెంపొందిన ప్రబంధరీతి కాదర్శములైనవి. విరాటపర్వమున సూచితమైన యీ విధానమే యెఱ్ఱన సోమనాథులచే సుగృహీతమై, శ్రీనాథాదులచే బోషితమై, రాయలకాలమునఁ బరిణతిఁ గాంచినవి.

"నీరజాకరములు నిద్రమాన్పఁ జేసిన
భవ్య తపంబున ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహర బ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాఁ గరఁగిన గుటికయనఁగ
నతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకంద మనఁగ
నఖిల జగముల కన్దెఱ యగుచు జన స
మాజ కరపుట హృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె."

భవ్య తపఃఫలంబగు పరంజ్యోతిస్స్వరూపము, విశుద్ధ ప్రేమపరిణామమగు రసస్థితి, హరిహర బ్రహ్మైక్య జ్ఞానమూర్తి, వేదత్రయ జన్మకారణమగు పరబ్రహ్మ స్వరూపము, నను నిట్టి యలౌకికోపమానములచే వర్ణన కుదాత్తత సిద్ధించినది. హృదయంగమములైన యీ యుత్ప్రేక్షలు రచనకు మనోహరత్వము నాపాదించుటయే గాక, సూర్యభగవానుని పరబ్రహ్మతత్త్వమును బ్రతిపాదించునవియై, పఠితృ మానసములను భక్తిభావపూరితములుగ నొనర్చుచున్నవి. 'అఖిల జగముల కన్దెఱ యగుచు' ననుటలో, సూర్యభగవానుఁడు చైతన్యప్రదాతయు, జ్ఞానప్రదాతయు నగునను నర్థము సిద్ధించినది. అట్టి పరబ్రహ్మ స్వరూప సాక్షాత్కారముచే జనుల హృదయములు వికాసము నొందుటయు, వారు భక్తిచేఁ గరములు మోడ్చి, సూర్యభగవానునకుఁ బ్రణమిల్లుటయు, నొక్కుమ్మడి జరుగు కార్యములు. ఈ యుదాత్తార్థమును బ్రతిపాదించుచుఁ, దిక్కన, యథాసంఖ్య

రూపకోత్ప్రేక్షాతుల్యయోగితల నతిప్రౌఢముగఁ బోషించి యున్నాఁడు. జగజ్జ్యోతియు, విష్ణుస్వరూపమును నగు సూర్యుని వర్ణించుచుఁ దిక్కన గ్రహించిన పవిత్రములగు నుపమానము లతని యుదాత్త కవితాతత్వమునకు నిదర్శనములగును.

ఇచటి సూర్యాస్తమయ వర్ణనకూడ భావనాచమత్కార ప్రధానమై, ప్రబంధరీతికి జక్కని లక్ష్యమగుచున్నది.

"ఇనుఁడు దనకడకు నేతెం
చిన రాగముఁ బొందుటది యుచితమనఁగాఁ గెం
పునమెఱసి పశ్చిమాశాం
గన జనసంభావనముల గారవమందెన్."

సూర్యుఁడు పశ్చిమదిక్కును జేరఁగాఁ దద్దిశ సాంధ్యారుణరంజిత మైనది. భర్తయగు సూర్యుఁడు తన కడకు రాగాఁ, బశ్చిమదిశా కాంత యనురాగ యుక్తయగు టది యుచితమనునట్లు కెంపున, బ్రకాశించినదని యుత్ప్రేక్ష. 'ఇనుఁ' డనుశబ్దము సూర్యపరముగను, భర్తపరముగను బ్రయుక్తమగుటచే శ్లేష. అట్లే 'రాగము' అను పదము రక్తిమ యను నర్థమును, ననురాగమను నర్థమును బోధించు చున్నది. మఱియు, శృంగారకారణమగు ననురాగము వర్ణమెరు పగుటచే, రాగమను శబ్ద మర్థవంతముగఁ బ్రయుక్తమైనది. ఇఁక, అస్తమయకాలమున జను లర్ఘ్యాదులచే సూర్యభగవాను నుపాసించుట లోకధర్మము. దినమంతయుఁ, దమతమ కార్యములలో నిమగ్నులై యున్న లోకులు విశ్రాంతి విహారముల కనుకూలమగు సాయం సమయము నాసక్తితో నిరీక్షించుటయుఁ, దత్సమయ సిద్ధిచే వారు సంతోషించుటయు, లోక సహజములగు విషయములు. భర్తృ విరహితమైయున్న పశ్చిమాశాకాంత కిప్పుడు భర్తృ సమాగమము కలుగుటచే నామె లోక సంభావనీయురాలైనదని, చమత్కారముగ నీ ప్రకృతివిషయమును దిక్కన వర్ణించినాఁడు.

భర్తృప్రేమను బొందిన కాంతను లోకులు గౌరవముగఁ జూచుటం తయును సహజమేకదా! ఇట్టి ప్రకృతివర్ణన సహజాలంకార చమత్కార ప్రధానమై, హృదయవికాస హేతువగుచున్నది. ప్రబంధ రీతికి లక్ష్యమనఁదగిన వసుచరిత్ర రచనా విధానమునకే తిక్కన రచన ఆదర్శమైనదనుటలో నతిశయోక్తి లేదు.

అట్లే, ఉద్యానవన వర్ణనా సందర్భమున కీచకుని కాముక చిత్త వృత్తి కనుగుణములగు వనశకుంతముల విహార మతి సుకుమారముగఁ బోషిత మైనది.

> "ఇంపైన ప్రియ కానసిచ్చి నిల్చినమధు
> వాదటనాను మత్తాలివిభునిఁ
> జెట్టుపల్లవరించి చుట్టుఁ గ్రుమ్మరి మనో
> రమ నియ్యకోలుపు మరాళవిభుని
> ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నిచ్చి
> మెయినఁ జొక్కెడు శుకమిథునములను
> గమిఁబాసి తలిరు జొంపమునకు మెయిమెయిఁ
> దాకంగఁజను పికదంపతులను."

"కామీ స్వతాం పశ్యతి" యనునట్లు కీచకుని యిప్పటి యవస్థ ననుసరించి యతనికి దృగ్గోచరములగు దృశ్యము లన్నియు నిట్టివే అనుచితము, నధర్మము నగు కీచకునిభావము నుద్దీపింపఁజేయుటకీ వర్ణన యావశ్యక మగుచున్నది. సంకేత సమయమునకై నిరీక్షించు చున్న కాముక చిత్తవృత్తి యీవర్ణనయందుఁ జక్కఁగఁ బ్రతి బింబించినది. ఈ భావమునే తిక్కన,

> "తనువు నింద్రియములు మనము ధృతియుఁ
> దనవశంబుగాక తల్లడపడి సింహ
> బలుఁడు విషమబాణుబారిఁ బాఱె."

అను వాక్యమునఁ జక్కఁగ వివరించినాఁడు. అదియుఁగాక, సైరంధ్రి గావించిన సంకేతమునుగూర్చి కీచకుని కెట్టిసంశయమును గలుగ

కుండుటకును నిది యుపకరించు చున్నది. ఈ ద్యానవనమున విహరించుచు నందలి కామోద్రేక కరములగు దృశ్యములచే విమూఢాత్ముఁడైన కీచకుఁడు సైరంధ్రి చేసిన సంకేతమును గూర్చి సందేహించుటయే యసంభవము. ఇట్లు దినమంతయు మోహాకామావిష్టుఁడై కడపినవాఁడగుట, గీచకుఁడు పరిజ్ఞాన శూన్యుఁడై, నిర్భయముగ నా రాత్రి నర్తనశాల కొంటరిగ నేఁగియున్నాఁడు. "కామాతురాణాం నభయం నలజ్జా" అను నర్థమిందుఁ జక్కగ నను వర్తించుచున్నది. మదిలో రాగంబు ఘూర్ణిల్ల, నుద్వృత్తాంగజోన్మాదుఁడై,

"స్వాంతము బాహుగర్వ ఘన సంతమసాంధముగాగ, శంకయొక్కంతయు లేక కీచకుఁడహంకృతి ముంగలిగాగ మండపాభ్యంతర భూమిఁ"

బ్రవేశించి నాఁడని తిక్కన కీచకుని నర్తనశాలా ప్రవేశమును వర్ణించుచుఁ, గామాంధుని చిత్తవృత్తి కొకస్వరూపము నొసంగి దానిని, మనయెదుటఁ బ్రత్యక్షీకరింపఁ జేసినాఁడు.

అట్లే భీముని ప్రవేశమును వర్ణించుపట్ల, తిక్కన ప్రదర్శించిన యౌచితియు, లోక జ్ఞానమును బ్రశంసార్హములు.

"గమనమువీఁక వేఁటాకవికారము పుట్టక సంగరోత్సవోద్యమ రభసాతిరేకము బయల్పడు టించుక లేక రోష సంభ్రమ మొకయింతయైనఁ బరభావనిరూప్యముగాక ద్రౌపదీ రమణుఁడు వోయి విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్."

చని, యావర్తనాగారంబు ముఖస్థలంబుసేరి,

"కలఁకులుఁ బిరిందిదెసయుం
గలయం బరికించి తన యఖండిత బాహా
బలగర్వమ యచ్చట ముం
గలిగా మద మత్త భద్రగజ సదృశగతిన్."

"నిశ్చింతుండై సతికేలు వట్టికొనిచొచ్చెన్ భీముఁడత్యుగ్రతన్."
ఉద్వృత్తాంగజోన్మాదుఁడైన కీచకుఁడు, మదాంధుఁడై శంక యొక్కింతయులేక, అహంకృతియే ముంగలిగా నర్తనాగారమును బ్రవేశించినాఁడు. నిర్వికార గాంభీర్యముల నొప్పి, ఆత్మ నిగ్రహము నేమాత్రమును గోల్పోక, తన యఖండిత బాహాబలగర్వమే ముంగలిగా భీముఁడు ప్రవేశించినాఁడు. ఈవైవిధ్య మా యిరువురిమానసిక పరిస్థితులకును, స్వభావములకును నెంతయు ననుగుణముగ నున్నది. కామావేశమునఁ గన్నుఁ దెలియఁగనివాఁడగుట గీచకున కనుమానమే కల్గినది కాదు. ఆత్మ సంయమనముతో నొప్పు వివేకశాలియగుటచే, భీముఁడు నర్తనశాలను బ్రవేశించుటకు ముందా పరిసరప్రాంతములను జక్కఁగఁ బరిశీలించినాఁడు. ఇతరులు గాని, లేక కీచకుని యను యాయులు గాని యున్నచోఁ దన ప్రయత్నము విఫలమగుటయే కాక పాండవుల రహస్యమును, బయలై యనర్థము కలుగునని భీముఁ డెఱుఁగును. కనుకనే యతని ప్రవర్తన మట్టి యుక్తాయుక్త పరిజ్ఞానముతో నొప్పినది. ఇట్లు, పాత్ర పోషణ విషయమునను, మానవ స్వభావ వ్యక్తీకరణమునందును, దిక్కన సిద్ధ హస్తుఁడని యీ ఘట్టము సాక్ష్యమొసంగుచున్నది.

కీచకుని విషయమున వర్ణితములైన మోహవికారాదులును, విరహమును, శృంగారరసాభాసకుఁ బోషకములు. పరసతిని గామించిన నీచకాముక చిత్త ప్రవృత్తి వర్ణనము, శృంగార రస పోషకము కాఁజాలదు. రతియును సాత్త్వికభావ ముభయ నిష్ఠమైనప్పుడే అనుభావాదులచేఁ బోషితమైన శృంగారరసముగఁ బరిణామముఁ బొందగలదు. కనుక కీచకసంబంధమగు వర్ణన కాముక చిత్తప్రవృత్తినిఁ బ్రదర్శించుటకు మాత్రమే యుపకరించుననని చెప్పవచ్చును. వీర మీఘట్టమునఁ బ్రధానమును, రౌద్ర మప్రధానమును నగుచున్నవి. వీరరసమునకు స్థాయియగు నుత్సాహమఖిల మహాకార్య

నిర్వహణమునకును హేతువగుటచే నదియు మానవజీవితమున కత్యంతము సన్నిహితమగుచున్నది.

"మనవారిలోన నొక్కనినైనఁ బిల్వ కు
త్సాహంబుసేసిన సాహసంబు"

అని ద్రౌపది కీచకవధానంతరము ప్రశంసించినట్లు భీముని యుత్సాహము వీరరసస్వరూపముఁ దాల్చినది. కీచకునిఁ గూల్చి భీముఁడు,

"వికృతపుఁజావు సంప మది వేడుకపుట్టినఁ గిట్టిపట్టి మ
స్తకమును చీనదీర్ఘభుజశాఖలుఁ బాదయుగంబు మేనిలో
నికి జొర నుగ్గుగాదురిమి నించిన గ్రంతలతిత్తి యైన కీ
చకు ధరణీస్థలిం బదిపి చక్కని ముద్దగఁ జేసెఁ దుష్టుఁడై."

విరటుని సభాంతికమున కీచకునివలన ద్రౌపదికి జరిగిన పరాభవమును గన్నారఁ గాంచినవాఁడగుటచే భీముఁడిట్టి రౌద్రస్వరూపమును దాల్చుటెంతయు నుచితము, సహజము నగుచున్నది. తనసతియెడఁ గాముక దృష్టినిఁ బరపిన కీచకుని కన్నులను, నవాచ్యములు పల్కిన నతనిముఖమును, బతివ్రతను వెన్నాడి, సిగబట్టి పడద్రోసిన కాలుసేతులను, నీలోకమున నికఁ బ్రవర్తింపనీయక చేయుట మాత్రమే కాక, యితరులు చూచుటకుఁ గూడ లేకుండ రూపఱునట్లు, మేనిలోనికిఁ జొనిపి, కీచకు దేహమంతయు నొక మాంసపు ముద్ద గావించిన గాని, భీమునకుఁ దృప్తి యైనదికాదు. అతఁడప్పటికి దుష్టుఁడైనాఁడు. ఇట్లు భీముఁడు కీచకు నమానుషమగు విధముఁన జంపుటయందును, క్రోధావిష్టుఁడై యుపకీచకులఁ జంపుటయందును, రౌద్రము వీరమున కంగముగఁ బోషితమైనది.

"వికటభ్రూకుటి ఘోరఫాలకలిత స్వేదోద్భటుండున్ చల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రమర్దన దశావిర్భావ సంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహల సమగ్రక్రోధవేగుండు నై
ఒకవిధ్వంసకుఁ డయ్యెడన్నలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తితోన్,"

కీచకవధతో నంతమగు నీవృత్తము మానవజీవితమున కత్యంత సన్నిహితమగుటయుఁ, దిక్కన రచన మనోహర వర్ణనలతో నొప్పి రసవత్తర మగుటయుఁ, గారణములుగ నీఘట్టము సామాన్యులగు పాఠకులనేకాక పండిత విమర్శకులనుఁ గూడ నెక్కువగ నాకర్షించినది.

వీరరస ప్రధానమగు నుత్తరగోగ్రహణఘట్టము భావియుద్ధ పర్వములలోఁ దిక్కన గావింపఁబోవు విశిష్టరచనకు సూచకమగు చున్నది.

"ఒక మాత్రన్ వితత ప్రసార నిబిడాత్యుగ్రాస్త్ర సంతానముల్
సకలానీకములందుఁబర్వ నరు భాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోకమంతటను విస్తీర్ణంబులై యాగప
ద్యకృతవ్యాప్తి వెలుంగనొప్పసఁగుమార్తాండువిడంబించుచున్"

తేజోమయమగు మార్తాండబింబము నుండి కిరణజాల మొక్క సారిగా నెడతెగక, యన్నివైపులఁ బ్రసరించి, లోకములను ముంచినట్లు, అర్జునకోదండమునుండి సంతతధారగా, నన్నివైపులఁ బ్రసరించుదివ్యాస్త్రజాలములు, శత్రుసైన్యమునంతను ముంచివేసినవి. మార్తాండుని తీక్ష్ణకిరణ ప్రసారమునకు విరామము లేనట్లే అర్జున ప్రయుక్తతీక్ష్ణబాణ ప్రసారమునకు నవధిలేదు. విక్రమ తేజస్స్వ రూపమగు నర్జునునిమూర్తి అచ్ఛ తేజోరూపమగు మార్తాండు బింబమును బోలినది. ఇట్లు సమగ్రార్థస్ఫోరకములగు సహజోప మానములచే యుద్ధ వర్ణనను బోషించుట తిక్కన పద్ధతి. అర్జునా స్త్రప్రసార మెట్లు నిరంతరముగ సర్వతోముఖముగ జరుగుచుండు నదియుఁదిక్కన యింతకుఁ బూర్వమే ప్రత్యక్షమగునట్లువర్ణించినాఁడు.

"గుణమున లస్తకంబునను గోటియుగంబున గేలఁదార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కి దీవ్రమా
ర్గణ నికరంబు లొక్కట వరాతిబలంబులఁ గప్ప—"

అల్లెత్రాడు, ధనుర్మధ్యభాగమగు పిడికట్టు, ధనుష్కోటియుగ్మము, నర్జునునిహస్తము,—వీని యన్నిఁటియందును నొక్కొకవిధమున, నెడ తెగక, బాణజాలములు తమంతటతాము భయంకర విధమున నుద్భవించి, పైకెగయుచున్నవను విధమునఁ, దీవ్రమార్గణ నికరంబు లొక్కసారిగ నరాతిబలంబులఁ గప్పుచున్న వని, పైవర్ణన తాత్పర్యము. తేనెపెరనుండి సంక్షుభితములై, మధుపము లొక్కసారిగా పైకి లేఁగుటయు, వాతోద్ధూతమై, భూమినుండి పరాగరేణు సమూహము పైకి లేఁగుటయు, నిత్యాదులను మనసుననుంచుకొని, తిక్కన పైపద్యమున 'రభసంబున లేఁగినమాడ్కి' యనిప్రయోగించి యున్నాఁడు. ఇట్లుచిత విశిష్టశబ్ద ప్రయోగముచే నర్థస్ఫూర్తిగలిగించుట, తిక్కన వర్ణనలలోని ప్రత్యేకత. ఇట్టిశబ్ద ప్రయోగ మితనికి సహజమగుటయే కాక, అయ్యది యుద్దేశపూర్వక శిల్ప మనుట కీ పద్యమే నిర్వచనోత్తర రామాయణమునఁ గనఁబడుచుండుట, నిదర్శన మగుచున్నది.

మనోహరములగు ప్రకృతిదృశ్యముల సంయోగమున, భీషణ, బీభత్సముల కాశ్రయమగు రణరంగమును రమణీయముఁ గావించుట, యుద్ధ పర్వములందుఁ దిక్కన యవలంబించిన రచనా విధానములలోఁ బ్రధానమైనది. ఆ విధానమీ గోగ్రహణ ఘట్టమున సూచితమై యున్నది.

"రోషంబు భీషణ రూపమై చెలువొంద
    నతుల కేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న
    ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్లు
నుద్ధతి పైపకయుజ్జ్వల దివ్యప
    తాక మెఱుంగుగా దళితధరణి
రథనేమిరవము గర్జనముగ శరపరం
    పరలు ధారలుగాఁ బరగి యదర

అర్జునాంబుదం బనన్య సామాన్య స
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దరిగి యపుడు కౌరవసేనా స
రోవరంబు దీనభావ మొంద."

హృద్గతరోష మే రూపము దాల్చినట్లొప్పి, బాణజాలములఁ గురిపించుచు, విజృంభించిన కర్ణునకు, జ్వాలాపరంపరలచే విజృంభించుచున్న యుగ్రాగ్ని యుపమానము. కర్ణుని విజృంభణమును శరధారలచేనడఁగింప నుద్యమించు నర్జునునకు వర్షధారలఁ గురిపించు మేఘ ముపమానము. రెంటను నుపమానోపమేయముల కభేదరూపకము గావింపఁబడినది. అర్కతనూభవుఁ డను నుగ్రాగ్ని యొక్క ప్రజ్వలనోద్ధతిని సైపక, అర్జునుఁడను నంబుద మనన్యసామాన్యసముద్యమమున విజృంభించినది. అర్కతనూభవాగ్నికి హృద్గతరోష మే భీషణస్వరూపమును, కాంతిమంతమగు నున్నత కేతువే శిఖజ్వాలయును, ప్రకాశమానములగు శరపరంపరలే కీలలును నైనవి. అర్జునాంబుదమునకు నుజ్జ్వల పతాక మెఱుఁగుఁదీగయు, రథనేమిరవము గర్జయును, బాణపరంపరలు వర్షధారలు నై యొప్పినవి. అంబుద వ్యాపారముచే నగ్ని యడఁగినట్లు, నర్జునుని విక్రమమునఁ గర్ణుని విజృంభణ మడఁగినదను నర్థ ముపమానముల వలన ధ్వనితమగుచుండుట మాత్రమే కాక, వక్ష్యమాణ సైన్యస్థితివలనఁగూడ వ్యక్తమైనది. సైనికుల ముఖములనెడు పద్మములు కాంతిహీనము లగుటవలన కౌరవసేన యనెడు సరోవరము దీనభావము నొందినదని వర్ణన. కర్ణుని పరాజయముచే ఖిన్నులగు సైనికుల ముఖములు కాంతిహీనము లగుటయుఁ, దత్కారణమున నుత్సాహరహితమగు కురుసేన దైన్యమునొందుటయు నుచితమే. పద్మబాంధవాంశసంభవుఁ డగు కర్ణుఁడు అర్జునాంబుదావరణముచే నిరస్తతేజస్కుఁడు కాఁగా, సైనిక ముఖపద్మములు

కాంతిహీనములై నవనుట చమత్కారయుతము. వర్షపాతమునోర్వక కమలములు కాంతిహీనములగుటయుఁ, దత్కారణమునఁ గమలాకరము శోభఁదరుగుటయుఁ బ్రకృతిసహజములగు విషయములు. ఇట్లు సమగ్రార్థ పోషకమగు రూపకత్రయముచే నతిప్రౌఢము, మనోహరము, ధ్వని ప్రధానము నగు వర్ణన సిద్ధించినది. సూర్యుని తేజ మగ్ని యందును, నది మరల సూర్యునియందును, కాలభేదము ననుసరించి, పర్యాయమున సంక్రమించుచుండుటచే సూర్యాగ్నులభిన్నులగుదురు. అర్క శబ్దమునకు సూర్యుఁడనియు, నగ్నియనియుఁగూడ నర్థములు. కనుక నర్కతనూభవుఁ డగు కర్ణునగ్నితో నభేదముగ వర్ణించుటెంతయు నుచితము. కుమార పుత్రాది శబ్దములు కాక, తనూభవ శబ్ద ప్రయోగమును విశిష్టమై యున్నది. అగ్నిరూపమగు నర్కుని తనువునుండి జనించినవాఁడును నగ్నిమయ మగుట తప్పదు. కనుక కర్ణుఁ డర్కతనూభవోగ్రాగ్ని యని తిక్కన వర్ణించినాఁడు. అంతియ కాక అగ్నిజ్వాలలు తాపహేతువులు. అట్లే కర్ణ నస్త్రజాలములును సంతాపకరములు. కనుక నుపమానోపమేయములకు సాదృశ్యమర్థవత్తరమైనది. ఈ విధముగనే యింద్ర పుత్రుఁడగు నర్జునుని మేఘముతో నభేదముగ వర్ణించుటయు నౌచితీ పోషక మగుచున్నది. 'అర్జున' శబ్ద మింద్రునియొక్కయుఁ బాండవ మధ్యమునియొక్కయు నామధేయమై యున్నది. మేఘముల కధినాథుఁడగు నింద్రుని పుత్రుఁడగు నర్జునున కంబుద ముపమానమగుట అర్థవిశేషమునకు హేతువగుచున్నది. ఉజ్జ్వలమగు నర్జునుని పతాక దివ్యమగుటచే గగనస్థ మేఘసంబంధమగు విద్యుత్తుతోఁ బోలుట కర్హమగును. మఱియు, గోరూప పరద్రవ్యాపహారణమునకు సహాయముగఁ బోరుచున్న కర్ణుని బాణజాలములు లోకానర్థకరములు, కనుక తద్బాణజాలమునకు లోకదాహమొనరించు నగ్నిజ్వాలతో

సామ్య ముచితము. అవ్విధమునసే ధర్మపరుఁడై యుద్ధమొనరించు చున్న యర్జునుని బాణజాలములు లోక హితాపాదులగుటచే వానికి లోక కల్యాణకరములగు వర్షధారలతోడి సామ్య మెంతయుఁ దగియున్నది. ఇట్టి పద్యము విశిష్టార్థస్ఫోరక శబ్దప్రయోగ చాతుర్యమునకును, నుదాత్తార్థగాంభీర్యమునకును, శబ్దార్థశక్తిమూలకములగు నలంకారార్థధ్వనులకును, ప్రౌఢకవితారచనకును, నాదర్శమై తిక్కన ప్రతిభావ్యుత్పత్తులకు సాక్ష్యమగుచున్నది. విషయము ననుసరించి స్వాభావికముగ వీర రౌద్ర భీభత్సములకు స్థానము కావలసిన యుద్ధపర్వ రచన యంతయు నిట్లుదాత్తరమణీయముగఁ దిక్కనచేఁ బోషితమైనది. ఈ యుత్తరగోగ్రహణ ఘట్టము తల్లక్షణమునకుఁ బ్రథమ లక్ష్యము.

ఇఁక, విరాటపర్వమందలి తుదిఘట్టమగు నుత్తరాభిమన్యు వివాహ వర్ణన, పవిత్రమగు లలిత శృంగారమున కాదర్శమును సరసము నై యున్నది. రూప వయో విద్యాభి జాత్యాదులచే ననురూపులగు నుత్తరాభిమన్యుల వివాహము, పాఠకుల మనోనయనములయెదుట జరుగుచున్నట్లు తిక్కన తన రచనాసామర్థ్యముచే వర్ణించియున్నాఁడు. ఉన్నతకుటుంబములందు వైభవోపేతముగ జరుగు వివాహమునకే తిక్కన రచన, శబ్దమయ సుందర ప్రతిబింబము. తిక్కన గావించిన యుత్తరవర్ణన, నూతనవధువు ముగ్ధ మోహన మూర్తిని మన కనులయెదుట నిలబెట్టును. లజ్జామాధ్యములచే వినమ్రమై యింతవరకును వరునిఁ జక్కఁగఁ జూడఁజాలక పోయిన యుత్తర, తలఁబ్రాలువోయునప్పు డవకాశము లభింపఁగా నోర చూపులఁ జూచుటయు, నభిమన్యుఁడును నట్లే, గురుజన సమక్షమున బాహాటముగ వధువును జూడజాలకఁ యాసమయమునఁ జక్కఁగఁ జూడఁగలుగుటయు, మున్నగు నూతన వధూవరుల ముగ్ధమోహన శృంగారచేష్ట లెంతయు స్వాభావికమగు విధమున వర్ణితములై యున్నవి.

"లలిత తనూవిలాసముల లజ్జకతంబునఁ జేసి మున్న వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవుసాలక యోరలు వారు చూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయునెడలం దగవొందిన నూలు కొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరుల మోహన మూర్తులపై
వధూవరుల్."

తలఁబ్రాలు సంబరము వర్ణించుటలోఁ దిక్కన ప్రకృతిసౌందర్య మందలి లాలిత్యమును, వధూవరుల కాపాదించియున్నాఁడు

"ఒండొరుల దోయిళుల నినుపొందఁజేయు
నక్షత ప్రకరంబు లన్యోన్యమస్త
కములఁ బోసిరి మందార కల్పలతలు
విరులగమియ నొండొంటిపైఁ గురియునట్లు."

ఈ పద్యమునందలి యుపమానోపమేయభావము గమనింపఁ దగినది. కోమలతా లాలిత్యములకుఁ బ్రధానమై, ఆలంబము లేనిదే నిలువలేని లతను స్త్రీతోడను, లతకు సుస్థిరాలంబనమై, దానిని ఉష్ణోగ్రతా వాతాద్యుపద్రవముల నుండి రక్షించు వృక్షమును బురుషుని తోడను, బోల్చుట కవిసమయము. లాలిత్య కోమలత్వ ములును, నాశ్రయోపాత్త జీవితమును, లతయందును, స్త్రీయందును సమాన ధర్మములు. అట్లే ఆశ్రయత్వ సుస్థిరత్వములు, వృక్షమునం దును బురుషుని యందును సమానధర్మములు. మందారవృక్షము నాశ్రయించి పైకి ప్రాకిన కల్పలతా ప్రసూనము లా వృక్షముపై రాలుటయు, మందారపుష్పములా లతపైఁ బడుటయు స్వభావసిద్ధ ములగు మనోహర ప్రకృతి దృశ్యములు. ఈ యుపమానముల విశిష్టత వధూవరుల రూపరేఖా విలాసాదులను, వారి యనుకూల దాంపత్యమును, ధ్వనింపఁ జేయుచున్నది. ఇట్లే పాణిగ్రహణానంతర మేకాసనస్థితులగు వధూవరుల వర్ణనముకూడ హృదయంగమమై యున్నది.

పెనుగుదుట నిడిన చూతం
బును నవమాలికయుఁ బోలెఁ బొలుపొందె రతం
బును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్."

ఒకే ఆలవాలమునఁ బరస్పర సంయోగమున శోభిల్లు నవమాలికా చూత వృక్షములతో నుత్తరాభిమన్యులకు సాదృశ్యము. సహజ కోమల సౌకుమార్య లాలిత్య ప్రధానమగు నుత్తరా సౌందర్యమునకును, బాహువీర్య శౌర్య స్థైర్య గాంభీర్య గుణ ప్రధానమగు నభిమన్యుని సౌందర్యమునకును, వివాహ ప్రాప్తిచే ననురూప సంయోగము సిద్ధించినది. జాతిరత్నమునకును, మేలిమి బంగారమునకును జక్కని సంయోగము కుదిరి కాంతివంతము రమణీయము నగు పతక రూపము సిద్ధించినట్లైనది. పాణిగ్రహణానంతరము వధూవరులయందొక నూతన వికాసమును, నితఃపూర్వము లేని యొకవిలక్షణమగు తేజస్సును సిద్ధించి, వారి మూర్తులు మనోహరములుగఁ గన్పట్టుట యెల్లరును గమనించెడి విషయము. మన జీవితములందలి యీ పూర్వానుభవమునకుఁ దిక్కన యొక మనోహర స్వరూపము నొసంగియున్నాఁడు.

అభిమన్యుఁ డుత్తరపాణిని గ్రహించుటయు నిట్లే సరసముగ వర్ణితమైనది.

"చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు
తెఱఁగు దోపఁ గెంపారెడు తీఁగబోఁడి
మృదులపాణి కుమారుండు మెలపుమైఁ గ్ర
హించెఁ బల్లవాలంబి మత్తేభలీల."

ఇందు, వయోనురూపమగు రక్తిమతో నొప్పు, కోమలమగు నుత్తరాహస్తకిసలయము నభిమన్యుఁ డాసక్తితో విలాసముగా గ్రహించు

టుపమేయమును, భద్రేభము విలాసముగఁ బల్లవములను గ్రహించు విధాన ముపమానమును, నగుచున్నవి. చిగురుటాకుల యందుఁ గల యాసక్తిచే నేనుఁగు వానిని నలిగిపోనీయక, వృక్షాగ్రములనుండి మిక్కిలి సుకుమారముగ, తొండముచే గ్రహించుట ప్రకృతిసిద్ధమగు విషయము. మార్దవ కోమలతా రక్తిమలు ప్రధాన ధర్మములగు కిసలయమును హస్తమున కుపమానముఁ గావించి, తిక్కన, యుత్తరాదేవి సమగ్ర సౌందర్యమును స్ఫురింపఁ జేసియున్నాఁడు. అల్లో పల్లవాలంబి మత్తేభలీల యనుటవలన నభిమన్యుని గాంభీర్య ప్రధానమగు మూర్తియు, నతని కామెయందుఁగల యనురక్తియు, నాతని నాగరకతయు, వ్యక్తమగుచున్నవి. మఱియు నుత్తర తన హృదయమున నున్న గాఢానురాగమును హస్తమున వ్యక్తముచేయుచున్నదా, యనునట్లు, ఆమె యరచేయి రక్తిమతో నొప్పుచున్నదని యుత్ప్రేక్ష. ఆలంకారిక మతము ననుసరించి శృంగారరస వర్ణమెరుపు. కనుక మనోగతమగు ననురాగము హస్తగతమగు సహజ రక్తిమ రూపమునఁ బ్రదర్శితమని యుత్ప్రేక్షించుట, అర్థవంతమై యున్నది. ఇంతియకాక ముగ్ధయగు నుత్తర మనోగతమగు తనయభిప్రాయమును వాచ్యము చేయజాలదు కనుక భంగ్యంతరమున సూచించిన దనుట చమత్కారము.

హోమసమయము నందు లభించిన సంస్పర్శ కారణమున వధూవరులయందుఁ గల్గిన సాత్త్విక భావోదయమును వర్ణించుటతో నీ ఘట్టము లలిత శృంగారమునకు శిరోభూషణ మగుచున్నది.

"గాఢ సంస్పర్శభంగులు గల్గునట్టి
హోమసమయ కృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్ముదేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు."

స్పర్శ సౌఖ్యానుభవమువలన వధూవరుల దేహములు సాత్త్విక స్వేదముచే సిక్తములైనవి. సతీపతులు సంతోషసముద్రమునఁ దేలిరను సూక్తి చమత్కారముచే వర్ణనీయ వస్తుస్థితి కుదాత్తత సిద్ధించినది.

ఇట్లీ ఘట్టమున లలితము, వైషయిక సంబంధరహితము, నగు నుత్కృష్టశృంగారము, హృదయంగమమగు విధమునఁ బోషితమైనది. వీరశృంగార రసనిధులగు నితివృత్తములును, దదనుగుణమగు కావ్యరచనా విధానమును హేతువులుగ, విరాటపర్వము పాఠక హృదయాహ్లాది యైనది.

# ఉద్యోగపర్వము

ఉద్యోగపర్వము రాజకీయ విషయప్రధానమైనది. లోకశాంతి లోకానర్థములకు హేతువులగు సంధివిగ్రహముల వినిశ్చయము ప్రయోజనముగఁ బాండవు లొనర్చిన ప్రయత్నమిందలి విషయము. పాండవుల భావికర్తవ్యమును నిశ్చయించుటయే కాక, నీ పర్వము సత్య ధర్మ న్యాయములకు, లోకమునఁ గల స్థితి యెట్టిదో కూడ వ్యక్తము చేయుచున్నది. లోకహితమును, బంధుహితమును గోరిన ధర్మజుని ఆశయమును నెఱవేర్చువాఁడై, కృష్ణుఁడు సామ దాన ద్వైధీ భావముల నతిచతురతతోఁ బ్రయోగించుట, యీపర్వమందలి ప్రధానేతివృత్తము. కష్టపరంపరలనోర్చి, యరణ్యవాసా జ్ఞాతవాసనియమములను సక్రమముగ నిర్వహించుటయే, యింతవరకును బాండవుల కర్తవ్యమైనది. ఇపుడు భావికర్తవ్య మింకను సునిశ్చితము కాలేదు. అది కాక, అరణ్యాజ్ఞాత వాసములు పాండవులకు మాత్రమే సంబంధించిన వగుటచేఁ, దన్నిర్వహణమున నితరులఁగూర్చిన యోచనకుఁ బ్రసక్తి లేదు. ఇప్పటి సమస్య అట్టిది కాదు. సంధికార్యము పాండవులపైకంటె నధికముగ ధృతరాష్ట్రాదులపైననే యాధారపడియున్నది. అట్లే యుద్ధముకూడ నొక్క పాండవులకు మాత్రమే కాక, యాదవ పాంచాల మాత్స్యసింధు గాంధారాది వంశములకన్నిఁటికిని సంబంధించియున్నది. తత్ఫలితములకుఁ గౌరవ పాండవులు మాత్రమే కాక, సమస్త ప్రజలును భాగధేయులగుదురు. లోకహితము సమకూరు విధమునఁ బ్రస్తుత సమస్యను సాధింప నిశ్చయించియే, పాండవు లుదారమార్గము నవలంబించినారు. పూర్వవైరమును, దామనుభవించిన కష్టములను, నన్నిఁటికంటె

ముఖ్యముగ, ద్రౌపదికి జరిగిన పరిభవమును, పాండవులు లోక హితార్థము విస్మరింపవలసియున్నది. కనుక వారి జీవితములం దిప్పుడు క్లిష్టమగు సమస్య యేర్పడినది. ద్యూతసమయమున జరిగిన, యవాచ్యమగు పాపము నెడ నుపేక్షవహించియుఁ, బిమ్మట నుత్తర గోగ్రహణ సందర్భమున నన్యాయమునకు సాహాయ్యమొనరించియు, ధర్మనాశనమునకు దోహద మొనరించిన భీష్మద్రోణాదులకును, నశక్తదుర్జనుఁడగు ధృతరాష్ట్రునకును గూడ, నిప్పుడు విషమ పరిస్థితి యేర్పడినది. ధర్మమును బ్రతిఘటించి నిలిచి మరణాంతక మగు యుద్ధమొనరించుటకు మనసొప్పకయు, నధర్మపరులు, పాపులు, నగు కౌరవులను బ్రతిఘటించుటకుఁ దగిన నైతికస్థైర్యము చాలకయు, ధర్మాధర్మముల నడుమ సందిగ్ధావస్థయందున్నవారు భీష్మాదులు. కుమారుని యందలి వ్యామోహము, సంపదయందలి దురాశయు నొకవైపునను, పాండవులవలని భయమొక వైపునను మనస్సును బాధించుచుండ, ధృతరాష్ట్రుని యవస్థ, బురదయందు దిగఁబడి యున్న మహిషము నవస్థను బోలియున్నది. ఇట్లు పాండవులు, భీష్మద్రోణులు, గాంధారీ ధృతరాష్ట్రులు, కుంతీద్రౌపదులు, మున్నగు భారతేతివృత్త ప్రధాన పాత్రలగువా రందరికిని నిది విషమపరిస్థితి యగుచున్నది. కనుక తత్తత్పాత్రలమానసికస్థితులు, శీల స్వభావములు, నీ ఘట్టమున సువ్యక్తము లగుట కవకాశ మెంతయుఁగలదు. ఈ ఇతివృత్తమును బోషించుటలోఁదిక్కన తన యఖండమగు లోక జ్ఞానమును, మనస్తత్త్వ పరిజ్ఞానమును, మంత్ర తంత్ర నిష్ణాతృత్వమును బ్రదర్శించియున్నాఁడు. రాజకీయ సంబం ధములగు రాయబారము లీఘట్టమునఁ బ్రధానసన్నివేశము లగుటవలన, సంభాషణా శైలి ప్రాధాన్యము వహించినది.

ఉత్తరాభిమన్యుల వివాహమునకై వచ్చిన బంధువర్గము వివాహానంతర మొకచోఁ జేరి పాండవుల భవిష్యత్కర్తవ్యమును

జర్చించుటతో నీ పర్వ మారంభమగుచున్నది. కృష్ణుని యుప దేశము ననుసరించి, ద్రుపదుఁడు తన పురోహితుని ధృతరాష్ట్రుని యొద్దకు రాయబారిగా పంపుట, యిందలి ప్రథమ ఘట్టము. ధర్మజుని హృదయమార్దవమును గుర్తించి, ధృతరాష్ట్రుఁ డతనినిఁ దియ్యని మాటలచేఁ దృప్తిపఱచుటకై సంజయునిఁ బంపుట, రెండవఘట్టము. సంధికై కృష్ణుఁడు తుదిప్రయత్నముఁ గావింపఁ బూనుట, మూఁడవ ఘట్టము. సందేశములు గొనివచ్చిన వ్యక్తుల స్థానకుల శీలాదుల కెంతయు ననుగుణముగ వారిపల్కులును, వారు తమతమ రాయబారములను నిర్వహించిన విధానములును, దిక్కనచేఁ బోషితములైనవి. ఇరుపక్షములయందును ముఖ్యు లగువారి యభిప్రాయములు, వారికి ధర్మమునెడఁ గల యాదరా నాదరములు, నిత్యాదుల నీ సన్నివేశములు వ్యక్త మొనర్చుచు, నాటకరంగములనలె నొప్పినవి జ్ఞాతులలో ద్రవ్య సంబంధములైన యంతఃకలహములు కలుగుటయు, నిరు పక్షములవారికిని హితముఁ గోరువారు మధ్యవర్తులై సంధి యొనర్పఁ బూనుటయు, నట్టి సందర్భములలో నుభయులయందును నభిమానులగు వివిధవ్యక్తుల ప్రవర్తనలయందలి వైవిధ్యమును,—నిత్యాదులు, లోకమున నెల్ల ప్పుడు జరుగుచుండు సహజవిషయములు. ఉద్యోగపర్వ గతమగు కురువంశేతి వృత్తమును నిట్టిదియే యగుటచే, దాని యాధారమున లోకవృత్త ముదాత్తముగ బోషితమైనది.

కౌరవులయొద్దకు దూతనంపు సందర్భమున బలరాముఁడు దుర్యోధన పక్షపాతసూచకములగు పల్కులను బల్కఁగా, సాత్యకి సహింపఁజాలక,

"ఇట్టుపాడఁదగునె యిది నీక పోలు ని
న్నే మనంగనేర్తు నిత్తెఱంగు
పాడిగాఁగఁ బూని పలుకంగఁ జెవియొగ్గి
యాదరించువారి నందుఁ గాక."

అని యధిక్షేపించినాఁడు. ఇంతియకాక,

"పలికిన చందముల్ సెరపి పైతృకమై చను రాజ్యభాగ మి
మ్ముల బడయందలంచి బలమున్ జలము న్నెరపం గడంగు వీ
రలు నొరు వేడఁబోదురె యరాతులు సాధుల మెత్తురే రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ బోలునె యొండొక రాజధర్మముల్."

అని దూతపంపుట యుక్తమనియుఁ దెల్పినాఁడు. ద్రుపదుఁడును దుర్జనులయెడ సామవాక్యములు వ్యర్థములని,

"మృదుభాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతామహిమఁబొందునె యె
ల్లిదముగఁ గొని యంతంతకు
మదమెక్కంగాక దురభిమానము పెర్మిన్"

అనువాక్యమున వివరించినాఁడు.

ద్రుపదుని పురోహితుఁడు కురుసభలోఁ దన దౌత్యమును నిర్వహించువాఁడై, కౌరవులు పాండవులకు బాల్యమాదిగ నొనర్చిన యపకృతులను ప్రథమముననే పేర్కొని, వానినెల్ల నీ పెద్దరా జుపేక్షించెనని ధృతరాష్ట్రుని దోషమును బ్రదర్శించినాఁడు. అంతియకాక,

"నారీరత్నము నట్లుదెచ్చి సభలోన న్వారలుం జూడగా
జీరల్ ప్రోవులుగాగ నొల్చుటయు లచ్చింబుచ్చుకోలున్ మహో
గ్రారణ్యస్థలి నిల్వఁ బంచుటయు దైన్యవ్యక్తిమై పల్కలున్
సైరింపంజనుఁ బాండవేయులకు నీ సంధిక్రమం బొప్పదే."

అని కౌరవుల దుర్నయములనెల్ల వివరించి, పాండవు లఖిల భూప్రజానాశనమున కిచ్చగింపని కారణమున సంధికార్యము నడచిన దనియు, నద్దానిని వారి బలహీనతఁగాఁ దలంపకుఁడనియు ఖండితముగఁ బల్కినాఁడు. మఱియు భీమార్జున సాత్యక్యాదుల శౌర్య సాహసోత్సాహములను, కృష్ణుని సాహాయ్యమును

ప్రశంసించి, యట్టిసహాయ సంపత్తిగల పాండవేయులకు నసాధ్య మెద్దియుఁ గలుగ నేరదనియుఁ, గావున,

"అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మి
బిలువఁబంచి హితముఁ బ్రియము రెండు
పక్షములకు నగుట పాటించి తగవుమైఁ
గొంతభూమి యిచ్చి కూడి మనుఁడు."

అని యతఁడు మోమోటము లేక పల్కినాఁడు. రాజకార్య పరిజ్ఞానము, వాక్చాతుర్యము, చాలని ఖండితవాదుల పల్కు లట్టివయగును. అహంభావ దురభిమాన పూరితులగు దుర్యోధనాదుల కివి యుద్రేక కారకము లగుననుట నిక్కువము. దీనిని గుర్తించియే భీష్ముఁ డితరులమాటల కెడమీయక, "పాండునందనులు ప్రశాంతిమై మనముల నీసుఁదక్కి, మృదుమార్గము వట్టుటయుఁ, దలపఁగ భాగ్యముకదా,"

"నీవాక్యము విప్రస్వా
భావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబైనన్
భావింపఁ గార్యమునయం
బీవిధమున సభకు నింత యిష్టంబగు నే."

యనిపల్కి, విప్రునిమాటల యందలి వాక్పారుష్యమును గప్పి పుచ్చినాఁడు. బ్రాహ్మణుఁడగుటవలన నధర్మమును ఖండించుటకును, ఇంకక సత్యము నుగ్గడించుటకును, నీ పురోహితునకు స్వాతంత్ర్య మున్నది. అందును, నితఁడు రాజపురోహితుఁడగుటవలన, నితని వాక్కులలో నధికార జన్యమగు తీక్ష్ణత నెలకొన్నది.

"నిండుమనంబు నవ్య నవనీతసమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు."

అనువాక్య మిచట సార్థక్యమందినది.

ఉభయపక్ష హితాభిలాషియు, యుక్తాయుక్త పరిజ్ఞానియు, రాజుల సమక్షమున మెలఁగవలసిన విధానము నెఱింగిన వాఁడును, వాక్చతురుఁడును, నగు సంజయుఁడు దౌత్యము నిర్వహించిన విధానము వేరు. ఆరంభముననే,

"భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁబడసి నాదు
చూడ్కి చరితార్థమయ్యె నస్తోకపుణ్య
ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్ర ధరణినాథుఁ
డిందు మీయునికి విని ప్రియ మెసక మెసగ."

"అనుజులు నీవును ద్రోవది
యును బుత్రచయంబు నున్న యోగక్షేమం
బున తెరగారయ బుత్తెం
చె నితాంతస్నేహ పూర్ణ చేతోవృత్తిన్."

అని చెప్పి, ధర్మజాదుల యెడ ధృతరాష్ట్రునికిఁగల స్నేహభావమును ప్రశంసించినాఁడు. పరిభవ దుఃఖమును, వివిధ క్లేశములను ననుభవించిన వారగుటవలనఁ, పాండవుల హృదయములు క్రోధ పూరితములై యుండకతప్పదు. దానిని గుర్తెఱింగియే సంజయుఁడు ధర్మజుని మనస్సును మెత్తఁబఱుపఁ బ్రయత్నించుచున్నాఁడు. కావుననే తిక్కన సంజయునినోట ధృతరాష్ట్రునిఁగూర్చి, "అస్తోకపుణ్యధనుఁడు, మీతండ్రి, ధరణినాథుఁడు" అనుగౌరవ వాచకములఁ బలికించినాఁడు. ధృతరాష్ట్రునియెడ నావంతయుఁ బాపము కాని, తప్పిదము కాని లేదని సూచించుట, సంజయుని యాశయము, కావుననే 'అస్తోకపుణ్యధనుఁ' డను ప్రయోగము. పితృభక్తి గౌరవములు, పితృప్రేమ, ధర్మజునకు జ్ఞాపకముఁ జేయుటకై 'మీతండ్రి' యనియు, రాజసందేశము పాలించుట ధర్మజుని కర్తవ్యమని సూచించుటకై

'ధరణీనాథుఁ' డనియు, నిందుఁజక్కఁగఁ బ్రయుక్తములైనవి. "అనుజులు, నీవును, ద్రౌపదియును" నని వేర్వేర వారి నుగ్గడించి. యోగ క్షేమములను నరయుట కూడ, నర్థవంతమై యున్నది. ధర్మజు ననున యించుటకంటె ముందుగా, నతనికై క్లేశముల పాలైన తమ్ముల ననునయించుటయే ముఖ్యము. కనుక, సంజయుఁడు ముందు తమ్ములను, బిమ్మట నతనిని, యనంతరము పరిభవతప్తహృదయయైన ద్రౌపదినిఁ బేర్కొనుట, యాతని కార్యవాద నైపుణ్యమును బ్రదర్శించుచున్నది. ధర్మజుఁడును సమయోచితముగ,

"ఆరాజు మా దెసం గల
కారుణ్యము కతమునను సుఖమ్మున నిట్లు
న్నారమని"

కాకుస్వరము కూడ స్ఫురించునట్లు పలికినాఁడు. కౌరవుల క్షేమములఁ గూర్చి ప్రశ్నించుచు, వారొనర్చిన యపకృతులును, భీమార్జునుల యసమాన శౌర్యసాహసములును, స్ఫురించునట్లు, ధర్మరాజు పల్కఁగా, తదింగితము నెఱిఁగిన సంజయుఁడు, ధర్మజుని కారుణ్యమునే యెత్తిపల్కినాఁడు.

"పొందొందగఁ దలఁచితి నీ
వింద శిశిరమైన విమల హృదయంబున వా
రందఱకును సేమం బిట
ముందఱ లేకున్న నేఁడు మొదలుగఁ గలుఁగున్."

కౌరవులొనరించిన యపకృతికిఁ బాండవులు ప్రతిక్రియ యొనర్తురను భయ ముండినది కనుక, వారికింతవరకును సేమము లేదు. ఇందు శిశిర మైన విమలహృదయంబున ధర్మజుఁడు కౌరవులతో సంధినిఁగోరు

చుండుటవలన వారి కిఁకమీఁద సేమము సేకురఁగలదు. ఇట్లుదాత్తముగఁబలికి, సంజయుఁడు ధర్మజునిఁ బ్రశంసించుచుఁ, జంద్రవంశ సంభూతుఁడగు నతని హృదయ మమృతమయమై, లోకమున కానందదాయకము కావలెనను నర్థమును స్ఫురింపఁజేసి యున్నాఁడు. తప్పంతయు దుర్యోధనాదులపై నిడి, ధృతరాష్ట్రుఁడు నిర్దోషియని యొత్తిచెప్పి, వృద్ధుఁడగు నతనిపై ధర్మజున కనుకంప కలుగునట్లు చేయుట, సంజయుని యుద్దేశము. ధర్మజునిహృదయము మెత్తఁబడినచో నతని యనుజులును నియ్యకొందురని సంజయుఁ డెఱుఁగును.

"ధృతరాష్ట్రభూపతికి వృ
ద్ధత కతమునఁ జిత్త మొకవిధము కామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు మనః
క్షతి పిదపం బుట్టి యిపుడు శాంతుండయ్యెన్."

అని ధృతరాష్ట్రుని వార్ధక్యమును, నతఁడు మానసికముగ ననుభవించిన బాధను, స్పృశించి, పుణ్యచిత్తవృత్తియై ధర్మజుఁ డెట్లైనను బూర్వ వృత్తములను సైచునట్లు చేయుటయే సంజయుని ప్రయత్నము.

"మడుగుఁ జీరయందు మసిదాఁకినట్లు మీ
సత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రుకతనఁ బొందె నింతయుఁ బాపంగ
నీవనేర్తు కార్య నిపుణ హృదయ."

అని సంజయుఁడు, దుర్యోధనాదులవలన వంశమునకుఁ గలిగిన కళంకమును దొలగించుబాధ్యత ధర్మజునిపై నిడినాఁడు. ఇవ్విధమున ధర్మజుని యౌదార్యముపై సర్వమును నాధారపడియున్నట్లు ముందు వివరించి, పిమ్మట,

"అఖిలజనక్షయంబయి జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములుగాని యాపనికిఁ జొత్తురె యుత్తములు"

అని అప్రకృతమగు విషయమును దెల్పువిధమున ధర్మజుని యుద్ధ ప్రయత్న మనుచితము గాదని నేర్పుతో విమర్శించినాఁడు. ఇరుపక్షముల యందునుఁ గల యోధాగ్రేసరులను బేర్కొని, వారి లక్షయములగుటఁ దెల్పి, అట్టివారి కన్యోన్య కలహము మేలు కాదని తెల్పి, సంజయుండు తొలువుఁ గలయంగనుంగొని,

"ప్రొక్కెద వాసుదేవునకు మోడ్చెద చేతులు సవ్యసాచికిన్
దక్కటి మిత్ర బాంధవ హిత ప్రియమంత్రి వయస్య కోటికిన్
గ్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ
యిక్కరుణాకరున్ శరణ మేనిదె వేడెద క్రోధశాంతికిన్."

అని ముఖ్యులగు వారినెల్లరను, వారి వారికిఁ దగినట్లు, వినయ గౌరవములఁ బ్రకటించుచుఁ బ్రార్థించినాఁడు.

"నెయ్యము వాటించి కడుం
దియ్యమెసఁగ నలుక లెల్లఁ దీరునటులుగాఁ
గయ్యమను దలఁపు లోనుగ
నయ్యమ నందనుఁడు మానునట్టి తెఱఁగునన్."

"శాంతి ప్రకారంబునం గార్యంబునడపి, యొక్కటియై మనుట యొడఁగూర్చి రమ్ము" అనిన ధృతరాష్ట్రుని యాదేశమును నిర్వర్తించుటలో సంజయుఁడు తన నేర్పునంతను బ్రయోగించినాఁడు. తన పల్కులకన్నిఁటికిని దగిన విధమున ధర్మజుఁడు సమాధాన మొసఁగి, నిర్దాక్షిణ్యముగ, ధృతరాష్ట్రుని పక్షపాతమును, దుర్యోధనాదుల సాహసికిని వివరించి, రాజ్యభాగ మీయనిచో సంధి కుదురదను

వర్గమును దెల్లముఁ జేయఁగా, బంధునాశనమున లభించు సంపద సుఖకరము కాదనియు, నందును, పాండవులవంటి సాత్త్వికుల కది తగదనియు, సూచించినాఁడు. దుర్నయవృత్తిచే దుర్ద్యూతమును బుట్టించి, యంతలుసేసిన వారిగర్వము సెల్లనిచ్చి, లోకనిందకుఁ బాల్జేసి పోవుటయుఁ, దాల్మియే ధనముగ నరణ్యవాసాది కష్టముల నెల్ల నోర్చుటయుఁ, దుట్టతుదకు నార్య నింద్యమగు క్రూరకర్మకుఁ జొచ్చి, నిష్కరుణముగ గురు బంధు వర్గమును జంపుకొనుట కేనా, యని కూడ ప్రశ్నించినాఁడు. స్వామికార్యమును హృదయపూర్వకముగ నిర్వహించుటయే ధర్మముగనెంచి, యెట్లైనను ధర్మజుని యుద్ధవిముఖునిఁ గావింపఁ బూనినవాఁడు సంజయుఁడు. కనుక నతని పల్కులలో మాధుర్యమును, గడుసుఁదనమును ప్రాధాన్యము వహించినవి. దీనిని ధర్మజుఁడును, కృష్ణుఁడును గూడ గుర్తించినారు. కనుకనే ధర్మజుఁడు,

"మును మమ్ముఁబొగడి పదపడి
యని వారల గెలువనరిది యని పొత్తుఁగ జె
ప్పినమాటకు నే నోడఁబడ
విను సంజయ పక్షపాతవృత్తి విడువుమీ."

"ఎదిరిం దమయట్టులకా
మదిఁదలచినఁ బొసఁగుఁగాక మాకుం గుడుమిం
డిదె మీరు ప్రక్కఁగొనుఁ డని
చదురడచిన మనసుపొందు చక్కంబడునే."

అని యనుటలో సంజయుని ధృతరాష్ట్రపక్షపాతమును దెల్లముఁ గావించి, మఱియు,

"సంపద దక్కియుండఁగ నశక్తులనం జను మమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంత చేశవతి"

అని యూతనిపల్కులను, ధృతరాష్ట్రుని సందేశము సంతరార్థమును విమర్శించినాఁడు.

"ఆరాజుసేయు నెయ్యము
గారామును జెప్పెదీవుఁ గడుఁదీపులుగా
వీరుఁ దమపాలు వడయక
నేరమిమాటలనఁ దేరనేర్తురె చెపుమా."

"ఇట్టులఁబోయి యక్కఁలువు రేకువవారలలోని కింతిఁ దా
నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందలపట్టియీడ్వఁగా
నెట్టు సహించె మామ సతి యేడ్పు చెలుంగవ కెట్టులోర్చె నీ
పట్టున సేమమారయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్."

అను కృష్ణునిపల్కు సంజయుని చతురవాక్య మిథ్యా సువర్ణమునకు నికషోపల మగుచున్నది.

"దుర్ణయమును, బెట్టిదమును బెండును నగు పలుకొదవదు నీ నాలుకకు, నయోన్నత యెపుడున్." అని ధర్మజుఁడుపల్కినపల్కులు సంజయుని మాటలయెడఁ జక్కఁగ సమన్వయించుచున్నవి. "ఈవినయము నేర్పఁ గలదె యితరులకెందున్." అను వాక్యము సంజయుని రాయబారవిధానమునకు సూత్రప్రాయమగు వ్యాఖ్య.

ధర్మజాదులు సంధినిఁ గోరుచున్నారని వారిదివఱకంపిన సందేశము వల్లనే ధృతరాష్ట్రునకు వ్యక్తమైనది. కనుక సంధి కనుమతింపుఁడని వారి నిప్పుడు ప్రార్థించుట యనవసరము. సంజయునిఁ బంపుటలో ధృతరాష్ట్రుని యుద్దేశముకూడ సంధిప్రయత్నముకంటె భిన్నమైనది. అనునయ వాక్యములచే ధర్మజుని మనఃక్లేశమును బోగొట్టి, మెత్త బఱచి, యుద్ధమునందలి యతని యుత్సాహమును తగ్గించుట ప్రథమాశయము. వంశరక్షణ, బంధురక్షణ, మున్నగు

బాధ్యతలను ధర్మజునిపై నిడి, యతనిని, శాంతునిఁ జేసినచో, రాజ్యభాగమిచ్చుటకు దుర్యోధనుఁ డొప్పుకున్నను, ధర్మజుఁడు యుద్ధమునకుఁ బూనఁడని ధృతరాష్ట్రుని యాశ. ధర్మజుని విషయమున ధృతరాష్ట్రునకుఁ గల యీ యభిప్రాయము కేవలము నిరాధారము కాదు. కావుననే పరాభవ ప్రతీకారమునకై, యెవరెవ రెంతెంత యుత్సహించుచున్నను, బంధునాశమున కిచ్చగింపని ధర్మజుఁడు మాత్రము, పంచగ్రామసంధిని గూడ సూచించినాఁడు. ధర్మరాజెంత యౌదార్యమును బ్రదర్శించినను, దుర్యోధనుఁడు మౌర్ఖ్యమును విడనాఁడడని ధృతరాష్ట్రునకుఁ దెలియును. అతని మౌర్ఖ్యము చెల్లునట్లును, ధర్మజుఁడు శాంతిని బొందునట్లును, సంజయుఁ డొనర్పవలెనని ధృతరాష్ట్రుఁడుద్దేశించినాఁడు. అతని యాశయము నెరవేర్చుటకే ధర్మరాజు నుద్దేశించి సంజయుఁడు,

"ఎట్టితప్పులుం
బోవఁగఁద్రోచి తాలిమియ పూనుదు గావున నన్నిమాట లి
ట్లీవు వినంగ నాడియును నేఁదనివోవక విన్నవించెదన్
నీవిభవం బహింసయు ననింద్యచరిత్రమ కాక యన్యమే."

యని పలికి, పిమ్మట,

"అల్పులకు మ్రింగఁ జేదైన హాలహాలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ
నీలగళునన్ని నిన్నన్నఁబోలు నట్టి
నీవు సాలినఁగా కేల నెగడుఁబేరు."

అని, ధర్మజుని శాంతిదయాస్వభావమును నహింసాత్మక జీవితమును ప్రస్తుతించి యతనిని లోఁబఱచుకొనఁ జూచినాఁడు. ఇట్లు సంజయుని

వాక్యపద్ధతి యుక్తిప్రధానమై యుండుటచే ధర్మజకృష్ణులతని యభిప్రాయములను ఖండించుటకవకాశము గల్గినది. ధర్మజునివంటి సాధువుకూడ కోపమునకు లోనై,

"గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీమబాహా
దండం బేపారి కుంభద్గదజడియుచు రౌద్రంబుగా దోచినన్ వే
తండద్వంద్వంబు మాడ్కి స్ఫరిమి కవలు మాద్యద్గతిం దాకినం జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్లి మూర్ఛిల్లకుండన్."

అని యావేశమును బ్రకటించినాఁడు.

ఇంగితజ్ఞానము కలవాఁడగుటచే సంజయుఁడు పాండవుల మనోగతాభిప్రాయమును జక్కగ గ్రహించినాఁడు. ఈవిషయమును ధృతరాష్ట్రునకుఁ దెలుపుచు, యుధిష్ఠిరుని సైరణను వెరపుగా భావించుట తప్పనియు, "సాదు రేఁగెనేని విను తలపోలమునఁగాని నిలువదుసుమ్మీ" యనియు హెచ్చరించినాఁడు. ఉభయ హితమును, లోకహితమును గోరువాఁడగుటచే సంజయుఁడు మోమోటమున కేమాత్రమును లోనుగాక, ధృతరాష్ట్రుని ప్రవర్తనను విమర్శించినాఁడు.

"ఆలు బిడ్డ లేనియట్టి త్రిమ్మరియగు
కోయ్యగాక కుదుటఁ గూడువెట్టి
కుడుచువార లిట్టి క్రొవ్విదంబుల సేయఁ
జొచ్చు టిచ్చగించి చూతురయ్య"

'అనయముఃపుట్టి జూదమునయప్పుడ యెంతయుఁ జిచ్చుపెట్టి కా
ల్చినదియది నీ యుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంత క
న్గొనఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే."

అని ధృతరాష్ట్రుని యుపేక్షయే సర్వనాశనమునకు హేతువగుట నిశ్చయించి పల్కినాఁడు,

"అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లుల
నగ్ని పుట్టినట్టిదయ్యె మీకు
నార్ప నెరవులేదు"

అను పల్కుచేఁ గౌరవుల భావిస్థితినిఁగూడ సంజయుఁడు సూచించినాఁడు. అగ్ని నార్పుటకు సాధనమగునదినీరు. అట్టి నీళ్లయందే అగ్ని పుట్టినపుడు దానినార్ప నుపాయమే లేదు. అట్లే, క్రోధాగ్ని నుపశమనముఁ గావింపఁగల ధర్మజుఁడే యలుగుటచే నిక పాండవక్రోధాగ్ని నార్ప నుపాయమే లేదనియుఁ, గౌరవు లందు దగ్ధమగుట తప్పదనియు, నిందు స్ఫురించుచున్నది.

ఇట్లెన్నివిధముల సంజయుఁడును, విదురభీష్మాదులును హిత ముపదేశించినను నాదరింపక, పాండవులను జయింపనగునేమో యనుదురాశచే, ధృతరాష్ట్రుఁడు వారిబలమునుగూర్చి ప్రశ్నింపఁగా, సంజయుఁ డొసంగిన ప్రత్యుత్తరము గమనింపఁదగినది. భీమార్జునాభిమన్యు నకులసహదేవాది మహావీరుల శౌర్యముల నుదాత్తముగ వర్ణించుచు,

"అట మిన్నందినయట్టివాని పొడవెంతన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గొన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుపై నెత్తి వ
చ్చుటకుం గొంకున నీవు నక్కవయినిల్చుంగాక మీసైన్యముల్."

అని హేళనఁగావించి,

"సకలభువనములు నరచే
తికిఁ దేరంజాలునట్టి భీముంతొఁడు దే

పెక్కొండుకు గలఁడు ధర్మజు
నికి నాతం డెత్తి రాక నిలుచునె యధిపా!"

అని సంజయుఁడు ధృతరాష్ట్రునకు వెఱపును గూడ పుట్టించినాఁడు. విదురునివలె సంజయుండును లోకహితమునుగోరిన జ్ఞానియగుటచేఁ గురు పాండవులకు సఖ్యముఁ గావింపఁగోరి, తన ధీశక్తి సామర్థ్యములను, వాక్చాతుర్యమును బూర్తిగఁ బ్రయోగించినాఁడు. తద్విషయమున కనుకూలించు సూక్తిచమత్కార ప్రధానమైన రచన యీఘట్టమున నెలకొన్నది.

సంజయరాఁయబారమువలన ధృతరాష్ట్రుని యంతరంగము పాండవులకు వ్యక్తమైనది. ఆతని హృదయమింకను దురాశాపీడితమై యున్నదని గ్రహించియే, కృష్ణుఁడు స్వయముగ సంధికార్యమును నడుపఁబూనినాఁడు. సంజయుఁడు, హితుఁడు వాక్చతురుఁడు నైనను, స్థానరహితుఁ డగుటచే నతని యుపదేశము ధృతరాష్ట్రునియందు ఫలింపదు. విదురాదుల యుపదేశముగూడ నతిపరిచయము వలన నతనియందు నిరర్థకమైనది. కనుక, దండనీతిని బ్రయోగించుటకుఁ బూర్వము కృష్ణుఁడు స్వయముగా సామాదులను బ్రయోగింప నిశ్చయించినాఁడు. దివ్యాంశసంభూతుఁడు, లోకపూజ్యుఁడు, వీరాధివీరుఁడు, వివిధోపాయపరాయణుఁడు, రిపుదోర్వీర్యాపహారక్రియాప్రవణోద్యోగుఁడు నగు శ్రీకృష్ణుని సంధికార్య నిర్వహణవిధానము విశిష్టమై యున్నది.

"మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱియెఱుఁగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు
పొమ్మవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్."

అను ధర్మజునిపల్కులే తద్విధానమునకు వివరణములగుచున్నవి.

పాండవకౌరవుల పూర్వచరిత్రలు, ప్రస్తుతస్థితిగతులు, నాశయములు, తత్సిద్ధికై వారువారవలంబించుమార్గములు, వారివారి ధర్మములు, బలాబలములు నిత్యాదులన్నియు, 'మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు.' అను పదముల వలన సూచితము లైనవి. ఉభయ పక్షములకును నేది క్షేమమో, యట్టి ప్రయోజనము సిద్ధించు క్రమమెట్టిదో, తత్సిద్ధి కెట్టి వాక్యపద్ధతి యవసరమో, యన్నియుఁ గృష్ణుఁడే యెఱుంగునని ధర్మజుని యభిప్రాయము. ధృతరాష్ట్రుని సభయందుఁ గృష్ణుఁడు సంధిప్రయోజనముగఁ గావించిన మహోపన్యాస మెల్ల విధముల నీయభిప్రాయముతో సమన్వయము పొందుచున్నది. ఆరంభముననే,

"జననాథ నీయెఱుంగని
పనులుఁ గలవె యైనఁ దగవు పరమ హితంబుం
దన వారికిఁ జెప్పనఁ దగు
నని వచ్చితి భారతాన్వయము ప్రియమందన్."

అని కృష్ణుఁడు తన యాగమనప్రయోజన విశిష్టతను క్లుప్తముగ వివరించినాఁడు. ధృతరాష్ట్రుని వశమొనర్చుటకై, మున్ముందు 'నీయెఱుంగని పనులు గలవె' యని యారంభించినాఁడు. న్యాయమును, బరమహితమును బోధించి భారతాన్వయమునకుఁ బ్రియమొనరించుటయే తన యాగమన ప్రయోజనమనియుఁ, గౌరవులు తనవారగుటఁ దాను వారి శ్రేయోభిలాషి ననియు, ముందుగనే సూచించినాఁడు. ఇందువలనఁ గౌరవులు కృష్ణునియందుఁ బాండవ పక్షపాతమును శంకింపక, యతని వాక్యములను శ్రద్ధతో నాలకించుట కవకాశము కలిగినది. "క్షీరోదకగతి పాండవకౌరవు లొడఁగూడి మనికి కార్యం" బని, ప్రధానాంశమును సిద్ధాంతముగఁ జెప్పి, దాని నొడఁగూర్చుట ధృతరాష్ట్రుని కర్తవ్యమని హెచ్చరించి,

కార్యభారము నాతనిపైననే పెట్టినాఁడు. ఇట్లుముందుగాఁ గర్తవ్య నిశ్చయముఁజేసి, తన్నిర్వాహణ మేల యావశ్యక మగుచున్నదో సహేతుకముగ వివరించినాఁడు. కురుపాండవుల పొందువలన నిరుపక్షముల వారికిని, బంధు మిత్రాదులకును మాత్రమే కాక ప్రజలకందఱకును గలుగు హితమును, యుద్ధమువలన లోకమంతటికినిఁ గలుగు ననర్థమును, గృష్ణుని వాక్యములు వ్యక్తపఱచుచున్నవి. ఇంతియకాక, ధర్మమూర్తులు, న్యాయశీలురు వీరాధివీరులు, నగు పాండవులను జేర్చుకొనుటవలనఁ గౌరవ సంఘమునకుఁ గలుగు నతిశయమును, ధృతరాష్ట్రుఁ డొందు నౌన్నత్యమును, గన్నులకుఁ గట్టునట్లు వర్ణించి, కృష్ణుఁ డాతనిఁ బ్రలోభ పెట్టియున్నాఁడు.

"జగతిఁగల జనపతులు నీచరణపద
మర్థిఁగొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లి ప్రజల
యెడ విరోధంబు వాటించు టెంత మేలు."

ఈవాక్యములు ప్రలోభమునకే కాక, పుత్రవాత్సల్యమునకుఁ గూడ ధృతరాష్ట్రుని హృదయమును గురిచేయుచున్నవి. పాండవులు సభ్యుల నుద్దేశించి చెప్పిన,

"సాంపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడబారిన దైనయవస్థ దక్కులై
వ్వార లుపేక్ష సేసిరది వారల చేటగుఁ గాని ధర్మని
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవముండెడున్."

అను పలుకులు గభీర భావ ప్రధానములైనవి. సత్య ధర్మములను బాలించుచున్న పాండవు లెట్లును దైవముచే రక్షితులగుదురనియుఁ, గౌరవులవలనఁ గలిగిన యాపదనుండి సత్య ధర్మముల నుద్ధరింప సమర్థులయ్యు, నుపేక్ష వహించిన భీష్మాదులు చెడుదురనియు, నీ

వాక్యములు తెలుపుచున్నవి. భీష్మద్రోణాదులకుఁ గూడ స్వధర్మ స్మృతిఁ గలుగఁజేయుట కృష్ణుని యుద్దేశము. "ద్రోణభీష్ము లీదిక్కు సుమ్ము" అని దుర్యోధనుఁడు పల్కినట్లు కౌరవుల యుద్ధోత్సాహమంతయు నీ యిరువురపైఁ బడియున్నదని కృష్ణుఁడెఱుఁగును. వారి నీ యధర్మ ప్రయత్నమునకు విముఖులఁ గావించి, యుద్ధమున బాల్గొనకుండునట్లు చేసినచో కోరలూడ్చిన త్రాచులై, కౌరవులు సంధి కొప్పుకొందురని కృష్ణునియాశయము. కనుక ధర్మనాశమునెడ నౌదాసీన్యము కూడ నధర్మమే యగునని భీష్మాదుల కీవాక్యములు సూచించుచున్నవి. కృష్ణుఁడీ విధమున "ధర్మంబును నీతియు మున్నిడి కొని మనోవాక్ప్రకారంబు లేక రూపంబైన సత్యంబకా చెప్పి" కడపట,

"వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటుగాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్యమేదియగు నవ్విధమేర్పడ నిశ్చయింపుమా."

అని మీ భావిసౌఖ్యమును నీవే నిశ్చయించు కొమ్మనుచు ధృతరాష్ట్రునకే కార్యనిశ్చయమును వదలినాఁడు. ప్రకృతి తత్త్వమును సమగ్రముగ నర్జునునకు బోధించి, కడపట కృష్ణుఁడు "యథేచ్ఛసి తత్కురు," అని యిట్లు పల్కినాఁడు. విశిష్టజ్ఞానబోధకుఁడగు నుత్తమ గురుఁ డవలంబించు విధాన మిట్టిది. కృష్ణుని యీ ధర్మోపన్యాసము సభ్యులను దన్మయులఁ గావించినది. లోకహితము ప్రయోజనముగా గల విశిష్ట ధర్మవాక్యములకుఁ బ్రతివచనముండఁజాలదు. కావుననే సదస్యులెల్లరును బ్రియమంది,

"నెమ్మనములం బురుషోత్తముఁడింత యొప్పఁబల్కెనె మఱుమాట
లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిందఱువరి యెవ్వఁ

డంచు వచలాకృతులై"
యూరకుండిరి.

కృష్ణుని యుపదేశ బీజ మూసరక్షేత్రమునఁ బడినది. దురాశా వ్యామోహములకు వశుఁడైన ధృతరాష్ట్రుఁడు ధర్మమును నిర్వహింపలేకపోయినాఁడు. నారదాది మునులును, భీష్మద్రోణాది గురులును దుర్యోధనునకుఁ గావించిన హితబోధ యంతయు నిష్ఫలమైనది. కృష్ణుఁడును దుర్యోధను ననునయించి, బుజ్జగించి, నచ్చచెప్పుటకు యత్నించి, లాభము లేకవిసిగి, తుట్టతుదకు బెదరించి, యెట్లైనను సంధిఁగావింపఁ బ్రయత్నించినాఁడు. దుర్యోధనుడు తాఁ బట్టిన పట్టువీడక ఖడ్గవాదమునే యవలంబించి, "యెవ్వరైనను సంగ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్," అని ఖండితముగాఁ బల్కినంతవఱకును, కృష్ణుని పలుకులయందెందును దీక్ష్ణత కానరాదు. దుర్యోధనుఁ డంత పుల్లవిఱుపుగాఁ బల్కినపుడుకూడ, కృష్ణుఁ డుద్రిక్తుఁడు గాక, గాంభీర్యమును విడువక తృణీకార భావమును, నపహాస్య భావమును సూచించు చిఱునగవుతో, దుర్యోధనున కుత్తరమిచ్చినవిధాన మితని ధీరోదాత్తతను, ప్రౌఢిని, వ్యక్తపఱచుచున్నది.

"అనిన విని కిన్కఁబూనిన యలతినగవు
చెలువు మొగమున కొక క్రొత్త పొలుపొనర్పఁ
బుండరీకాక్షుఁడగుటెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు."

"మొనతలఁ బడియెదు నీ చె
ప్పినయట్టుల తడవులేదు బిరుదులరై నీ
వును వీరు నిలువుఁ డిదె భం
డన మెల్లియు వచ్చె నూరటలు గనుఁ డింకన్."

ఇంతవరకును ప్రసన్న భావముచేఁ దెల్లనైయున్న కన్నులిప్పుడు కోప భావముచేఁ గొంత యెఱ్ఱబడినవి. కనుక పుండరీకాక్షుఁ డిప్పుడరుణ కమలాక్షుఁడై నాఁడు. మఱియుఁ జిఱునగవు వికాసముఁ గల్గింప ముఖము క్రొత్తచెలువముతో నొప్పినది. కృష్ణుఁడొందిన మార్పు ఇంతమాత్రమే. లోకద్రోహుల విషయమున గాంభీర్యమును విడనాడకుండుట మహాత్ముల లక్షణము. మీరు కోరి నిరీక్షించుచున్న యుద్ధమిదె స్ఫురింపించినది, యూరక యలంకఁగాంచుఁడని చెప్పుటలోఁ గృష్ణుని ప్రౌఢత వ్యక్తమగుటయే కాక, కౌరవుల సర్వనాశము ధ్రువమను భావము గంభీరముగ ధ్వనించుచున్నది. దుర్యోధనాదులు కృష్ణుని బంధింప యత్నింపగా నతఁడు ధృతరాష్ట్రునితో,

> "దోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింతసేత సం
> తోషమ నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
> ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయులైన వారి వి
> ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీశ్వర యింతక పోయివచ్చెదన్."

అని చెప్పి, లోకశాంతికైన తుదిప్రయత్నమున కుద్యమించినాఁడు. తాను స్వయముగ దుర్యోధనాదులను సంహరించుట కింతవఱకును గారణము కలుగలేదు. ఇప్పు డట్టికారణము కలిగినది కనుక దాని బురస్కరించుకొని, దుష్టుల నడంచి, యిరుపక్షములవారిని రక్షింతునని ధృతరాష్ట్రుని యనుజ్ఞను గోరినాఁడు. బంధువుల యనుమతిచేఁ దాను వంశదూషకుఁ డగు కంసునిఁ జంపిన విధానమును గూడ ధృతరాష్ట్రునకుఁ దెల్పి, "సత్కులముఁ బాలింపంగ వర్జింపంగ రాదే దుష్టాత్మకు నీచు నొక్కరుని" యని యతనికిఁ గర్తవ్యము నిదివఱకే సూచించియున్నాఁడు. కాని, విధివైపరీత్యమునఁ గృష్ణుని యీమహాప్రయత్న మంతయు విఫలమైయుద్ధమే సిద్ధించినది.

"పుడమియెల్ల నొడ్డగొడవయి గజవాజి
యుతముగా గడంగి యుగ్ర మృత్యు
ముఖము మొరఁగ దివురు మార్థత మాన్పుట
యధికమైన పుణ్య మనఘుచరిత."

అనియిదివరకే కృష్ణుఁడు, సంధివిషయమగు తన యుదాత్త భావమును విదురునకుఁ దెల్పియున్నాఁడు. అతఁడీపుణ్యకార్యమును నిర్వహించిన విధానము కూడ రాజకీయముగ నత్యుదాత్తమై యున్నది.

కృష్ణనిర్యాణకారము కారణముగ నిరుపక్షములలోని ముఖ్యులగు వారి చిత్తవృత్తులు, నభిప్రాయములు, వ్యక్తములగుట కనుకూలించు సన్నివేశము లేర్పడినవి. పాండవులును, ద్రౌపదియు, దూతగాఁ బోవు కృష్ణునకుఁ దమతమ యభిప్రాయముల నెఱింగించుట, అట్టి సన్నివేశములలో నొకటి. 'పాండవులు శాంతశూరులు' లను కృష్ణుని పలుకులకు నీఘట్టము నిదర్శనమగుచున్నది. భీమార్జునుల వాక్యములలో శౌర్యము, శాంతి ప్రచ్ఛన్నమై నెలకొన్నవి. ప్రశాంతత గభీరతా లక్షణమనుట, పాండవులయెడఁ జక్కఁగ సమన్వయించుచున్నది. వివిధ చిత్తవృత్తులఁ బ్రదర్శించు నీ సన్నివేశమును రసవత్తరమగు నేకాంకిక యనవచ్చును. ఎన్నఁడు లేని శాంతినిఁ బ్రదర్శించు భీమునిపలుకులనువిని, కృష్ణుఁడు చిఱునవ్వుతో నతని రెచ్చఁగొట్టి మేలమాడుటయు, నతఁడందులకు,

"ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీ వచ్చు కౌరవ్య సం
గ్రామ క్షోభము బాహు దర్పమున దీర్పం బెద్ద మిట్టెక్కి మి
మ్మెమ్మెల్లన్ వెరగంది చూచెదముగా కీ సారెకుం బోయిరా
భీముం డిత్తరి రిత్తమాటలకుఁ గోపింపఁడు సూ పెంపఱన్."

అని సరసంబాడుటయు, నిట్టి నాటకోచితములగు సంభాషణలెన్నియో యిందుఁ జూడవచ్చును. ద్రౌపది పల్కులు రోషాగ్ని జ్వాలాసదృశములై యొప్పినవి. పరిభవజన్యమైన యీ క్రోధాగ్ని కౌరవుల నెల్ల నాహుతిఁ గొనిగాని, చల్లారునది కాదని యామెపల్కులే వ్యక్తము చేయుచున్నవి. వీరిడి నని చెప్పికొన్నను నావేశపూరితములైన ద్రౌపది వాక్కులు గాంభీర్య ప్రధానములై యామెవిశిష్టలోకజ్ఞానమును, వివేకమును బ్రదర్శించుచున్నవి.

"రాజ్యముపాలు లేక తీ
రున కొడఁబాటుగల్గిన నెఱుంగమి వెట్టరె చాలరైరి వీ
రనఁగొన నాన లేమి యని యాడరె లోకమువారు కేశవా."
"ఓట యొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానమ యెక్కుడుపూనుఁ గాక."

అను వాక్యములు ద్రౌపది ప్రాపంచిక పరిజ్ఞానమునకు నిదర్శనములు.

"అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులువోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబుఁ దగఁ జేయుదునో యటుఁగాక పాడిమై
వరవుడ మోపి సేయుదునొ వారిక మాధవ నిశ్చయింపుమా."

అను పల్కు లామె ఆభిజాత్యాభిమానములకు సూచకములు. కోడలనుభావ మే మాత్రమును లేక జూదమునాఁడు దాసిగఁ జేసిన మహాపురుషుని, భర్తలు కొల్వఁబోవుటవలనఁ దనకు లభించునది దాస్యము కాక కోడరిక మెట్లగునని, ద్రౌపదిప్రశ్న. మహాపురుషుఁడను ప్రయోగము కాకుస్వర ప్రాధాన్యముచే విశిష్టమగుటయే కాక, స్త్రీజన స్వభావపోషకము కూడ నగుచున్నది. భార్య గౌరవా

గౌరవములు భర్తలు గణించుటలేదనియు, స్త్రీ నిస్సహాయయనియు నిందు స్ఫురించుచున్నవి. ద్రౌపదివాక్యము లుత్తమ క్షత్రియాంగనార్హములై వీరవంశోచితములై, స్త్రీస్వభావపోషకములై యొప్పినవి.

క్షత్రియధర్మమునకు విరుద్ధముగనున్న భర్తల సంధియుద్యమమును యిట్లు తీక్ష్ణముగఁ బ్రతిఘటించిన ద్రౌపది, కీచకవధోద్యోగ సందర్భమున నెంతటి యాత్మ సంయమనమును బ్రదర్శించినదో గమనింపఁ దగును. భీముఁడు క్రోధావిష్టుఁడై,

"అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణవమొందఁ గ్రోధము కృతార్థత్వంబునొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్."

అని యుద్రేకమును బ్రకటింపఁగా ద్రౌపది అజ్ఞాతవాస సమయభంగమగునని భీతిల్లి, యతనికి,

"ఒప్పనివారు నవ్వ మహిమోదధిధర్మసుతుండు దీనికిన్
నెవ్వఁగఁ బొంద భూజనులు నిందయొనర్పఁగ నే నొనర్చు నీ
చివ్వకు నీవు నల్కమెయిఁ జేసిన యాపని గూఢవృత్తికిన్
దవ్వగునేని నియ్యభిమతం బొడఁగూడియు నిష్ఫలంబగున్."

"కావున వంచన బాహిర
పోవక యుండంగ మన రిపుం బరిమార్పం
గావచ్చునేని నట్టిద
నావల పటుగాక తక్కనను వలదు సుమీ."

అని కర్తవ్యోపదేశముం గావించినది. ద్రౌపది ప్రవర్తనలో సందర్భము ననుసరించిన యీ వైవిధ్య మామె సమయజ్ఞతను, కర్తవ్యోపదేశ సామర్థ్యమును బ్రకటించుచున్నవి.

అవమానాగ్నితప్తయైన ద్రౌపదివలెనే, కుంతీదేవియుఁ గృష్ణుని సంధి ప్రయత్నమును దూలనాడినది. ఉమ్మలికమ్మున నెంతయు, గృశించి, బడుగయి, పాలలోఁబడిన బల్లివిధంబున నున్న, యా వీరమాత వాక్కులు వజ్రధారాసన్నిభములైనవి.

"కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైన సమయ
మొదవెఁ దడయ టింక నొప్పదు జనములు
నట్లుఁగాని పురుషు లనరు మిమ్ము."

"భుజబలమున జీవించుట
నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా
త్మజఁ గార్యమడుగుమనుము తగ నందఱతోన్."

అని సంధిప్రసంగమునకు మునుపే కుంతి కృష్ణునితోఁ బల్కినది. సంధి పొసఁగ లేదని కృష్ణుఁడు చెప్పినప్పుడు, కుంతి

"వీరిఁ గలయుట కష్టం
బా వెరవు దప్పుటయు మే
లై వచ్చెం బొమ్ము విడువు మనుమానంబున్."

అని దుర్జనులతోఁ బొత్తు తగదని చెప్పినది.

"రాజుల కెందు నారయఁ బరాక్రమ జీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధమండ్రు మును లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁ గూటికెయ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా."

ఇట్టు లప్రకృతమగు లోకన్యాయమును బురస్కరించుకొని, పాండవుల సంధిప్రయత్నమును గఠినముగ నిరసించినది.

భుజబలము నాధారమున శత్రువుల నాక్రమించి, శౌర్యమును బ్రకటించి జీవించుటయే క్షత్రియులకు, నందును రాజులగువారి కుచితమగు వృత్తి. ఇతరములగు వృత్తులు, వానిలో ముఖ్యముగా, పరుల దయకు లోనైజీవించుట యనునది, రాజులకు నిషిద్ధము, నీచము, అని సామాన్య రాజధర్మమును వివరించి, కుంతి ధర్మజుఁడవలంబించిన యీ సంధివిధానము రాజధర్మ విరుద్ధమనియు, నీచమనియు వ్యక్త పఱచినది. ఉత్తమసత్త్వులు వంశగౌరవమున కనుగుణముగ ప్రవర్తించి వంశమును స్తుతిపాత్ర మొనర్తురు. బుద్ధిహీనులు కృపణులై పరులనాశ్రయించి, వారు పడవేయు కూడును దిని దైన్యమున జీవింతురు. తనకు భర్తయు, మహావీరుఁడు నగు పాండురాజువంశ గౌరవమును ధర్మజాదులు నశింపచేయుచుండుటచే, వారు సత్త్వహీనులను నర్థము గమ్యమాన మగుచున్నది. అట్లే 'నిస్తేజపు కూటి కియ్యకొని దీనతనొందుదు' రనుటచే, పాండవులు సంధిప్రయత్నము మానకున్నచో బుద్ధిహీనులు, కృపణులు, క్షత్రియ తేజోవిరహితులు, కాఁగలరను కుంతియధిక్షేపమును గమ్యమానమైనది. నిస్తేజపుజీవనముకంటె రాజులకు వీరమరణము మేలని కుంతి వాక్యముల యర్థసారము. రాజధర్మమగు పరాక్రమము నాశ్రయించి సంపాదించిన సంపదను 'జీవన' మను శబ్దముచేతను, దదన్యమార్గమునఁ గృపణులై, వేడి తెచ్చుకొన్న దానిని 'కూడు' అను శబ్దముచేతను కవి వర్ణించియుండుట గమనింపఁదగినది. ఇట్లే పద్యమందలి ప్రతిశబ్దమును విశిష్టార్థ స్ఫోరకమగునట్లు, సుప్రయుక్తమై, వీరపత్నియు, వీరమాతయు నగుకుంతీదేవి క్షాత్రతేజోమయ స్వరూపమును బ్రత్యక్షముఁ జేయుచున్నది.

ఆత్మగౌరవము గల ధీరయగుటచేఁ గుంతి ద్రౌపదీహృదయ క్షోభను గ్రహించినది. ఉత్తమ కులకాంతకు, నందును, స్వీయవంశ వధువునకు, తన కుమారుల సహధర్మచారిణికి జరిగిన యవాచ్యమగు పరిభవమునకుఁ దగిన ప్రతిక్రియయొనర్చి యామె కన్నీటి నాపిననే తప్ప, కేవలము రాజ్యలాభము నిష్ప్రయోజనమనియు, జీవితము వ్యర్థమనియుఁ గుంతి బాహాటముగ వ్యక్తపఱచినది.

"మరచిరె కొలువున ద్రౌపది
బరచిన బన్నంబు ధర్మపథముఁ దొరంగ్క
వెరచుట కప్పటి కదితగుఁ
జెరచినచో వెదకవలదె చిరతరకీర్తిన్."

అని భార్య పరాభవమునకుఁ బ్రతీకారముఁ గావించుట భర్తకుఁ గర్తవ్యమనుచుఁ బాండవులను బ్రతిక్రియకుఁ బురికొల్పినది. జెట్టిదమగు నీమె పల్కులు విని భీష్మద్రోణాదులు కూడ బమ్మెర వోయిరి. కార్య వాదములు వల్కు కుంతీ కృష్ణులిట్లు తెగఁబారుట వలన ధర్మజవారిరాశి కింకఁ జెలియలికట్ట తొలఁగిన దని వారితి కర్తవ్యతామూఢులైనారు.

ఇట్టీఘట్టమునందలి సన్ని వేశములు వ్యక్తులహృదయగత భావా వేశములను, స్వభావములను, బ్రత్యక్షముఁ జేయుచుఁ, బాఠకులహృ దయములకుఁ జైతన్యముఁ గలిగించు చున్నవి. వృత్తమంతయుఁ బాత్రలసంభాషణల తోడనే నడచినది. వర్ణనకును కథాకథనమునకును నిందుఁ బ్రసక్తిలేకుండుటచేఁ గవి పాత్రల వెనుకకొదిగి సూత్రధారుఁ డైనాఁడు. చతురములు, హృదయ ప్రదర్శనములునగు సంభాషణ లను నిర్వహించుటలోఁ దిక్కన యుదాత్తమగు శిష్టవ్యవహారాంధ్ర భాషకుఁ బ్రాధాన్యమొసంగినాఁడు. ప్రతిపదమునను దెనుఁగునుడికార ము ట్టిపడుచున్నది. ఛందోవిషయమునందును నీ పద్యమున దేశీయత

నెలకొన్నది. గీతములకుఁ గందములకుఁ గల ప్రాధాన్యము సంస్కృత వృత్తములకు లేదు. ఇతివృత్తము సంభాషణాత్మక మగుటచేఁ దెనుఁగు పలుకుబళ్ళకును, లోకోక్తులకును ప్రవేశము కలిగినది. ఉవ్వెత్తు గొనరె, కొట్టిన తిండికాఁడు, ఒల్లవుగాక చివ్వకుఁ, చెవులు చీములు గట్టెడు, పిల్లి వట్టిన యీరువు, మడుగుచీర యందు మసిదాఁకినట్లు, మాకుం గుడుమిండిదె మీరు వక్కఁగొనుఁడు, మీను మ్రింగిన గాలము చాడ్పున, చిక్కని పోటుమానిసివి, వారొకతల యేనొకతల, యిత్యాది ప్రయోగము లనేకములు సహజ వ్యవహారోచితమగు విధమున సంభాషణల నడుమ నిమిడినవి.

ఇట్లు భాషయు నితివృత్తమును జీవితమున కత్యంతమున్నిహితము లగుటయు, సన్నివేశములు నాటకోచిత విధానమునఁ బోషితములై యుండుటయుఁ గారణములుగ, నుద్యోగ పర్వరచన విశిష్టమై యున్నది. పురోహిత, సంజయ, కృష్ణ రాయబారములను రచించుటలోఁ దిక్కనచూపిన వైవిధ్య మతని లోక జ్ఞానమునకును, రాజ్యాంగపరిజ్ఞానమునకును, సాక్ష్యమగుచున్నది. కృష్ణరాయబార ఘట్టమున శ్రీకృష్ణుని జీవితతత్త్వముకూడ సూక్ష్మముగ వెల్లడియైనది. ఇంతియే కాక ధృతరాష్ట్ర దుర్యోధనాదులయుఁ, గుంతీకర్ణాదులయు, మానసిక ప్రకృతులను, స్వభావములను బ్రదర్శించు సన్నివేశములకు తిక్కన రచన చైతన్యమాపాదించినది. మనుమసిద్ధికి మంత్రియై రాజ్యాంగములను స్వయముగ నిర్వహించియుండిన కారణమునఁ, దిక్కనకు రాయబారములఁ గూర్చిన స్వానుభవముండుట కవకాశము గల్గినది,

ఇట్లు విరాటపర్వము నానా రసాభ్యుదయోల్లాసియు, నుద్యోగ పర్వము తిక్కన రాజనీతి వైదుష్య ప్రదర్శకము నై లౌకికజీవితమున కత్యంత సన్నిహితములగు సన్నివేశములతో నొప్పుచున్న కారణమున నీ పర్వ ద్వయము సామాన్యపాఠకులనే కాక, పండిత విమర్శకులనుగూడ నెక్కువగ నాకర్షించుచున్నది.

# యుద్ధపంచకము

భీష్మపర్వము మొదలు సౌప్తిక పర్వాంతమువఱకును, వర్ణనీయ విషయము యుద్ధము. సాధారణ మానవులైనందిన జీవితమునకు దూరమగు యుద్ధవీరము శృంగారమువలె సర్వజనాకర్షణీయము కాఁజాలదు. మఱియు నిందు జుగుప్సావహములగు బీభత్సాది రసములుకూడ నందందుఁబోషితములై యుండుటచే యుద్ధపంచకము సామాన్యులకు రుచింపదు. ఇఁక శాంత్యను శాసనికాదిపర్వములందు వర్ణితములగు విషయములు, ధర్మశాస్త్రాంతర్గత సూత్రార్థములును, వేదాంతసారములునై యుండుటచే నవి ముముక్షువులకుఁ దప్ప నితరులకు రుచింపవు. స్త్రీపర్వ మౌసల స్వర్గారోహణాది పర్వములు బీభత్స కరుణముల కాలవాలములును, నాయక జీవితచరమదశను వర్ణించునవియు, శోకభూయిష్ఠములునై యుండుటచే సామాన్యపాఠక హృదయాహ్లాద కరములు కావు. ఈకారణము వలన విరాటోద్యోగ పర్వములకుఁ గలిగిన జనాదరణ, తదనంతర భారతభాగములకుఁ గలుగకుండుటలో నాశ్చర్యము లేదు. విరాటోద్యోగపర్వ రచనానంతరము తిక్కన కవితాశక్తి క్షీణించినదనియు, నాకారణముననే తదనంతర భారతభాగమునకు నంతటి విపులప్రచారము కలుగ లేదనియు నొకయభిప్రాయము సామాన్యపాఠకలోకమున నేర్పడుటకు గూడ నవకాశము గలిగినది. ఈయభిప్రాయ మవిచారమూలక మనియు, యుద్ధపంచక, శాంతి, మౌసలపర్వాదులు, తిక్కన కవితాప్రతిభలను విరాటపర్వముకంటె నధికముగ, నఖండముగఁ, బ్రదర్శించుచున్నవనియు, నీవ్యాసమున దిఙ్మాత్రముగ నిరూపింపఁ బ్రయత్నింతును.

"వేదవ్యాసమునీశ్వరు
పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తి రసైకా
స్వాదన సుకరానందో
త్పాదన దివ్యమతినగుచుఁ దగ నెఱిఁగింతున్."

యుద్ధ ప్రవర్తనమును ధృతరాష్ట్రునకుఁ దెలుపఁబూను సంజయుని యీపల్కులు యుద్ధపర్వరచనకుఁ గడంగిన తిక్కనయెడముఖ్యముగ సమన్వయించుచున్నవి. అష్టాదశాక్షౌహిణీసైన్యప్రవర్తితము, నష్టాదశదివస పరివ్యాప్తము నగుయుద్ధమును రసవంతమగు కావ్యరూపమునఁ బోషించుట యెట్టి యసాధారణ కార్యమో తిక్కన యెఱుంగును. కనుకనే వ్యాసమహర్షియందలి భక్తి రసైకాస్వాదనముచే నానందము సుకరముగ సిద్ధించినదనియు, నాయానందసిద్ధిచే దివ్యమతినై, యీయుద్ధపర్వములను రచింతు ననియుఁ దిక్కన పలికియున్నాఁడు.

"ద్వాపరే ద్వాపరే విష్ణుః వ్యాసరూపో జనార్దనః"

యను వాక్యమునను సరించి, వ్యాసమహర్షి విష్ణ్వంశ సంభూతుఁ డగును. అతనియందలి భక్తికారణముగ, దివ్యచక్షువును, బుద్ధివికాసమును, నార్షమగు కవితాశక్తియుఁ, బొందినవాఁడు తిక్కన యని యూహింప నగుచున్నది. యుద్ధాదిపర్వములయందలి యతనికవిత యీ యూహను బలపఱచునదియై యున్నది.

యుద్ధము స్వభావముచేతనే వీరరౌద్రబీభత్సముల కాటపట్టు. "అట్టి యుద్ధమును బంచపర్వవిస్తృతముగ, విసువు జనింపనియట్లు చిత్రించుట దుష్కరకార్యము. ఈఘట్టమును రచించుటలో, ఋషితుల్యుఁడగు తిక్కన మహాకవి యవలంబించిన విధాన మద్వితీయము. జాగ్రతతోఁ బఠించువారికీ వర్ణనలోని వైవిధ్యము, సందర్భోచితమగు శైలి, రసపోషణ యందలియౌచితి,–యిత్యాదులు

సులభముగ గోచరించి, తిక్కన ప్రతిభను సువ్యక్తముఁ జేయును. ప్రతిపద్యము నత్యద్భుతమగు చైతన్యముతో నొప్పుచు, నర్థస్ఫూర్తి భావగాంభీర్యములఁ బోషించుచు, రచన కుదాత్తత నాపాదించుచున్నది.

ప్రకృతిసిద్ధములు, హృదయంగమములు, నగు నుపమానములను సందర్భోచితముగఁ బ్రయోగించి, యుద్ధవర్ణనకు మనోహరత్వము నాపాదించుట యితని రచనయందలి యొక విశేషము. భీష్మునిఁదలంచి, పలవించు ధృతరాష్ట్రుని వాక్యము లిందులకుఁ జక్కని నిదర్శనములు.

"అంచిత తాలకేతుకిరణాలి మెఱుంగులుగాఁగ మార్వ్రమో
యించుట గర్జచందముగ నేచి విరోధిదవానలంబు మా
యించు శితాస్త్రవర్షమున నిట్టిది భీష్మమహాభ్ర మెట్లడం
గించెనొకో శిఖండియను గృత్రిమవాయువు దాఁకి దైవమా."

"పెరిగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు
నిలువ నిమ్మగుదీవిగా నిన్ను దలఁచి
యుండ నత్యంత తుచ్ఛ శిఖండి పల్వ
లాక్రమంబున మునిగితే యకట తండ్రి."

శత్రువిజృంభణమను దవానలమును సులభముగఁ దనబాణ ధారాపాతమున నార్పఁగలుగు భీష్మమహాభ్రమును శిఖండియను గృత్రిమవాయు వెల్లిగురఁగొట్టఁగలిగినదో ధృతరాష్ట్రున కూహించుటకుఁగూడసాధ్యముకాలేదు. దుఃఖావేశమున నతనినోటినుండి, యప్రయత్నముగ నిర్గమించిన 'దైవమా'యను సంబోధనమే యందులకుఁ దగిన సమాధానమగుచున్నది. విధివిలాస, వైపరీత్యము లిట్లు ప్రతిపాదితములైనవి. అట్లే పాండవాంబుధి యుప్పొంగిననుగూడ మునుంగని భీష్మద్వీపము శిఖండియను నత్యల్పమగు పరియపొంగుచే నాక్రమింపఁబడుటకు విధివైపరీత్యమే కారణముకదా, పాండవ

శౌర్యమను మహాసముద్ర ముప్పొంగి సప్పు డద్దానిచే నాక్రాంతము కానిది భీష్ముఁడను దీవి యొక్కటే. అదియొక్కటే కౌరవుల కాశ్రయము కాఁగలదు. అట్టిభీష్ముఁడు పడుటచేఁ గౌరవు లనన్యగతికులై నారనియుఁ, బాండవసముద్రమున నిఁక మునిఁగి పోవుటతప్పదనియు నిందుచే సూచితములు. ఈవిషయమే, శల్యవధానంతర మర్జునుఁడు దుర్యోధనుని మూర్ఖత్వము నుద్దేశించి కృష్ణునితో నిట్లుపల్కినాఁడు.

"అమరనదీసుతుండు వడినప్పుడు వీరలబుద్ధి సంధికా
ర్యమునకుఁ జొచ్చునింక నని యాత్మఁదలంచితి నమ్మహాత్ముఁడున్
సముచితవాక్యవృత్తిఁ గురునాయకుఁ దేర్పఁగఁజూచెఁ జిత్తదో
ష మహిమ నద్దురాత్ముఁ డుపశాంతతనొందఁడ యెన్నిభంగులన్"

"గంగాతనయుఁడు దెగినను
సంగరమున శత్సహింపఁజనునే తమకుం
బెంగలు లని యప్పుడు దెలి
యంగా నేఁగిరి సుయోధనాదులఁ గృష్ణా."

భీష్ముని యౌన్నత్యము నీపర్వారంభమందలి పద్యము లుదాత్త విధమున వర్ణించుటయే కాక, యుద్ధపరిణామమునుఁ గూడ విదితముఁ జేయుచున్నవి. వీనియందలి ప్రతిశబ్దమును ధ్వనిప్రధానమై యర్థ గౌరవమున నొప్పుచున్నది. యుద్ధవర్ణనారంభమున కాదియందు రచితములగు నీపద్యములు తిక్కన చేయఁబోవు భావిశిల్పమునకు మచ్చుతునుకలు. ద్రోణపర్వారంభమునఁ గౌరవసేన స్థితి వర్ణితమైన విధాన మీక్రింది పద్యములను స్మరింపఁ జేయుచున్నది.

"పతిరహితాత్మయైన సతిభంగియు గోపకహీనమైన గో
ప్రతతివిధంబు సస్యవిధురస్థితియైన ధరిత్రిచాడ్పు ను
ద్ధత హరిశూన్యమైన వసుధాధర కందరభూమి చందమున్
మతి మనసేనదోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు లేకయుండుటన్.

విగతభర్తృకయైనసతి, గోపాలక రహితమైన గోసమూహము, సస్యరహితమగు ధరిత్రి, సింహములేని పర్వతకందరము, నిట్లే భీష్ముఁడులేని కౌరవసైన్యము గూడ కాంతిహీనమైనది. ఇంతియకాక భర్తలేనిస్త్రీకిని, గోపకుఁడులేని యాలమందకును, రక్షణలేకుండుటచేఁ గ్రమమున దుర్మార్గులబారికిని, ఘాతుకమృగముల బారికిని గురియగుట ప్రకృతిసహజము. పంటలేని బీడుభూమియందునిరసనమును, సింహములేని కందరమునెడ లఘుభావమును గలుగుటయు లోకసహజమే. అట్లే భీష్ముని నిష్క్రమణముచే, ననాథయై, దీనయైయున్న కురుసేన పాండవులకుఁజిక్కె ననెడి భావ మిందు ధ్వనించుచున్నది. మఱియును,

"అంగద నాథుమ్రింగిన వృకావలి తన్ వెసముట్టికొన్న స
ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు సూచుచున్న సా
రంగియ వోలె నుండెఁ గురురాజ భవత్సుతుసేన భీష్మ నా
జింగబళించి పాండవులు జృంభిత విక్రమలీలఁబొల్చుటన్."

తనకుఁబ్రియుఁడు, రక్షకుఁడునగుభర్తను, దనయెదుట మ్రింగినతోడేళ్ళ గుంపు తన్నుఁజుట్టిముట్టికొనఁగా, భయకంపితగాత్రయై, కాతరనేత్రయై, దిక్కులు సూచుచున్న యాడుజింక యుపమానము. యుద్ధమున భీష్మునిఁజంపి పాండవులు దన్నాక్రమింపఁగా, వ్యూహము లెక్కడ వక్కడ సడలుచుండ, భయముచే దిక్కులుసూచుచు నిలుచున్న కౌరవసేన యుపమేయము. ఉపమేయమగు కౌరవసైన్య నాశనమును సూచించుటయే కాక, యీ యుపమానము తత్సేనయొక్క ప్రకృతావస్థ నెంత విశదముగ వ్యక్తపఱచుచున్నదియు సువిదితము. ఆకలిచే మగజింకను మ్రింగిన వృకావలి యుపమానమగుటచే, నుపమేయమగు పాండవులను వర్ణించుచుఁ దిక్కన, "భీష్మనాజింగబళించిన" పాండవులని ప్రయోగించినాఁడు. "మ్రింగిన, కబ

లించిన'' యనుపదములిందు విశిష్టము లగుచున్నవి. అవ్వృకావలి కెట్లో పాండవులకు నట్లే ఆకలియింకను దీరలేదనియు, మిగిలిన వారినిఁ గూడ మ్రింగినఁగాని శాంతింపదనియు ధ్వనించు చున్నది. ఆకలి యధికము గల జంతువులలో వృకము సుప్రసిద్ధము. కావున వృకావలి యని యుచట ప్రయోగించుట సార్థకమగుచున్నది. అట్లే "దిక్కులు సూచుచున్న'' యను ప్రయోగమును నుపమేయ మగు కౌరవసేనదీనస్థితినిఁ బ్రత్యక్షీకరించుచున్నది. రక్షించునాథుఁడు లేకుండుటవలన నేమిచేయుటకును దోచక దిక్కులు సూచుచు నిలఁబడుట యుపమానోపమేయముల కెంటను సమానము.

సంగరోత్సవమునకు వెడలు పాండవాది వీరులను వర్ణించుచుఁ, దిక్కన పాండవ కుమారవర్గమును జిత్రించిన విధాన మతిసరసము.

"రథసంక్షోభిత మేదినీతలముపై రథ్యప్రచారంబు లో
ప్ప భుజాగర్వము నెమ్మొగంబులఁ దలిర్పం గన్నకయ్యంబు న
ర్థి భవత్పుత్రులమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతియూథా
కృతిన్."

అభిమన్యు ద్రౌపదేయుల కిది కన్నకయ్యమగుటచే వారియుత్సాహమునకు మేర లేదు. కనుక నెప్పుడెప్పుడని వారుముందుకుదూకుచుండుటచే మేదిని క్షోభించినది. నవయౌవనమున నున్న కారణమున మాద్యద్దంతి యూథాకృతినున్న కుమారవర్గముయొక్క యుద్ధాటోపముచే మేదిని చలించుటాశ్చర్యము కాదు. ఉత్సాహముచే సంపూర్ణ వికాసముఁ గాంచిన వారినెమ్మొగములందు భుజాగర్వము తలిర్చినది. 'కన్నకయ్యము,' 'మాద్యద్దంతి యూథము' ననుశబ్దముల యర్థ మెట్లనోన్యవ్య సంయోగముచే నొప్పుచుండునదియు, నవి యెట్టి మనోహరార్థమును స్ఫురింపఁజేయుచుండునదియు, సహృదయ వేద్యము.

భీష్మపర్వమందలి యభిమన్యుయుద్ధవర్ణన, యికముందతఁడు పద్మ వ్యూహయుద్ధమునఁ జూపఁబోవు వీరవిహారమునకు నాంది యగుచున్నది. అభిమన్యుని యుద్ధకౌశలము, శౌర్యసాహసములు, నసాధారణమగు నస్త్రపాండిత్యము-ఇత్యాదులు తగిన విధమున నిందుఁ బోషితములైననేతప్ప, యతని పద్మవ్యూహవిహారవర్ణన కౌచిత్యము సిద్ధింపదు. కనుకనే తిక్కన యుద్ధాదినుండియు, నభిమన్యున కుచిత ప్రాధాన్యము నొసంగినాఁడు.

"ప్రళయకాల తాండవంబునఁ బ్రచండమూర్తియగు అష్టమూర్తి యుంబోలె విజృంభించిన భీష్ము మార్గణను మగలు లేక పాండవ సైన్యంబు బెండువడియున్న యెడ నభిమన్యుండు వచ్చి, తాకి, శల్య కృతవర్మ దుర్ముఖ వివింశతి కృపుల యేపు నొక్క త్రుటిలో నడంచి, భీష్ముపైనడరి,

"విశిఖనవకంబు నాటించి వెగడుపఱిచి
పేర్చియార్చిన సురకోటి పిచ్చలించె
మెచ్చి భీష్మాదులెల్ల విష్వచ్చుఁబోలు
నెక్కుడగుఁగాని యసదృగా దీతఁడనిరి."

"ఆసౌభద్రుం డుగ్రపు
వేసవి దావాగ్ని శుష్కవిపినమ్ము నిరా
యాసంబుగ దరికొనుగతి
భాసితశరశిఖలు వారిపైఁ బరగించెన్."

"రంగత్ప్రథనస్తుత్య తు
రంగముఁడై తాండవాభరతుఁడగు హరు-లీ
లం గడఁగి వీరనృత్యము
సంగరరంగమునఁ జేసె శత్రులు మెచ్చన్."

శుష్కమగుటచే నీరసమగువిపినము కురుసేనకును. సుగ్రపువేసవి యందలి దవాగ్ని యభిమన్యునకును నుపమానములఁ గావించి, తిక్కన కురుసైన్య నాశమును సూచించియున్నాఁడు. అభిమన్యుని వీరవిహారమును లయకాలరుద్రుని తాండవనృత్యముతోఁ బోల్చుట వలన, నభిమన్యుని శౌర్యమున కుదాత్తత సిద్ధించినది. బిందుపూర్వక గకారప్రాసముతోఁ, తరువాతిపాదములలోఁ జొచ్చుకొనిపోవుపాదాంత ముల విరుపులతోనొప్పు, నీ పద్యమునందలి శబ్దములన్నియు, నర్థము ననేకాక ధ్వనియందును లయకాల శివతాండవమును రూపించు చున్నవి.

"చెంగట నభిమన్యుండు పి
శంగతురంగప్రచారచంచద్రథుఁడై
పొంగి మనదిక్కుప్రజ మీఁ
దం గవిసెం జిచ్చు దూదిదరికొనుమాడ్కిన్."

అని యిదేపర్వమునమఱియొకచో వర్ణితము. ఇందును నుపమానముల యౌచితి ప్రశంసనీయము. అట్లే ద్రోణపర్వమున నభిమన్యుఁడు విజృంభించి వీరవిహారముఁ గావించుచుండ, నాకలితోనున్న హరిం దేకువసెడి చేరు కరికరిన్ దుర్యోధనుఁడు చేరవచ్చినాఁడు, రాజునకుఁ గలుగనున్న యుపద్రవమును వెంటనేగమనించిన ద్రోణునిచేఁ బ్రేరి తులైకృపాశ్వత్థామకర్ణాది మహావీరులెల్లరు నడ్డుపడి యభిమన్యుని బారినుండి దుర్యోధనుని రక్షించుకొన్నారు.

"ప్రకటబలాఢ్యు లొక్కట దిరంబయి పల్వురు వీఁక భూమి పా
లకునకు నడ్డమైన దవులంబడి హుమ్మని నోరికండ నా
చికొనిన ప్రేమోగు బెబ్బులివి శేషముఁ దోపఁగఁ బార్థుపట్టి నా
యకముల నొంచినన్ దెరలిరందఱు లేళులపిండు నాకృతిన్."

అభిమన్యుని బారిఁబడ్డ దుర్యోధనుని రక్షించుట, క్రూరవ్యాఘ్రము తినఁబోవు మాంసమును హరించుటవంటిది. క్రోధావేశమునవ్యాఘ్రము బిట్టురిమి వన్యసత్త్వములపై బడినట్లు రోషావేశమున నభిమన్యుఁడు హుంకరించి కురువీరులను బాణాగ్నికి గురిచేసినాఁడు. వ్యాఘ్రగర్జనచేఁ జెల్లాచెదరగు లేళ్ళగుంపువలెఁ గౌరవవీరులెల్లరు పంచబంగాళమై చెదరిపోయినారు. ఇట్లు సంపూర్ణార్థపోషకమగు నుపమానముచే నీ రచన కర్థగౌరవము సిద్ధించినది.

యుద్ధారంభమునుండియు నభిమన్యునిశౌర్య మీవిధమునఁ బోషితమగుటచేఁ బద్మవ్యూహగతమగు నతని విశ్శృంఖల వీరవిహారవర్ణన కౌచిత్యము కలిగినది. అస్త్రగురుఁడగు ద్రోణునంతటివాఁడగతికుఁడై, కర్ణ శకుని శల్య కృపా శ్వత్థామ బాహ్లికాది మహావీరుల నధర్మమునకుఁ బ్రోత్సహించి, లోకనిందకుఁ బాల్పడవలసివచ్చినది.

కర్ణద్రోణాదు లనేకులు చేరి, వంచనచే నొక్కసారిగ నభిమన్యుని నిరాయుధుండును, విరథుండును నగునట్లు గావించి, యడరి యస్త్రశస్త్రకలాపంబులనొంచి, చిక్కుపఱచియలచినన్,

"వాలును బలకయుఁగొని య
బ్బాలుఁడు రయమార గగనభాగంబున కు
న్మీలిత ధృతిసాహుండై
లీల నెగసిపోయె మండలీభూతగతిన్."

"తనవిద్యకలిమి వినతా
తనయునిభంగిం జరింపఁ దమతమపైఁ దెం
పున నుఱుకు నను తలంపున
మనయోధులు భయముఁగొనిరి మనుజాధీశా,"

ఇట్లు ద్రోణాదులూహింపని యద్భుతవిధమున నభిమన్యుఁడు విహారింపఁగా, నోర్వలేక మఱల గురుఁడే యతనిఖడ్గమును ఖండించినాఁడు: ఇట్లయ్యు నభిమన్యుండు శంకర, ఘనచక్రముంగొని, యుపేంద్రుఁడు లీల నటించు చాడ్పునఁ;

"కుంభసంభవుఁడున్న దిక్కునకుఁగవిసి
యడ్డుపడుసేనఁ జించిచెండాడు నక్కు
మారవరు మేని యొప్పును మగతనంబు
జవము బలము గీర్తించె నిర్జరగణంబు."

అధర్మయుద్ధమునకుఁ గర్ణాదులను బురికొల్పిన కుంభసంభవుని దిక్కునకుఁగవిసి, యభిమన్యుండు విజృంభించుట తగియున్నది. అపకృతి యొనరించిన వాని వెంటఁబడుట కృష్ణసర్పమునకు సహజమే. ఇట్లు నిర్జరగణము కీర్తించువిధమున వీరాధివీరులఁ జీకాకుపఱచి, శ్రాంతుఁడై, తుదకు దౌశ్శాసనితో నొక్కటొక్కటిపెనంగి, యతనింగూల్చి తానును గూలినాఁడు. కమలాకరము నవారణంజొచ్చి కలఁచియాడు వనగజమును గృపమాలిన బోయలు ముట్టిచంపు చాడ్పున ననేకవీరులుచేరి, యభిమన్యునిఁ గూల్పఁగా,

"జగము లన్నియునుఁ దేజంబున వెలిఁగించి
యపరాద్రిసేరిన తపనుమాడ్కిఁ
దరచైన కానలు దరికొని నివుఱుగాఁ
జేసి యారిన దవశిఖి విధమున
గగనంబుతో రాయు కరడులుగల జలం
బివురఁబారిన మహార్ణవము కరణి
నున్నతగతి సెడి యుర్విపైఁ గడువిన్న
నై పడియున్న సుధాంశుభంగి

బీరము నాదము వారికిం బెంపొనర్చి
యతులసమరయించి వసుమతి యనువుదప్పి
తెగియుం జూడ్కికింజాల ప్రేంగ గలుచుం బొలిచె
మహితమూర్తిశోభితుం డభిమన్యుండధిప."

ఇందుం బ్రయుక్తము లైన యుపమానములన్నియు నతిలోకము లై యుండుటవలన నభిమన్యువర్ణన కుదాత్తత సిద్ధించినది. అంతియ కాక, ముల్లోకములను భాసింపం జేసినమార్తాండుండ స్తమించుటకును, కాననములను ఖిపురుగాం జేసినదవాగ్ని యారుటకును, మహా సముద్ర మింపురం కారుటకును; లోకరంజకమగు సుధాంశుబింబము గతికొడి యుర్విపైం బడుటకును గాలప్రభావమే కారణము, అట్లే ద్రోణాది మహావీర ప్రపంచమునంతను దన శౌర్యకిరణజాలముచేం దపింపంజేసిన యభిమన్యు మార్తాండుం డస్తంగతమందుటకును గాలప్రభావమును, విధివిలాసమును హేతువులనుట గమ్యమాన మగుచున్నది.--మరణించి, రణరంగమునం బడి యుండియు, సుధాం శునివలె మనోహరుండై, చూడ్కికి ప్రేగయి పొలిచె ననుటచే, నభిమన్యుండెట్లు లోకాతీతమగు విక్రమముచే నెల్లరహృదయములను జూరంగొనియెనో వ్యక్తమగుచున్నది. అతండుగావించిన యతిలోక యుద్ధవిహార స్వరూపమును సూచించుట కీమహత్తరములగు నుపమాన వస్తువు లావశ్యకము లైనవి.

పద్మవ్యూహమును బ్రవేశించుటకుముం దభిమన్యునిచేం గవి పలికించిన వాక్యములు భావ్యనర్థమునకు సూచకములగుచున్నవి. బహువిధసమరకర్కశులగు కుంభజప్రముఖ సైన్యపతులతో నొప్పు వ్యూహమును, యుద్ధానుభవముచాలని యభిమన్యుండు ప్రవేశించుట సాహసమని సారథి హెచ్చరింపంగా, నభిమన్యుండు.

"అనవుడు నల్లనవ్వి యతఁడాతనికిట్లను దేవయుక్తుఁడై
యనికి బలారివచ్చినఁ బురారి గణంబులుఁ దానుఁ బన్నినం
గినిసి కడంగి క్రీడియునుగృష్ణుఁడు దాఁకిన నేఁ జయింతు మా
ర్కొనియనుచుండుదుర్ సరకుఁ గొందునె ద్రోణునిఁ దోడి
యోధులన్."

అనిపలికినాఁడు. ఇవి కేవలము యుద్ధోన్ముఖుఁడగు వీరుని యుత్సాహ వాక్యములు కావు. విధిప్రేరణమున మృత్యుముఖము ప్రవేశింపఁబోవు వాని నోటినుండి, యప్రయత్నముగ వెల్వడిన యతిసాహస వాక్యములు. అత్యావేశము హేతువుగా నహంకారము వాక్కులలో నెలకొన్నది. ఆరిపోనున్న దీప మొక త్రుటికాల మమిత తేజమునఁ బ్రజ్వరిల్లున ట్లభిమన్యుని జీవితజ్యోతియు నొక్కసారి భగ్గునమండి యారిపోయినది. విధిప్రభావ మిట్లు వివృతము గావింపఁబడినది.

ఇట్టి విషాదగర్భితపరిణామముతోఁ గూడినపద్మవ్యూహయుద్ధము మఱునాఁటియర్జునుని మానవాతీతమగు వీరవిజృంభణమునకుఁ గారణమైనది. సైంధవరక్షణార్థమాచార్యుఁడుగావించిన మహాప్రయత్నము, ప్రతిజ్ఞానిర్వహణమున బద్ధకంకణుఁడైన యర్జునుఁడు ప్రదర్శించిన యస్త్రవిద్యాకౌశలము, భీమసాత్యకుల శౌర్యసాహసములు, — ఇత్యాదులు, తనరచనా కౌశలముచేఁ బాఠకులయెదుటఁ బ్రత్యక్షమగునట్లు, తిక్కన గావించి యున్నాఁడు. సైంధవవధార్థమే కాకయై వ్యూహమును ప్రవేశించిన యర్జునునకు సహాయమేగుచున్న భీమునకు వ్యూహముఖముననే ద్రోణుఁ డడ్డుపడినాఁడు.

ఇదివరకే సాత్యకి ద్రోణునిఁదప్పించుకొని, వ్యూహమును బ్రవేశించినాఁడు. ద్రోణుఁడు సాత్యకిని బోనిచ్చుటలో నొక యుద్ధరహస్యముఁ గలదు.

సైంధవవధోద్యోగముమాత్రమే కాక సాత్యకిరక్షణభారముఁగూడ నర్జునునిపైఁబడఁగలదని ద్రోణునియూహ. అతఁడూహించినట్లే నిరంతర

యుద్ధకారణమున బరిశ్రాంతుఁడైన సాత్యకిని భూరిశ్రవుని బారినుండి యర్జునుఁడు రక్షింపవలసి వచ్చినది. భీమునిఁ బ్రవేశింప నిచ్చుట తమకు శ్రేయముకాదని ద్రోణుఁ డెఱుగును, కావుననే, యాతని కడ్డుపడినాఁడు. ఈఘట్టమున భీమునిపాత్ర నతిమనోహరముగఁ జిత్రించినాఁడు తిక్కన.

"నను గెలిచికాక నీ కి
మ్మొన సొరఁగా నెట్లువచ్చు మును నీతమ్ముం
డనుమతుఁడై కాదే చొరఁ
గనియె నను నతఁడు కన్నుఁగవ గెంపారన్."

"నరుఁడొక రథికుని యనుమతిఁ
జొరఁదలచునె మనుజసేన సురబలమైనన్
దెరలిచికొని విచ్చలవిడి
నరుగున్ దనవలచినెడకు నది యట్లుండెన్."

"ప్రియములువల్కి నిన్ననుసరింపఁగ బార్థుఁడు కాఁడు సుమ్ము దు
ర్జయభుజశక్తినిర్మథిత శత్రుఁడు భీముఁడు గాని నీవు దం
డ్రియు గురుడుం బ్రియుండు నని ప్రీతియొనర్చెదఁ బూనివైరికిన్
జయ మొనరింతుఁగాక యని సైతునె దర్పము సూపకుందునే."

అని పలికి,

"గదసారించి చెలంగివైచిన భుజాగర్వంబు సాలించి య
మ్మొదుగం దుర్వికిదాటిపోయె నది రశ్మిల్ మింటఁబర్వంగ బె
ట్టిదమై మ్రోయుచువచ్చిబల్విడుగుమాడ్కిన్ దాకుడున్ గుఱ్ఱముల్
నదిసెన్ సారథిమ్రగ్గెఁ దేరువొలిసెన్ సైన్యంబుభీతిల్లగాన్."

భీముఁడువిసరివైచినగద, తనకాంతులనన్నివైపులు ప్రసరింపఁ జేయుచు, శబ్దించుచు వచ్చి రథమును దాకినది. కాంతిప్రసరణము నకును, శబ్దించుటకును గదాదండము నమితవేగము కారణ

మగుచున్నది. ఇట్లు సూచితమైన మహావేగమునకుఁ గారణమగు భీముని భుజశక్తిమాహాత్మ్యమిందుచే ధ్వనితమైనది.

అప్పు డమ్మేటిమగండు వ్యూహమునఁ బ్రవేశింపఁబోవునంతలో ద్రోణుండు వేరొండు తేరెక్కి వచ్చి శరవర్షముచే నతని నడ్డినాఁడు. బాణపరంపరలఁ గురిపించి, గురునిగెల్చి, వ్యూహమును జొచ్చుట సుకరముకాదు, వ్యవధియునులేదు. త్రుటికాలము, ద్రోణుని యుద్ధవిముఖునిఁ గావించి, యతఁడు మఱల సిద్ధమగు నంతలో వేగముగ వ్యూహమును ప్రవేశింపవలయుననుట భీముని యెత్తుగడ. అప్పటి యతని భీమప్రయత్నవర్ణనకుఁ దిక్కన యాపాదించిన మనోహరత్వమసదృశమైనది.

"అరదము డిగ్గి యప్పటుశరావళికోర్చి మొగంబు వాంచి స
త్వరుఁడయి వాన పైఁగురియ వంచినమస్తకమొప్పఁ బోవు సుం
దర వృషభంబులీలఁ జని దర్పమెలర్పఁగ నొక్కచే నొగల్
వెరవునఁబట్టి తేరు ప్రజ విస్మయమందఁగ వీచి వైచినన్."

వర్షపాత మత్యుత్సాహముఁగల్గఁజేయఁ జెలరేగి, తలకొంచెము వంచి, మిట్టప్రదేశములనుఁ గొమ్ములచే గోరాడఁ బోవుకోడెలను జూచిన వారికీ వర్ణనయందలి విశిష్టత సువ్యక్తముకాఁగలదు. ద్రోణుని పలుకులకు భీముఁడిచ్చిన ప్రత్యుత్తర మతని స్వభావమును జక్కఁగఁ బ్రదర్శించుచున్నది. తన యనుమతిఁ గైకొనియే యర్జునుఁడు వ్యూహమును బ్రవేశించె నని ద్రోణుఁడనుటతో, భీముని నేత్రములు రోషారుణ రంజితములైనవి. సురసేనసైనను నెవ్వరి యనుమతి నొందకయే ప్రవేశించి నరుఁడు తన యిచ్చవచ్చిన చోటికి బోఁగలఁడను నతని పలుకులలో క్షాత్రము, రాజసము, నర్జును విక్రమమునందతనికిఁగల విశ్వాసము వ్యక్తములైనవి "నీవు గురుఁడవై పితృసమానుఁడవగుటచే నిన్నుఁ బూజింతునుగాని, నీవు వైరికి జయమాపాదించుచుండ సహిం

తునా, శౌర్యమును జూపకుందునా, దుర్జయభుజశక్తినిర్మథిత శత్రుఁడగు భీముఁడు సాంత్వనవాక్యములచే నిన్ననునయించునా'' యను భీముని పల్కులలో, నుద్ధతితోఁబాటతని వినయ వివేకములును బ్రదర్శితములైనవి. ఇట్లు పాత్రల శీల స్వభావాదులను వ్యక్తపఱచు సహజ సంభాషణములచేఁ దిక్కన యుద్ధవర్ణనము నాకర్షణీయముఁ గావించియున్నాఁడు.

సన్నివేశములఁ బురస్కరించుకొని, రౌద్రమునకాటపట్టగుయుద్ధరంగము నొక్కసారిగా రమణీయమగు ప్రకృతిదృశ్యముగ మార్చుట తిక్కనరచనయందలి విశిష్టగుణములలో నొకటి. భీష్మార్జునుల ద్వంద్వయుద్ధమున నర్జునుఁడు చేడ్పడఁగా, కృష్ణుఁడు సైరింపక, రథంబునుండిదుమికి, భీష్మునిపైఁబోవుట యుట్టి సన్నివేశములలో నొకటి.

''ధరణీచక్రముగ్రక్కునంగదల దిగ్దంతావళ శ్రేణి కం
ధరముల్ ద్రుమ్మొగ్గఁబడఁగ దిశావలయ ముత్కంపంబుగా నీబలం
బురులం బారగ భీష్ముపైఁగవిసె రౌద్రోద్రేకముంజూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్.''

అని రౌద్రరసోత్పాదకముగ నొకపద్యమున వర్ణించి, తిక్కన తత్క్షణమే యైంద్రజాలికునివలె, మఱుపద్యమున దృశ్యమును మార్చివైచి యుండుట, గమనింపఁదగినది.

''లలిత పీతాంబరంబువిలాసమొప్ప
సింహనాదోద్భటంబగు చెలువుతోడ
మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయవచ్చు
కాఱుమొగిలనఁ గృష్ణు నాకారమొప్పె.''

వర్షాకాల మేఘధర్మములగు విద్యుత్కాంతిగర్జలను రెంటి నుప మానములుగ నిందు వాచ్యములుచేసి, మానవధర్మమగు నలుపు

ఉపమానోపమేయముల రెంటను సమానమగుట, వాక్కులచేఁ జేర్కొనక కవి వ్యంగ్యముఁ గావించియున్నాఁడు. ఇట్లు సహజములు మనోహరములునగు నుపమాలంకారముల సాహాయ్యముచే, నుదాత్తములగు విశేషార్థములను ధ్వనింపఁజేయుట, తిక్కన యుద్ధవర్ణన యందు సర్వత్ర కానవగుచున్నది. ప్రయుక్తములగు శబ్దము, నర్థము, నలంకారము నిత్యాదులచే, మనోహరములగు విశేషార్థ, విశిష్టాలంకారాదులను ధ్వనింపఁజేయుట, ప్రౌఢకవితాలక్షణము. రసాత్మకమైన యిట్టిధ్వనియే కావ్యాత్మయని పండితకవుల సిద్ధాంతము. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమున, నర్జునప్రయుక్తమహాస్త్రములు మేననెత్తురులఁబరప గైరికనిర్ఝరప్రకరశోభితాచలము వోలెఁబొలుచు కర్ణుని తిక్కన వర్ణించినవిధ మిందుల కొక యుదాహరణ మగుచున్నది.

“నెత్తుటఁదోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ భాస్వరుఁడై యరదంబు మీఁద భూ
పోత్తమ కర్ణుఁడొప్పె నరుణోజ్జ్వలమండల కాంతి పూరముం
మొత్తపుదీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్.”

రక్తముచేఁదడిసిన మేను కమనీయకాంతిచే నొప్ప, మహాస్త్రముల కాంతి యుదగ్రముగఁ బ్రకాశించుచుండ, రథముపై వెలసిన కర్ణునకు, సాంధ్యారుణశోభితము, నుజ్జ్వలకాంతిమంతము, పశ్చిమాచలోపరిస్థితము, నగు సూర్యబింబ ముపమానము. ఉపమానోపమేయములు సమగ్రార్థపోషకములగు సాధర్మ్యములచే నొప్పుచున్నవి. మఱియు, ‘భాస్వరుఁడై’ యనుప్రయోగము విశిష్టార్థ బోధకము. “భాస్వరః” అనుపదమునకుఁ బ్రకాశించువాఁడనియు సూర్యుఁడనియు నర్థములు. భాస్వరుఁడగుకర్ణునకు, భాస్వరుఁ డుపమానమగుట యందలి విశేషము. ఇంతియకాక అనతికాలముననే యర్జునునస్త్రములకుఁగుఱియై యస్తమింపనున్న కర్ణుని వర్ణనమిది. ఉపమానమగు

సూర్యబింబమును న_స్తమింపనున్నది. ఇట్టి యుపమానముచేఁ గర్ణుని వధను ధ్వనింపఁజేసియున్నాఁడు తిక్కన. మఱియు, సూర్యుఁడు తన ప్రచండమగు తేజస్సుచే లోకమును దపింపఁజేసి, కాలమునతిక్రమింప లేక, యస్తంగతుఁడైన విధమున నతనియంశమున జన్మించిన కర్ణుఁడును, దనపరాక్రమముచే వైరితాపమొనరించి, విధినతిక్రమింపలేక యస్తమింపనున్నాఁడనుట హృదయంగమమగు రచనయగును. కనుకనే తిక్కన,

"దారుణాస్త్రజాలాంశుల వైరిసైన్య
తాపమొనరించి యా సూతతనయతరణి
పార్థ దుస్తరకాలవైభవముఁ గడవ
ననువులేమి నవ్విధమున నస్తమించె."

అని కర్ణుని ప్రతాపాస్తమయములను, సూర్యుని ప్రతాపాస్తమయములతో నభేదరూపకముఁ గావించియున్నాఁడు.

ఉపమానోపమేయములకు చక్కని అంగాంగభావసామరస్యము పొసఁగునట్లు రూపకాలంకారమునుగూర్చి, వర్ణనీయవస్తువున కుదాత్తత నాపాదించుట యితనిపద్ధతి. కర్ణుని విజృంభణము నొకచో వర్ణించుచు,

"బాణజ్వాలలు బెట్టుపర్వ గగనప్రక్షోభణజ్యాలతా
క్వాణస్ఫూర్తి ఛటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవనభస్మీభావనిర్వాహపా
రీణంబై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నేముబ్బఁగన్."

అని, యతనిని దావాగ్నితో నభేదముగ వర్ణించినాఁడు. దావాగ్ని జ్వాలలన్నివైపుల వ్యాపించినట్లు కర్ణుని బాణజ్వాలలు సర్వముఖముల వ్యాపించుచుండుటయు, కాలుచున్న వృక్షములును, వెదుళ్ళును, ఫెళఫెళారావములొనర్చునట్లాతని జ్యానినాద మొప్పుచుండుటయు, దవా

గ్నిచే నరణ్యముభస్మీభూతమైనట్లు వైరిసైన్యము నిస్సారమగుచుండు టయు, నను సాధర్మ్యములు చక్కగ సమన్వయించుచున్నవి.

గజసమూహములపై లీలనరిగి గదావిహారమునల్పు భీముని యాటోపము పలుచోట్ల, పలువిధముల, వర్ణితమైయున్నది.

"గజఘటలం గనుంగొని వికాసము మోమునఁ బల్లవింపఁగా
భుజశిఖరంబునందు గదఁ బూన్చి మదంబున దేరుడిగ్గి వా
యుజుఁడు గడంగి భీషణసముద్ధతిమై దలపడ్డఁ బర్వత
వ్రజముపయిన్ వెసంగవియు వాసవుచందముఁదోచె నత్తఱిన్."

తనపైవచ్చు గజసమూహముం గాంచినతోడనే భీముని మోమున వికాసము పల్లవించినది. అతని గదాదండ విశృంఖల విహారమున కర్హమైనది గజసమూహము. అశ్వపదాతివర్గము లందులకుఁ జాలినవి కావు. మత్త మాతంగదర్శనమున సింహమునకుఁగల్గు సంతోషము, హరిణసమూహదర్శనమునఁ గలుగకుండుట ప్రకృతిసహజము. కనుక భీమునిముఖము వికసించు టెంతయు నుచితము. మఱియు సంతోష ప్రాదుర్భావముచే ముఖమెఱ్ఱవడుట దైహిక లక్షణము. కనుక 'పల్లవించు' నను ప్రయోగముచేఁ, దిక్కన యీలక్షణమునుగూడ ధ్వనింపఁజేసినాఁడు.

"ఏనుఁగు నెత్తుట గదయున్
దానుఁ దడిసి విలయకాల దండధరుని చం
దానం బావని మాగధ
సేనం బీనుంగు పెంటఁ జేసి చెలంగెన్."

"అడవి వరి కొనిన పావకు
వడువున భీముండు కౌరవవ్యూహంబుం
బొడిసేయుచుఁ బేర్చెం దన
యొడలు మనము నంతకంత కుబ్బుచునుండన్."

గదాదండమును ధరించి మాగధునిసేనను బీనుఁగుపెంటఁ గావించిన భీమునకుఁ బ్రళయకాలమున జీవులను బీనుఁగుపెంటఁగావించు దండధరుని తోడి పోలిక యెంతయు నర్థవంతమై యున్నది. కౌరవసైన్యదాహకుఁడగు భీముని కడవిని దహించు దవాగ్ని యుపమానము. ఇందుఁ "దనయొడలు మనము నంతకంత కుబ్బుచునుండఁగ," అను క్రియావిశేషణ మర్థగౌరవముచే నొప్పుచున్నది. అడవి దహింపఁబడు కొలఁదియు, దావాగ్నివ్యాప్తి విస్తారమై తత్పరిమాణము వృద్ధియగు చుండుటయు, దాని ననుసరించి, దాహశక్తికూడ వృద్ధిఁగాంచుటయు, సహజములే. అట్లే, కౌరవసైన్యము నాశమగుకొలఁది, భీముని దేహ మువ్పొంగుటయు, నతని శక్త్యుత్సాహములు వృద్ధియగుటయును సహజమే. ఇట్లర్థస్ఫోరకమగు విశేషణప్రయోగము వలన నలంకారము ప్రౌఢమైనది.

దుశ్శాసనదుర్విషహాదికౌరవు లొక్కసారిగాఁ, జతురంగబలంబులతోడం జుట్టుముట్టిన, వృకోదరుండు సంతసంబునం బొదలి, సారథిని రథంబుతో నుండనియమించి, గదవుచ్చికొని ధరణికిలంఘించి, జరిపిన వీరవిహార మత్యద్భుతము, దివ్యశక్తిస్ఫోరకము, నగుచున్నది.

"కవిసి యుగాంతదండధరుకైవడిఁ గోలుమసంగి కుంభముల్
పవులగఁ దుండముల్ దునియఁ బ్రక్కలు వ్రక్కలుగాఁగ దర్పముఁ
జవము బలంబు నొప్పఁగ గజంబుల వ్రేసిన నెత్తురొల్కఁగా
నవి వడె ధాతునిర్ఝర మయాచల పంక్తులఁబోలి మేదినిన్."

యుగాంతమునఁ బ్రాణులఁ బంచత్వము నొందించుటయే యముని ధర్మము. తద్విలయముం గావించుటలో రౌద్రబీభత్సములు సాకారములై వికటనృత్యముఁ గావించుటతప్పదు. కౌరవుల విషయమున భీముఁడు విలయకాలదండధరుఁడనుట తగినదే. అతఁడు గావించిన రౌద్రవిహారము, నట్లే యుపమానమున కుచితముగ వర్ణితమైనది.

మఱియు రక్తధారలచే నొప్పి, కదలికలేక క్రిందం బడియున్న గజ రాజములు, ధాతునిర్ఘరమయములగు పర్వతములతోఁ బోల్పఁబడి నవి. గైరిక ధాతువుల కారణమున నెఱ్ఱవడియున్న సెలయేళ్ళు, పర్వతోపరిభాగములనుండి క్రిందికిఁ బ్రవహించుచుండఁగా, నాపర్వతములు మనోహర దృశ్యములై యొప్పును. ఇవి ప్రకృతిసహజములగు నుపమానములు. ఈ యుపమానములయందలి సహజ సౌందర్య గాంభీర్యములచే వర్ణనీయ వస్తువున కుదాత్తత సిద్ధించుటయే కాక, యందలి బీభత్సమును, మరుగు పడినది.

సైంధవవధనాటియుద్ధమున నర్జును డుగావించిన వీరవిహారమును వర్ణించుచు, దిక్కన యద్భుతరసమును బోషించిన విధానమును, నిట్లీ యతని కవితాశిల్పమును బ్రకటించుచున్నది. సైంధవవధోద్యోగమున నెడ తెఱపి లేక, యుద్ధనిమగ్నుఁడై యుండిన యర్జునుని రథాశ్వముల దేహములం దలుగు లసంఖ్యాకములుగఁ గ్రుచ్చుకొన్నవి. ఆ కారణమున నవి యుద్ధమునఁ జక్కఁగ బ్రవర్తింపలేవని కృష్ణుఁడు చెప్ప, నర్జునుఁడు రథావతరణముంగావించి, పాదచారియై, నిలిచి గాండీవ గుణంబు సారించినాఁడు. కృష్ణుఁ డశ్వములను బరామర్శించుచుండఁ, గౌరవ సైన్యము లొక్కుమ్మడిగా విరథుఁడై యున్న యర్జును నాక్రమించినవి. అర్జునుఁ డీసమయమునఁ బ్రదర్శించిన యస్త్రకౌశలమును, నసాధారణములగు నాత్మవిశ్వాసగాంభీర్య శౌర్యములును, నద్భుతావహములు, దివ్యములు.

"........బీభత్స రౌద్ర మహాద్భుతములు
మూర్తిమంతంబులుగ మన మొనలు రక్త
మాంసమేదోస్థిమస్తిష్కమయతఁ జూడ
ఘోరరూపంబులై పరిక్షోభ మొందె."

ఇవ్విధంబువం గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్న కవ్వడిం గనుంగొని, కమలనాభుండు,

"పెఱికితి నలుగులు మేనులు
నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నివిరితి హరు లి
త్తఱి నీళులు ద్రావక తె
ప్పిఱి వెట్లొకో శత్రుసైన్యభీకరమూర్తీ."

అనవుడుఁ గన్నుల నగి యర్జునుండు "గల వివె యనుచున్,"

"ధర దివ్యాస్త్రప్రహతిం బగిల్చి కోల నుత్పాదించి వే దానికిన్
శరజాలంబుల నిల్లుఁగట్ట మనసైన్యంబుల్ వెఱంబొందెన
చ్చెరువందెన్ సురసంఘముల్ హరినుతించెం బొంగి యప్పార్థ భూ
వర మున్నిట్టివి సూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్,"

ఈయలౌకిక సంఘటనను, దిక్కన యొకసీసపద్యమున నద్భుతావహ మగు విధమున, నర్జునుని మూర్తి దృగ్గోచరమగునట్లు, చిత్రించి యున్నాడు.

"కురు సేన పైఁబడ్డ సరకుసేయక మంచు
విరియించు భానునివెరవు మెఱసి
యిది నడుగలనని యించుకగొంకక
తనఘోటకంబులఁ దడవఁ బనిచి
కోల నక్కజంబుగ నలుగుల మొన ఘటి
యించి యమ్ముల దాని కిల్లుఁగట్టి
సారథి లీల నశ్వముల కార్యముఁదీర్చు
నంతకు నవ్వుచు నవుల నిలిచి
గారవమునఁ దాను గానివాఁడునుబోలె
నరద మెక్కె నింక నడ్డపడఁగ
నలవియే పురారికైనను పీనిచేఁ
జచ్చువాఁడుగాక సైంధవుండు."

సారథియగు కృష్ణుఁడు విలాసముగ నశ్వములను గమనించుచుండ, నర్జునుఁడు 'నవ్వుచు నవుల నిలచియుండె' ననియు, బిమ్మట 'తాను గాని వాఁడునుబోలె నరదమెక్కె' ననుటయు ముఖ్యముగ గమనింపఁ దగినవి. ఈ మహాద్భుతకార్యములన్నియు నతనికి లీలలనుట, యతని చిఱునవ్వు సూచించుచున్నది. అట్లే తా ప్రదర్శించిన దివ్యాస్త్ర సామర్థ్యమతనికి సామాన్యమని 'తాను గానివాఁడును బోలె నరద మెక్కె' వను వాక్యము వ్యక్తముఁ జేయుచున్నది.

ద్రోణుఁ డొసంగిన పరాభేద్యమగు కవచమును ధరించి, గర్వముతో దుర్యోధనుఁడు తన్నుఁ దాకఁగా, నర్జునుఁ డాకవచ ప్రయోజనమును నిష్ఫల మొనర్చిన విధాన మత్యాశ్చర్యకరము.

"అన్నరుఁ డానృపు
తురఁగములను సూతుఁ దునిమివైచి
రథము నఱికి యధికరయమునఁ దఱచుగ
నాటెఁ గరతలముల నారసములు."

తఱచుగ బాణములను గరతలములయందు నాటుటచే దుర్యోధనుఁడు వికలహస్తుఁడైనాఁడు. యుద్ధమునట్టి క్లిష్ట పరిస్థితియందును, నర్జునుఁడు కలతఁజెందక, సమయస్ఫూర్తితో వ్యవహరించుననుట కిది నిదర్శనము.

సైంధవునిశిరమును ద్రుంచియు, దానిని గ్రిందఁబడనీయక, యంతరిక్షముననే త్రిప్పుచు, నర్జునుఁడు యుద్ధమును సాగించిన విధానమును నిట్లే యద్భుతరసోత్పాదకముగ వర్ణితమైనది.

"పటుశరముల మీఁదికి డా
పటికిఁ వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె సము
త్కటరయమున శిరముఁ గందుక క్రీడగతిన్."

అట్టియెడ శత్రువీరులు,

"నరుఁ బొదివి రథఁదు వారల
యురవడి వివిధాస్త్రతతుల నడుపుచు నింగిం
దిరుగ మును నడపుచుండెడు
శిరమును నేమఱకయుండెఁ జిత్రస్ఫురణన్."

దివ్యాంశసంభవుఁడగు నరుని యద్భుతచర్యల నీపద్యములు పునః దృష్టికిఁ దెచ్చుచున్నవి. తిక్కనకవితాశిల్పమున కిదియొక నిదర్శనము.

భీకర పౌరుషప్రధానమగు యుద్ధరంగమునకుఁ గోమలతా లాలిత్య ప్రధానమగు స్త్రీవిలాసము నాపాదించుట, తిక్కనరచన యందలి మఱియొకవిశేషము.

"ధరణి నెత్తుటఁదోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలమ్ములఁ జాలనొప్పె
బలుచకాకుండఁ గుంకుమమలఁది పెక్కు
దెఱఁగు తొడవులు దొడిఁగిన తెఱవ పోలె."

రక్తము చేతడిసి, ఆభరణయుత దేహఖండములతో నొప్పి శస్త్రాస్త్ర ఖండములతోఁ గూడి జుగుప్సావహమైయున్న యుద్ధభూమికిఁ, గాశ్మీ రాంగరాగరంజితము, వివిధాభరణపూతము, నగు సుందరస్త్రీదేహ ముపమానము గావింపబడినది. అట్లే, శల్యపర్వమున నశ్వసైన్యవర్ణ నకు శృంగారము నాపాదించియుండువిధము కడుహృద్యమై యున్నది.

"గతిబహుతాల సత్ఖురవిఘట్టితమేదిని జీవితేశ క
ల్పిత నఖరేఖలం జెలువుపెంపు వహించు పురంధ్రిఁబోల ను
ద్ధతముఖ బంధురాంగలలితంబులు నూర్జిత కింకిణీఝుణ
త్కృతి పటుహేషలుం దగ నుదీర్ణములై నడచెం దురంగముల్."

గుఱ్ఱపుడెక్కల గుర్తులచేనొప్పు రణభూమిని, భర్తృకృత నఖక్షత శోభచేనొప్పు పురంధ్రితోఁ బోల్చినాఁడు తిక్కన. ఇందలి శృంగార లాలిత్యము హృదయంగమము. ధర్మజప్రయుక్తమగు "శక్తి" వక్షమును జొచ్చుకొనిపోగా, శల్యుఁడు కరద్వితయముసాచి, ధర్మజుని దిక్కు శిరంబుగ, వజ్రదారుణాహతిబడు భూరి భూధర మహోత్తర శృంగముభంగి, భూమిపైఁ బడినాఁడు. అట్లుపడిన శల్యునివర్ణన మఱి యొక చక్కనియుదాహరణ.

"భూమిమీఁద నిట్టు బోరగిలంబడి
మద్రనాథుఁడొప్పె మానవేంద్ర
లేమయురమునందు లీలమై వ్రాలిన
ప్రాణనాథుఁ బోల్పఁ బట్టుగాఁగ."

శల్యుఁడు క్షత్రియుడగుట భూమిపతియగును. కనుక భూమిపై నట్లు బోరగిలంబడిన శల్యుని, సతియురమున విలాసముగ వ్రాలిన ప్రాణనాథునితోఁ బోల్చుటయందలి సరసత, యౌచితి, గమనింపఁదగినవి. 'ప్రియుఁడగుభర్త' యను విశేషార్థముగల 'ప్రాణనాథ' శబ్ద మిందు సుష్ఠుప్రయుక్తమై, యర్థగౌరవమునకు హేతువగుచున్నది. విషయములగు లలితశృంగార, భీషణమృత్యువు, లిందు రసవత్తరముగ సంఘటింపఁ బడియున్నవి.

ద్రోణపర్వాంత్యభాగమున, సైనికులు రాత్రియంతయు యుద్ధముఁ జేసి, శ్రాంతులై యుండుటం గాంచి, యర్జునుఁ డిరువాగు నుద్దేశించి, చంద్రోదయమగువఱకును నిద్రించి, పిమ్మటఁ, బోరనగునని పల్కగా నెల్లవారును నతని దయా స్వభావమును గీర్తించుచు నిద్ర వోయిరి. ఆసమయమున నుభయబలంబుల యందును,

"తరుణుల కుచములపై రతి
పరవశులై యొరగు పతులపగిది సమరసం
భరిత శ్రమమున నిద్రించిరి
కరికుంభములఁ జెంది చెన్నుగ జోదుల్."

రతిపారవశ్యపరిశ్రాంతిచేఁ దరుణుల కుచసీమలపైఁ జొక్కిన పతులు యుద్ధశ్రమమున శ్రాంతులై, యేనుఁగుల కుంభస్థలములపై నొరగిన యోధుల కుపమానము. ఏనుఁగుల కుంభస్థలమును దరుణీ కుచసీమతోఁ బోల్చుట, కవిసమయము. ఉపమానోపమేయములకు సమగ్రమగు సంగాంగభావసామరస్య మొప్పినది.

బీభత్స ప్రధానమగు రణరంగవర్ణనను గావించుచో రమణీయము లగు సదృశవస్తువుల వర్ణనాసాహాయ్యమున జుగుప్సను మఱుగు పఱచుట తిక్కన యనుసరించిన మఱియొక రచనావిశేషము

"నెత్తుటఁదోఁగియు నిగిడిపోరెడు వీరు
లలరిన నడమోదుగుల విధంబు
గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహుదం
డములు మహాభుజంగములభంగి
యవని రక్తాక్తంబులై యున్న యట్టి బల్
దలలు కెందామరకొలనిపగిది
దఱచుగా నెత్తుఁదప్ప నొఱఁగిన గజములు
కులిశ భగ్నాచల కులమునట్లు
దునిసి తొరగిన జోదుల తొడలు సామ
జముల కరములు నొండొంటి చందములు గ
నుంగొనఁగ వింతలగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు నయ్యె."

సంగరాంగణమును, రమణీయమును, భీషణమును, నగు విధమునఁ జిత్రించుటయే తిక్కన యుద్ధవర్ణనయందలి ముఖ్యమగు విశిష్టత. సంపూర్ణ సామ్యముగల సహజోపమానముల, నుచిత సన్నివేశముల యందుఁ బ్రయోగించు విశిష్టతలోఁ, గాళిదాసున కెనవచ్చు తెలుఁగుకవి తిక్కన యొక్కఁడే. ఉదాహరణము లతని భారతభాగమున ననేక ములు సర్వత్ర కానవగును.

దుశ్శాసనుని యమానుషమగువధయు, కర్ణుచావును, సంజయునిచే విన్నధృతరాష్ట్రుఁడు తన హృదయావేదనను వెలిబుచ్చిన విధ మట్టి సహజోపమానముతో నొప్పుచున్నది.

—"పడుచు లీకలూడ్చి పట్టి యాడెడు నట్టి
పులుఁగుచందమయ్యెఁ దలఁప నా య
వస్థ యెందుఁజొచ్చువాఁడ నీ యలమటఁ
దీర్ప నెవ్వరింక దిక్కుగలరు."

బాలురచేఁ జిక్కి, వినోదార్థము వారు తన యీక లొక్కటొక్కటిగ లాగివేసి సంతోషించుచుండఁగా, బాధపడుచుండు పక్షియవస్థ తనకుఁ బట్టినదని, ధృతరాష్ట్రుఁ డనుచున్నాడు. పక్షియీఁకలు తద్దేహజన్యములు. అట్లే ధృతరాష్ట్రుని పుత్రపౌత్రాదులును, నతని తనూజులగుదురు. వారొకరొకరు హతులగుచుండ, నతనికి మర్మభేదకమగు వేదన కలుగుచున్నది. ఈఁకలు పోయినపిమ్మట పక్షి నిర్జీవమగునట్లే, పుత్రనాశానంతరము ధృతరాష్ట్రుఁడును, జీవచ్ఛవమగుట నిక్కము. బాలుర వినోదముచే పక్షికత్యంతము బాధకల్గుటయుఁ, బాండవ కౌరవుల కలహముచే నంధుఁడు, నగతికుఁడు, నగు ధృతరాష్ట్రునకు దుర్భర వేదన కలుగుచుండుటయు సమానములు. ఇట్లిందలి యుపమానము సంపూర్ణార్థ పోషకమగుచున్నది.

ఈఘట్టమునఁ దిక్కన గావించిన చంద్రోదయవర్ణన, మూఁడు శతాబ్దుల యనంతరము పరిణతిఁగాంచిన ప్రబంధరీతి కుత్తమాదర్శమై యున్నది.

"నలువ చెందొవల రేకులకు నన్నువు వెట్టఁ
    గోరి కావించిన గుళికయనఁగ,
నఖలద్విజ శ్రేష్ఠమగు చకోరచయంబు,
    తపము సముల్లస త్ఫలమనంగఁ
బూర్వ పయోరాశిపొంతఁ గెంజాయ చె
    న్నొందవిన పనడంపుఁ బొద యనంగఁ
జిగురు జొంపము నునుజిగి యొప్ప నుదయాద్రిఁ
    బొలుపారు నవ కల్పభూజ మనఁగ
నరుణరుచిఁ దనమండల మతిశయిల్ల
బొడిచి దివిఁ బ్రాకి దీధితులఁ బరఁజేసి
యంతకంతకు నెక్కుచు సంతమసముఁ
గాలుకొననీక చంద్రుఁడు గ్రాలె నధిప."

ప్రబంధముల ముఖ్యలక్షణములగు భావనామూలక వర్ణనా విశిష్టతకును, శబ్దప్రయోగ చాతుర్యమునకును, నీ పద్య మాదర్శమైనది.

ఇట్లు, యుద్ధవర్ణనలను బ్రశాంత సుందరములగు ప్రకృతిదృశ్యములతో సమన్వయింపఁజేసి, రచనకు మనోహరత్వము నాపాదించియున్న ఘట్టము లనేకము లిందుఁ గలవు.

రౌద్ర ప్రధానములగు సన్నివేశములను జిత్రించుపట్ల, నవిపాఠకుల మనోవీధిని బ్రత్యక్షములగునట్లు గావించి, వారి నావేశపూరితులుగఁజేయుట, యితని యుద్ధవర్ణనము దెల్లెడలఁ గానవగు విశిష్టగుణము.

కౌరవ కులపాంసనుఁడగు దుశ్శాసను నాక్రమించి విజృంభించిన భీమసేనుని స్వరూపవర్ణన, యుందులకొరకే చక్కని నిదర్శనము. కులస్త్రీకిఁగలిగిన యవాచ్యమగు నవమానము హేతువుగా జన్మించిన క్రోధాగ్ని, క్షాత్రస్వరూపుఁడగు భీముని హృదయమున పదమూఁడేడులు కుమిలినది. భీమున కత్యంతముఁ బ్రియతమమగు నవకాశ మిప్పుడు లభించినది. "అక్కుచకారాతి బెబ్బులి లేడిఁగొదమం బొడువుపోలిక దుశ్శాసనునిఁ బొదివి మెడఁద్రొక్కి వానితో నిట్లనియె."

"మున్ను సభఁ బలికినదానం
దనివోవక యిచ్చటికి వెదకివచ్చితి రే మ
మనియె దనుము నీమాటలు
వినుటకు నాకినుక సాల వేడ్కపడియెడున్."

అని యమ్మహాబలనందనుండు, మహోగ్రలోచనప్రభలు నిగుడ మన బలంబులం జూచిన,

"నిగుడు దవాగ్నిజ్వాలల
వెగడందిన మృగకులంబు విధమున నతి భీ
తి గదిరి నలుగడ విచ్చిన
జగతీశ్వర యతఁడు మెరసెఁ జక్కనిబయలన్."

"లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
భీలత్వం బలరింపఁ ద్రిప్పుఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలంద్రోచు ముగంబుద్రేయు దెస లుగ్రస్ఫూర్తివీక్షించు మోఁ
కాలూఁదుంబయిఁ గ్రమ్మరంగ మెడ చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్."

ఇవ్విధంబున ఘోరవిహారంబుసలిపి, భీమవిక్రముండగు నాభీముం డయ్యవకాశ నానసం బాలోకించి,

"ఏ సురము వ్రచ్చి నెత్తురు
దేనియ యిదె ద్రావెదం గదిసి నను గడిమిన్
మానుప దిక్కు గలిగిన
వాని మ్మొలిఁగింపు మీ మొనంగలవారిన్."

అని పెలుచం బలికి, కఠారంబు వెరికి, యతని మొగంబుమీఁద జళిపించి,

"నరసింహుండసురేంద్రు వ్రచ్చు కరణిన్ రౌద్రం బుదగ్రంబుగా
సురమర్త్యాగ్రతఁ జీరి క్రమ్ము రుధిర మ్ముల్లాసియై దోసిటన్
వెరవారంగొని ద్రావు మెచ్చుఁ జవికిన్ మేనున్ మొగంబున్ భయం
కర రేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచున్ బోరిన్."

భీకర క్రోధాగ్ని స్వరూపమే యిందుఁ బ్రత్యక్షమైనది. భార్యకుఁ గలిగిన పరిభవము చేఁ బురుషుని హృదయ మెట్టి భీషణపరివర్తనమును గాంచునదియు, ప్రతీకారావకాశము లభించినప్పు డతని ప్రకృతి యెట్టి యుగ్రస్వరూపమును దాల్చునదియు నిందుఁ బ్రత్యక్షమైనవి.

మహాబలనందనుఁడను ప్రయోగమిందర్థపోషకమై యున్నది. మహాబలుఁడు, ప్రభంజనుఁడు. అతఁడప్రతిహతమగు విజృంభణముతో నొప్పువాఁడు. కనుక నతనికుమారుఁడగు భీముని ప్రయత్నమును నప్రతిహతముగ జరుగుననియు, నెవ్వరు నితనిధాటి కెదురుగ నిలువ లేరనియు, ధ్వని. అట్లే, 'మహోగ్రలోచనప్రభలు నిగుడ మన బలంబులం జూచిన' వనుటలో నర్థవిశేషముకలదు. ఫాలనేత్రమును దెఱచి, సృష్టిని లయింపఁ జేయు త్రినేత్రుఁడుగ్రుఁడు. అతనివీక్షణములు దుర్నిరీక్ష్యములు, లోకదాహకములు. కనుక, క్రోధావేశమునఁ గన్నుల నిప్పులురాల్చు, భీముని వీక్షణములంగని, దవాగ్నిజ్వాలల వెగడందిన మృగకులమువలె భీతిల్లి, కౌరవసైన్యము చెల్లాచెదరగుట యెంతయు సమంజసముగ నున్నది,

కౌరవసైన్యము పొందిన యీ దైన్యము, భీముని యుగ్రస్వరూప మెట్టిదో వ్యక్తపఱచుచున్నది.

"అని యెలుఁగెత్తి పల్కి నలినాఁడు మహోద్ధతిఁ గ్రుళ్ళు నార్చుఁ బె
ల్చన భుజమప్పళించుఁ దమసైనికులుఁ మనవారు రక్కసుం
డని వెఱఁగందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారునై రణవిరామముఁబొంద మదోత్కటాకృతిన్."

ఇట్లమానుషమగు విధమునఁ బ్రతిజ్ఞ నిర్వహించియుఁ, గోపము శాంతింపక, దుస్ససేనుఁ గనుంగొని, భీముఁడు పల్కిన వాక్యములు గమనింపఁ దగినవి.

"పైవడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి యీ సభం
దా వలదన్నఁ గీడుగదా పతి లేడనబడ్డకాంత నేఁ
డీవుగనుంగొనంగఁ బతియేడ్తెరనొప్పఁ బతుల్ విజృంభిత
శ్రీవిలసిల్లు కామినులు సేడ్పడి రిట్లపతిత్వ దీనతన్."

కులకాంతకు జరిగిన యవాచ్యమగు పరిభవ మెట్టి ఘోరపరిణామమును దెచ్చినదియుఁ బాఠకుల కన్నులకుఁ గట్టినట్లు చిత్రించి, తిక్కన లౌకికమగు నీతిని వ్యంగ్యార్థశక్తిచేఁ బోధించియున్నాఁడు. ఇట్టిదే మఱియొక సన్నివేశము సౌప్తికపర్వమునఁ జిత్రితమైనది. నిరాయుధుఁడగు ద్రోణుని శిరోజములఁబట్టి, కంఠము నరకిన ధృష్టద్యుమ్నుఁ, నశ్వత్థామ వధించుట యిట్టిది. భీముఁడు ప్రతిజ్ఞా నిర్వహణార్థము రాక్షసరూపమును బూనెనేకాని రాక్షసుఁడు కాలేదు. రక్తమును బెదవిని చేర్చెనే కాని యాస్వాదింపలేదు. సుక్షత్రియ వీరుఁడగుట సధర్మ యుద్ధమునకుఁ గడంగలేదు. అశ్వత్థామ యట్లుకాదు. దుర్యోధనుని దుఃస్థితిఁగాంచిన యశ్వత్థామ హృదయమునఁ బితృవధ జనితామర్ష మొక్కుమ్మడి ప్రజ్వరిల్లినది. కర్ణదుర్యోధనుల పాప

కృత్యములను నిర్దాక్షిణ్యముగ వారియెదుట నుగ్గడించిన నైతిక స్థైర్యము కలవాఁడు, తండ్రిని మించిన వీరుఁడు, మీదుమిక్కిలి బ్రాహ్మణుఁడు, క్రోధావేశవివశుఁడై, క్రూరరాక్షసుఁడుగఁ బరివర్తన మొందినాఁడు. నిద్రాసక్తమగు పాండవశిబిరముఁ బ్రవేశించి, తానెట్లు ధృష్టద్యుమ్నునిఁ జంపఁ బోవునదియు, ముందుగనే కృప, కృతవర్మలకు వర్ణించి చెప్పినాఁడు.

''ధృష్టద్యుమ్నుని ముట్టిపట్టుదు మదోద్రేకంబడంగింతు న
త్యుత్కృష్టాస్త్రంబులఁ జంప నల్క పశుభంగిం జంపినంగాని పో
దిష్టావాప్తియనంగ నా కిదియె భూయిష్ఠంబు గాం తేయులన్
గష్టస్వైరవిధాభియోగమృతులం గావింతు నుగ్రాకృతిన్.''

'పశువును జంపిన విధమునఁ జంపిననేకాని కోపముపోదు. ఉత్తమాస్త్రములచేఁజంపను' అనుపల్కులవలన నశ్వత్థామ యున్మాదావస్థకు లోనైనదియు వ్యక్తమగుచున్నది. పాన్పున నూఁటడి నిద్రవోవు ధృష్టద్యుమ్నునిఁ దలపట్టికొని, పెడమరలదిగిచి, యబ్బలియుండు,

''నేలపయిం బడందిగిచి నిష్ఠురభంగి నురస్థలంబు మో
కాల నొగిల్చి యేపున మొగం బఱదారుణముష్టినొంచె ని
ద్రాలసవృత్తి నంగములయందుఁ బలంబును బుద్ధినేర్పునుం
జాలని యవ్విరోధివివశత్వముఁ బొందఁగఁజేసె ద్రేల్మిడిన్.''

''కాలను నేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం
బోలుచుఁ బేర్చి యాద్రుపదభూపసుతున్ సమయించె వేదనన్
బోలగ రొజగా బలుమఱుం బొరలంబడి లాలఁ గ్రక్కన
వ్వాలునుగంపు వాక్పరిభవంబుఁ దలంచుచుఁ గ్రౌర్యధుర్యుఁడై.''

ఇట్లు గురువధకారియగు ధృష్టద్యుమ్నునిఁ జంపుటయేకాక,

"నిద్రాసక్తునిఁ గొంతమేల్కనినవానిన్ సుప్రబుద్ధాత్మఁడై
యుద్రేకంబును శౌర్యసారమును బాహుల్లాసముం జూపఁ జం
చద్రేఖం దిరమైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాకి యు
న్నిద్రస్వైరసముద్ధతిన్ మెఱయువానిం దున్మె నేకాకృతిన్."

దుశ్శాసనునివధతో భీముని క్రోధాగ్ని యుపశమించినది. గాని ధృష్టద్యుమ్ను నివధతో నశ్వత్థామయా వేళ యుపశమించినది కాదు. నిద్రాసక్తులై యున్న పాంచాలరాజకుమారుల నందఱ నదయుఁడై వధించినను నతనికిఁ దృప్తి లేదు. ఆతని క్రౌర్యమునకు గజతురఁగాది పశువులు కూడ నాహుతి కావలసివచ్చినది.

"కొన్నిఁటిపాదముల్ నఱకుఁ గొన్నిఁటిమోరలు సెక్కు లీలమైఁ
గొన్నిఁటికంఠముల్ దునుముఁ గొన్నిఁటివీపులు వ్రచ్చు నుబ్బునం
గొన్నిఁటి సర్వగాత్రములు క్రూరవిచేష్టితవిభ్రమంబు దోఁ
ప న్నుఱుమాడుఁ బ్రౌఢబలభాసిత భూరిభుజావిహారుఁడై."

జగంబులుగొని కాలిన కాలాగ్నియుంబోలె పాండవశిబిరంబు నిరవశేషంబుగా సమయించి, చాపాచార్యనందనుండు మే నెఱుటజొత్తిలి మోహాంధ్యంబుతోఁ గలసియునికిం జేసి, సాంద్రతర రక్తసిక్తంబులైన బాహుఖడ్గంబు లేకద్రవ్యంబు చందంబునొంద, మఱలి తాను ప్రవేశించు తఱినెట్లుండె నట్ల నిశ్శబ్దంబైన యవ్వీడిదల వెడలుచుండఁ దెలతెలవేఁగె.

ఇట్లు రాక్షసావేశంబునం జేసి నీచపరాక్రమంబాచరించిన యశ్వత్థామయందుఁ గ్రోధావేశజన్యమగు నున్మాదావస్థను దిక్కన ప్రదర్శించి యున్నాఁడు. ప్రతీకారకాంక్ష, ధర్మాధర్మములు, నుచితానుచితములు, అనువివేచనను నశింపఁజేసి, దయాదాక్షిణ్యములను బోఁగొట్టునను ప్రకృతితత్త్వ మిందుఁ బ్రత్యక్షీకరింపఁబడినది.

రౌద్రబీభత్సముల నింతటి తేలిక మాటలతో, నుత్ప్రేక్షాదుల నేమాత్రమును స్పృశింపక మానవ ప్రకృతికి సహజమగు విధమునఁ బోషించుట కవిబ్రహ్మకే చెల్లినది.

ఒకేవిధమగు సన్నివేశములందు భిన్నవ్యక్తుల ప్రవర్తన, వారి శీలస్వభావాదుల ననుసరించియుండు, నను ప్రకృతి సత్యము, భీమాశ్వత్థామల ప్రవర్తనలయందుఁ జక్కఁగ వ్యక్తపఱచినాఁడు తిక్కన. భీమునకు సందర్భోచితమగు నౌద్ధత్యావేశములతోఁ బాటు ఆత్మనిగ్రహమునుఁ గలదు. ఇట్టి ప్రతీకారావసరము నిరీక్షించు నర్జునుని ప్రవృత్తి తిక్కనచే నెట్లు పోషిత మైనదియు గమనింతము. భీము నవమాన వాక్యములు పల్కిన కర్ణు నుద్దేశించి యర్జునుఁడు,

"ఏమిరకర్ణ భీము నటు లేటికిఁ దిట్టితతండు దోల సి
గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు తిట్టిరి నిన్ను గెల్చు సం
గ్రామములోనఁ దప్పిదముఁ గల్గినయంతన నింతగర్వ మే
లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే."

"గెలుపును నోటమియు ననిఁ
గలుఁగవె యెడ పెట్టి యెట్టి ఘనులకు నిమ్మై
బలుకుదురే తగువారిం
దులువా నీ కులము గుణముఁ దోఁచెం బ్రజకున్."

"ఇంతవట్టును వెలారింతు, నీమాటలు మఱువకుండు మిదియుంగాక నా యసన్నిధి నధర్మంబున నభిమన్యువిల్లు దునిమితివి. దానికి నీవుఁ గనుంగొనుచుండ, ధర్మప్రకారంబున వృషసేను తలఁ దునుముదు," అని ప్రతిజ్ఞఁ గావించి, యట్లే రెండురోజుల యుద్ధమైనపిమ్మట నవకాశము లభింపగా, నతఁడువృషసేనుని జంపినవిధ మతని ప్రశాంతస్థైర్యమును, నాత్మవిశ్వాస నిగ్రహములను వ్యక్తపఱచుచున్నది.

"ప్రభుకుటిస్ఫూర్జిత ఫాలభాగుఁడగుచుం బొంగారి యాసూత పౌ
త్రకు కోదండము బాహుదండములఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్ల విలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళాదుర్దముఁ డన్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్."

కులధర్మమగు క్షాత్రధర్మనిర్వహణము క్షత్రియవీరుని జీవితమున దినచర్యయగుటచే సాధారణముగ నతఁడాత్మనిగ్రహమును గోల్పోఁడు. బ్రాహ్మణునకు క్షాత్రము సహజ సిద్ధమగు స్వభావముగామి, యతఁడావేశమునకు వశుఁడై, మీతిమీరి ప్రవర్తించుననుట యశ్వత్థామయందు వ్యక్తము. అశ్వత్థామ ప్రాణభయమున వర్జితవివేకుఁడై, బ్రహ్మశిరోనామ కాస్త్రముఁ బ్రయోగించి, వ్యాసాదులు ప్రార్థించినను నుపసంహరింపలేక పోవుటయుఁ, బాండవేయ రాగపాత్రగర్భములను విధ్వంసముఁ గావించి తీరుదునని పట్టుపట్టుటయు, నతని యనుచిత క్రౌర్యమును వ్యక్తపఱచుచున్నవి. అట్టి నీచకర్మకుఁ బూనిన యబ్బాలఘాతిని ప్రాణములతో విడిచిపుచ్చుటలో, భీమార్జునుల క్షమాగుణమును వ్యక్తమైనది.

పద్మవ్యూహయుద్ధమునఁ గర్ణాదివీరులెల్లరును నభిమన్యునిచే నోడింపఁబడిన వారయ్యును, మరల మరల వచ్చి సాహసముతోఁ బోరిరే కాని, యధర్మయుద్ధమునకుఁ దామె పూనుకొనలేదు. ఆవేశమునకులోనైన ద్రోణుఁడే యభిమన్యువధకుఁ గారణభూతుఁడైనాఁడు. కనుకనే ధర్మజుఁడు "ఆద్రోహికి నిన్నయు నేఁడును దోడ్పడిన ద్రోణుం దెగటార్పవలయు," నని సంకల్పించినాఁడు. ద్రోణుని దునిమిన ధృష్టద్యుమ్ను నర్జునుఁడు దూరగా ధర్మజుఁ డిచ్చిన ప్రత్యుత్తరము గమనింపఁదగినది.

"ఆసభఁ బాంచాలి గాసిసేయఁగ నుపే
క్షకుఁడయి చూచెఁ బెక్కండ్రఁ గూర్చి

కొని బాలు నభిమన్యుఁ గూల్చి నించుకవడి
యాగిన నర్జునుఁ డగ్నిఁజొచ్చు
నను వగ మనల నాతనికిఁ దోడ్పడఁబోవ
నీ కాగె నమ్మాయి నిట్టి ధర్మ

పరుఁడైన కలశసంభవుతోడ సరివచ్చుటుచితంబె.''

ఇందు ద్రోణుని యధర్మపరత్వమును, ననుచిత క్రౌర్యమును నుగ్గడించి, ధర్మజుఁడు, ''ఇట్టి ధర్మపరుఁడైన కలశసంభవుతోడ సరివచ్చుటుచితంబె'' యని, కాకుస్వరముచే స్వాభిప్రాయమును వెలిబుచ్చియున్నాఁడు.

ఇట్లాయా సన్నివేశ సందర్భములఁ బురస్కరించుకొని భిన్న మానవ మానసిక ప్రకృతులను, లోక సహజమగు విధమునఁ బ్రదర్శించుచుఁ, దిక్కన, ఘోరరణరంగము నొక నాటకరంగముగ మార్చియున్నాఁడు. ఇట్టి నాటకఫక్కి కనుకూలించు సహజసంభాషణాదులు పాత్రలస్వభావములను, హృదయగత భావావేశ, భావశబలతలను, వ్యక్తీకరించుచుఁ దత్తత్సమయోచితములగు కరుణాదిరసములను బోషించుచున్నవి.

భీష్ముని, జంపు నుపాయమును గూర్చి ధర్మజాదులు చింతించు ఘట్టమట్టి విశిష్ట రచనలలో నొకటి.

''అకట తండ్రిసచ్చినంతనుండియు మము
నరసి ప్రోచినట్టి యనుఁగుఁదాతఁ
జంప మదిఁదలంచు తెంపుసూచితె రాజ
ధర్మ మింత క్రూరకర్మమగునె.''

అను ధర్మజునిపల్కు లాతని మానసికాందోళనమును వ్యక్తపఱచుచున్నవి. తన్నుఁ జంపు నుపాయమును దానే తెలిపి తత్ప్రయత్నము

తనయాజ్ఞగా నిర్వర్తింపవలసినదని భీష్ముఁడు పాండవులకుఁ జెప్పి పంపగా, నర్జునుఁడు చింతించినవిధము నతిలలితముగఁ దిక్కన పోషించినాఁడు.

"గురునిఁ గృతప్రజ్ఞుని ధ
ర్మరతు వయోవృద్ధు లోకమాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ
బురుషోత్తమ చంప బుద్ధి పుట్టదు నాకున్."

ఈపద్యమునఁ శబ్దములు నర్థగౌరవమున నొప్పియుండుటయే కాక యొక క్రమమునను సరించి ప్రయుక్తములై యున్నవి. సురతటినీ సుతుఁడగుటవలన దివ్యుఁడగుటయే కాక, పూర్వోక్తములగు విశేషణముల కారణమునఁ బూజనీయుఁడైన భీష్ముని జంపుటకర్జునుఁడు వెనుదీయుట సహజమే. అందును వంచన నుపయోగించుట అర్జునుని ప్రకృతికే విరుద్ధము. అదికాక భీష్మునియందలి గురుత్వ కృతప్రజ్ఞత్వాదిలక్షణము లన్నియు నాతని మహాత్త్వమునకును నర్జునుని సంకోచమునకును, బలవత్తరములగు హేతువులగుచున్నవి. వానిలో బ్రతియొక్కటియు, భీష్ముఁ డవధ్యుఁడనుటకుఁ గారణమగును, కావుననే యర్జునుఁడు,

"నన్నుఁ బాంసుకేలినున్న నర్మిలి యెత్తి
మేనిధూళి తనదు మేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మాతండ్రి గుణము ల
గ్గించి కన్ను నీరు నించు నతఁడు."

"అక్కట తండ్రిలేని మము నమ్మెయిఁ బెంచినతాత నిమ్మెయిం
ద్రెక్కొనఁగా దతండు సముదీర్ణ భుజాబలశౌర్యశాలియై
యిక్కడిసేనఁ జక్కడిచెనేనియుఁ జూతున కాక ధర్మముం
దక్కట కోర్వఁజాలుదునె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే."

అని వాపోయియున్నాఁడు. ఈ రచన యర్జునుని హృదయ మార్ధవముతోఁ బాటతని బంధుభావము, ధర్మపరత్వము, మున్నగుసహజ గుణములను బాఠకులకు హృదయగోచర మొనర్చుచున్నది.

శిఖండిని బురస్కరించుకొని, యర్జునాదులు భీష్మునిపై గవిసినప్పుడు, భావిని సూచించుచు, ద్రోణుని మనస్సనిర్వచనీయమగు కలవరమునకు లోనైనది.

"తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రము దప్పెడుం గడుౕ
వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబుఁగాదు వీ
డ్వడియెడుఁ జెయ్యి లంగము గడంకఁ దొఱంగెడు నేటిభంగి గ
వ్వడి తన పూన్కి దీర్చుట ధ్రువంబని బుద్ధి జనించెఁ బుత్రకా."

అభిమన్యు మరణమునుగూర్చి ధర్మజాదులు విలపించుటకూడ, నిట్టి రసవత్తరములగురచనలలో నొకటి. పద్మవ్యూహమును భేదింపుమని యభిమన్యునిఁబంపిన ధర్మజుఁ డతనిమరణమున కెట్లువిలపించెనో చూడుఁడు.

"కొడుకుఁ బాడఁగాన కర్జునుఁ డడిగెనేని
వానితో నింక నేమనువాఁడ హరికి
నతనిగా రాబు చెలియలి కధిక దుఃఖ
మేన చేసితి వగవంగ నేమి గలదు."

"కుడువను గట్టను బూయను
తొడువను బోఁబనిచిగాక తొలుత మొన సొరం
గొడుకుం బనుచుట కెవ్వఁడు
గడఁగునె నాయట్టి పాపకర్ముఁడు దక్కన్."

"వానితోడిద లోకమై యేనుఁ బోవ
నైతిఁబో గన్న పుత్రశోకాతురత్వ

మున నితాంత వివర్ణతఁ బొందుచుండ
జూడకుండెడివాఁడ నర్జును మొగంబు."

అభిమన్యుని వ్యూహప్రవేశమునకుఁ దాను గారకుఁడగుటచే ధర్మజుని హృదయ మెట్లు క్రుంగిపోవుచుండునదియు నీ పద్యములు సువ్యక్తముఁ జేయుచున్నవి. తమ్ముల కష్టపరంపరలకు, భారత యుద్ధమునకుఁ, దన దప్పిదమే కారణమని యెన్నుఁడై, మనసుననే పరితపించుచున్న ధర్మజుఁ డీ యనర్థముచే నెట్టి యావేదనను బొందుచున్నదియుఁ, దిక్కన తన రచనాదర్పణమునఁ బ్రతిబింబింపఁ జేసినాఁడు.

అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ, దుర్నిమిత్తంబులం గని కృష్ణునితో జెప్పుట, యిట్టి సన్నివేశములలో మఱియొకటి.

"కలయఁగ దుర్నిమిత్తములు గానఁగనయ్యె మదీయ చిత్తమున్
గలఁగెడు మేను బ్రమానుపడఁగాఁ దొడఁగెన్ గురుఁ డారయంగఁ గే
వలుఁడే నృపాలుఁ డేదెసకు వచ్చెనొ,"

"సైనికులు నన్ను గనుగొని
ఆననములువంచి తొలఁగి యరిగెద రదియే
మో నేఁడు వేణువీణా
గాన స్వనములు వీటఁ గలుగవు కృష్ణా."

"ఈ మేలు ప్రజకొనర్చిన
యా మహిమకు నెలవు గొంతి యగ్రతనయుఁడో
భీముఁడొకొ తమ్ముగుఱ్ఱలొ
కో మఱి యెవ్వఱొకొ తలఁపు గొలఁదికి మీఱెన్."

"అలరు మొగముతోడ నభిమన్యుఁ డేలొకో
యెదురురాఁడు నాకు నెట్టివార్త

చెవులు సోఁకు నొక్కొ చేవెట్టి కలఁచిన
భంగిఁ ద్రిప్పికొనఁ దొడంగె మనము."

అను నర్జునుని పల్కులలో కరుణరస మెంతయు స్వాభావికముగు రీతిని బోషితమైయున్నది. ఎట్టి సమయమునను ప్రశాంతతను గోల్పోవని ధీరుఁడు, గంభీర గుణప్రధానుఁడు నగు నర్జునుఁడు పుత్రశోకావేశమునఁ బలవించిన విధమును వర్ణించుటలోఁ, దిక్కన, వాత్సల్యమోహాదులకు లోనైన పితృస్వరూపమును జిత్రించి యున్నాఁడు.

"అక్కట మంద భాగ్యునకు నట్టి తనూభవరత్న మెవ్విధిన్
దక్క విధాతనిర్దయుఁ డొడంబడునే కడుమేలివస్తువుల్
పెక్కు దినంబులుక్క యరిబృందము పిల్చినఁ బోటుబంటనై
యక్కడ కేల పోయితి మహా గుణభూషణుఁ గోలుపోయితిన్."

"పిన్ననగవుతోడ జెన్నుసలారు సౌ
భద్రు మొగము సూడఁ బడయకున్న
వాఁడ నామనంబు వ్రయ్యలై పో దిది
ఱాతఁ జేసినది రాయికో తలంప."

చిఱునగవుతోఁ గూడిన యభిమన్యు ముఖ మర్జునునకు సుభద్రాముఖ సంస్మృతిని గలిగించునను భావము, 'సౌభద్రు మొగము' అను ప్రయోగముచే ధ్వనితము. ఇట్లు, కొడుకును దలంచుకొను కొలఁది తండ్రియావేశమును నధికమైనది. తన కుమారుని రక్షింపలేని ధర్మజభీమాదుల నందఱిని దుఃఖ జనితములగు వాగ్బాణములకు గుఱిఁ జేసినాఁడు.

"మిమ్మును బాంచాలురఁ గడు
నమ్మిచెడితి వాని రక్షణమ్మున బ్రౌఢ
త్వ మ్మెట్లు లేమి యెఱిఁగిన
నెమ్మెయిఁ గాచికొననేరనే యబ్బాలున్,"

"ఉక్కును శస్త్రబలము మీ
కెక్కుడియది సాలరై తిరిందఱు ననిన
య్యొక్కరుఁ గావఁగ మీరీ
తక్కువకోర్చితిరి మిమ్ము దక్కననేలా."

"బలహీనులు సంగరభీ
తులునగు మిమ్మెఱిఁగి యెఱిఁగి తొలఁగి తనూజుం
దలపఁక యొంటి మెలఁగు వెం
గలి నగు నను దూఱుకొందుఁగాక నేమందున్."

"మానినులుపోలె నున్నార లేగ లేని
తెఱి మహాగుణశాలి నాతనయుఁ గాంచి
కొనఁ గడంగర శింగారమునకుఁ గాక
మఱువులును గైదువులు మీకు మానమునకె."

అట్లు భంగించి, యూర్పులు సందడింప, మొగంబు బిగువాఱం, గ్రోధ శోకంబులు మనంబునఁ బెనంగొనం, గన్నీరొలుక నూరకున్న, నెల్ల వారు నతనికి మాఱుపలుకను, దేఱిచూడను వెఱచియుండిరి. లోకమునఁ బుత్రశోకము తండ్రులచే దైవమునే తిట్టించుచుండ, నర్జునుఁడన్నలను నిందించుటలో నాశ్చర్యమేమి. రాగ శోకముల ప్రాబల్యమట్టిది. తదావేశ ప్రాబల్యమునఁ బల్కిన మాటల కర్థమును నుండదు; వాని కెవ్వరును సమాధానమును జెప్పరు. ప్రతివచనమును, ననునయమును, శోకావేశమును వృద్ధిపఱచునే కాని తగ్గింపవనుట లోకసహజమగు విషయము. పుత్రుఁడు లేమి, సుభద్రకు లోకమెల్ల పాడిల్లును బోలె నున్నది. శూరాగ్రేసరుఁడగు నర్జునుఁడు, ధర్మజ భీమ పాంచాళాదులను నిందించిన విధమును, స్త్రీమణియగు సుభద్ర యత్తింటి

వారినిఁ బుట్టినింటివారినిఁ బల్కిన విధమును గమనించినచోఁ, దిక్కన పాత్రల శీలపోషణమునఁ జాటించిన యౌచిత్యము విదితమగును.

"అనిలజు నుక్కు లావు గలఁడందురు సాత్యకి శౌర్యశాలి నాఁ
జను ద్రుపదుండు సంగరవిశారద భావము పూనియుండు మా
త్స్యునిఁ బటువిక్రమాఢ్యుఁడని చూతురు పాండవు లిందఱుండి యొ
క్కనికిఁ గడంగలేర నినుగావఁగ నేమనవేర్తుఁ బుత్రకా."

సుభద్రవాక్యములు వ్యంగ్యార్థస్ఫురణచే నర్జునుని వాక్యముల కంటెను దీక్ష్ణతరములై, భీమాదుల యంతరంగములను దూసికొని పోవుచున్నవి. ఆవేశపూరితములగు నర్జునుని వాక్యములందు నింద వాచ్యముగను, గభీరములగు సుభద్రవాక్యములలో వ్యంగ్యముగను బోషితమైనది. స్త్రీల వాక్కుల స్వభావమే యట్టిది. పుత్రశోకాతుర యైన సుభద్రను గృష్ణుఁ డూరార్చుచు,

"తగుమాటలాడి కోడలి
వగపుడుపుము నీవు ధైర్యవతి వి ట్లడలం
దగునె నిను జూచి కాదే
మగుడుం జిత్తమునవగలు మాకందఱకున్."

అని పల్కినాఁడు. కాని గర్భశోకమున కూఱటయెక్కడ! కావుననే సుభద్ర,

"అకట యుత్తర యొప్పెడునది మనంబు
దీనికెంతయు మెత్తన యేను నిన్ను
వేడికొనియెద వచ్చి యివ్వాలఁది వంతఁ
దీపి తళుకొత్తు పలుకులఁ దేర్పవన్న."

అని కృష్ణునిఁ బ్రార్థించినది.

ఇట్టిదే మఱియొక సన్నివేశము సౌప్తికపర్వమునఁ గలదు. అశ్వత్థామచే నిహతులైన కుమారులఁ గూర్చి విలపించు ద్రౌపదిని దయనీయస్వరూపనుగ జిత్రించినాఁడు తిక్కన—

"పెనుమంచునఁ జెలువేదిన
వనజంబునుఁ బోలె నశ్రువారిపరీతా
ననము చెలువెడలఁ గొడుకులఁ
బనువుచుఁ జరణములు తొట్రువడ దీనగతిన్."

"అలఁత గదిరి నోరెండఁగ
బలవించుచుఁ దోడుతోడ బాష్పజలం బ
గ్గలమై క్రమ్మఁగ సొలయుచుఁ
దెలియుచు నతనికి నడలు దీపింపంగన్."

అమ్మగువ య మ్మహీపతి యాననం బాలోకించి,

"కలిమికి నొప్పుఁగాగ బలగంబయి నీ కడ నా తనూభవుల్
మెలఁగఁగఁ జూడఁ గానన యమేయ భుజాబలశాలి విక్రమో
జ్జ్వలుఁడు సుభద్ర పట్టియును వమ్మయి పోయె ననూన భోగముల్
గలిగిన యేనియున్ మరవఁగా వశమే మన కా కుమారులన్."

మానవజీవితమున కత్యంత సన్నిహితములై, యెల్లర యనుభవమునకు వచ్చు నిట్టి సన్నివేశములఁ బురస్కరించుకొని, మాతా పితృ హృదయ ప్రకృతులను, మానవస్వభావమును, జిత్రించుటలోఁ దిక్కన తన రచనా కౌశలముచే నాయా దృశ్యములు మన కన్నుల యెదుట జరుగుచున్నట్లు గావించియున్నాఁడు.

ఘోరమైన, విరతిలేని, యుద్ధమధ్యమునఁ గూడ నిట్టి మానవ హృదయ వ్యాపారములగు దయా, వాత్సల్య, బంధుభావాదు లందందుఁ బ్రదర్శితములగుటచేఁ దిక్కన యుద్ధరచన సరసమై యొప్పినది.

సైంధవవధార్థ మేకాకియై వ్యూహమును బ్రవేశించిన యర్జునుని క్షేమమునుగూర్చి ధర్మజుఁ డాకులపడుట, యిందుల కొక యుదాహరణము. అర్జునుని దేవదత్తధ్వని వినిపింపక, కృష్ణుని పాంచజన్య రవమొక్కటే వినఁబడుచుండుటవలన,

“మనంబు గలంగ నెలుంగు గుత్తుకం దగుల సాత్యకితో నిట్లనియె.”

“ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కుడయ్యె న
ద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత మ్రోయఁదొడంగె నక్కటా
చిక్కెనొ కౌరవాధములచే నతఁ డీయెడ నీవ యొక్కఁడుం
దక్క నొరుండు దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు లేమి వేడెదన్.”

“ద్వైతవనంబునందు గుణధన్యుఁడు గాండివి నాకుఁ జెప్పె ని
ర్ధూతవిరోధి సత్యకసుతుండు సహాయుఁడుగా జయింతుఁ బ్ర
ఖ్యాతిగ ధార్తరాష్ట్రబలమంతయు నే నని దానికిం దగం
బ్రీతియొనర్పవే నరవరేణ్య రయమ్మునఁ బోయి వానికిన్.”

“అలఘు బలుఁడు శైనేయుఁడు
గలుగఁగఁ బాండవుల గెలువఁగా వచ్చునె వా
రలకతఁడు గోటయంద్రు
రిపులు దానికిఁ దగఁగ నెఱపు భుజగర్వంబున్.”

“హరి గురుఁడు నీకుఁ గ్రీడియు
గురుఁ డిరువుర యెడరు దీర్పఁగోరి గురులకుం
గురుఁడనగు నేన చేసెదఁ
బరమ ప్రార్థనము దీనిఁ బాటింపు తగన్.”

మొదట నర్జునుని క్షేమమును గూర్చి తనకుఁ గలిగిన చింతను దెల్పి పిమ్మట క్రమమున, నర్జునుఁడు సాత్యకికి గురుఁడగుటయు, బంధుసహా

యము పుణ్యాకృతి యగుటయు, నర్జునుండెట్లు సాత్యకి శౌర్య విక్ర మములపై నాధారపడి, కౌరవుల గెల్వ నుత్సహించినదియు, సాత్యకి యనిన శత్రువు లెట్లు భీతిల్లు నదియు నుగ్గడించి, కడపట, గురులగు కృష్ణపార్థుల సంరక్షణార్థమై తప్పక యరుగ వలసిన దని, గురులకుం గురుఁడైన ధర్మరాజు, తానే సాత్యకినిఁ బ్రార్థించినాఁడు. ధర్మజుని చింతనుబాపుట, గురుఁడు, సఖుఁడు, బంధుఁడు నగు నర్జునునకును, నన్నయగు కృష్ణునకును దోడ్పడి, వారి మెప్పును బడయుట, శత్రువులకుఁ దన పరాక్రమమును బ్రదర్శించుట,-యివియన్నియు, సాత్యకిని వ్యూహప్రవేశమునకుఁ బురికొల్పుటలో నొకటికంటె నొకటి ప్రబలతర సాధనము లగుచున్నవి. కనుక నీ ప్రార్థన వాక్యము లెంతయు సమయోచితములై, యర్థస్ఫూర్తితో నొప్పి, ధర్మజుని విశిష్ట లోకజ్ఞానమును వ్యక్తపఱచుచున్నవి. ద్రోణుఁ గడచి వ్యూహమును బ్రవేశించిన సాత్యకిపై నెడతెరపిలేక వీరాధివీరులు వచ్చి పడుచుండుటచే నతఁడు త్వరలో నర్జునునిఁ జేరలేకపోయెను. క్షణము గడచు కొలఁది ధర్మజుని యాందోళన యధికముకాసాగినది. ఇప్పుడతనికి సాత్యకిని గూర్చిన చింతయుఁ బొడమినది. అతఁ డాత్మగతంబున,

"అర్జునుఁ డొంటిపోయెనని యక్కడఁ బుచ్చితి బాహుసార వి
స్ఫూర్జితు సాత్యకిం బెలుచఁ బోవుటయుం గనుఁగొంటి నిద్దఱున్
దుర్జయ శత్రుసైన్యముల దొందడి నేమయిరొక్కొ విక్రమా
వర్జితవైరి భీముఁడును వారికిఁ దోడుగ నేఁగు టెట్లొకో."

"తమ్మునిఁ దలంచి కృష్ణుని
తమ్ముఁ బనిచె నాతనిఁ బదంపడి తన చి
త్తమ్మునఁ దలపడ ధర్మజుఁ
డెమ్మెయివాఁడొక్కొ నారె యీయున్న జనుల్."

"పెక్కుచోటుల నెఱిఁగిన యిక్కులావుఁ
గలుగు నీతనిఁ బనుచుట కలుకనేల
యితఁడు గలయ నయ్యిరువుర కెలమివచ్చు
బనుతు నేనటు శోకంబు వాయవలయు."

అని బహువిధంబుల విచారించి నిశ్చయించినాఁడు. 'తన తమ్మునిఁ దలంచి కృష్ణునితమ్మునిఁ బనిచె' ననుతిక్కన ప్రయోగమెట్టియర్థమును స్ఫురింపఁ జేయుచున్నదియు గమనింపఁదగును. భీమాదులగు తన తమ్ములుండఁగా వారిలో నెవ్వరినైనను బంపక, కృష్ణునితమ్ముఁడగు సాత్యకినిఁబంపి, పిమ్మట, నతనిస్థితి యెట్టిదైయుండునో యను చింత లేక, నిశ్చలుఁడైయున్న ధర్మజుఁ డెంతటిగడుసువాఁడో యనిసైన్యములోని వారనుకొనవచ్చును. ఈయూహాయే ధర్మజునకు విచారహేతువైనది. అతని శీలమునందలిముఖ్య లక్షణమగులోకాపవాదభీతి నింతసరళముగఁ దిక్కన వెలువఱచినాఁడు. భీమునిఁ బంప నిశ్చయించిన ధర్మజుఁడు పల్కిన పలుకులలో, నాతని భ్రాతృభావమును, సహజమగు హృదయమార్దవమును, వ్యక్తమగుచున్నవి.

"భీముఁ జేరనరిగి బీభత్సు నీతమ్మ
నని యెలుంగు గళమునందుఁ దగుల
నశ్రులొలుక మాట యట సెప్పలేఁడతఁ
డార్తిసూచి యిట్టులనియె నతఁడు."

ఇందుఁదిక్కన. ముందు 'బీభత్సు' అని, వెంటనే 'నీతమ్మ' నని ధర్మజునిచేఁ బలికించియుండుట గమనింపఁదగినది. అర్జునుని విషయమునఁదనకుఁ గలిగిన కలఁత భీమునకును గలుగఁజేసి, యతని నందుఁ బంపుట ధర్మజునుద్దేశము. కనుకనే ముందు బీభత్సుఁడని పేరు నుచ్చరించి, వెంటనే 'నీతమ్ముఁ' డని పల్కి భీముని భ్రాతృవాత్సల్యమునకు గుఱిచేసినాఁడు.

"నీతమ్ముఁగుఱ్ఱ చూపసి
నీతివిదుఁడు సకలగుణనిధి మద్భక్తుం
డాతని కెడరగునో యను
చేతోగతి పల్లటిల్లఁజేయదె తాల్మిన్."

"నీవువోయి పార్థునిఁగని సింహనాదమున రోదసినింపుము, మాకు నింపుగఁ," అని అర్జునుని గుణగణాదులను స్మరణకుఁదెచ్చి, భీమునిఁ బ్రోత్సహించు టీసందర్భమున కింతయు నుచిత మగుచున్నది.

భీష్ముఁడు తొమ్మిదిదినము లుద్దండుఁడై విజృభించి పాండవానీకమును మును సమయించి యర్జునాదుల నొంపఁగా, ధర్మజుఁడు కృష్ణునిఁ జేర నరిగి పలికిన పల్కులు నిట్లే యతని స్వభావమును సూచించుచున్నవి.

"తార్చిచ్చు గలిసి మృగతతి
నేర్చుకరణి నేఁడు భీష్ముఁడేచినకడిమిం
బేర్చి మనసేనఁబొదివె శ
రార్చుల నీవీరుఁ గన్నులారం గంటే."

"మున్నను నేఁ గారణముగ
నన్నియిడుము లనుభవించి రనుజులు వీరిం
గన్నారఁ జూతుఁగాని జ
గన్నుత భీష్మునకుఁ గోలుగా నీఁజాలన్."

తాను జూదమాడి తమ్ములను బలుకష్టములకు గుఱిచేసినాఁడఁగదా, యని ధర్మజుని హృదయ మిదివఱకే యెఱియుచున్నది తనయందంత బద్ధానురాగులగు తమ్ములు నొచ్చుట సహింపఁజాలఁడు వారిని రక్షించుకొని, కన్నారఁజూచుచు, సంతోషింతునుగాని, భీష్మునకు బలిగానీజాలనను నతనిపల్కు లతని యంతరంగము నిట్లు ప్రదర్శించుచున్నవి.

ఇట్లు యుద్ధమధ్యమునఁ గర్ణునిచేనొచ్చి, శిబిరమును బ్రవేశించిన యుధిష్ఠిరుని సేమమరయుటకై కృష్ణార్జునులుపోవ, వారినిగూర్చి భీముని హృదయ మెట్టి తహతహనొందినదియుఁ, దిక్కన వర్ణించి యున్నాఁడు.

"అంబరంబునడుమఁ దేజరిల్లు రవిఁబోలి, యనిలసుతుండు దీప్తి శిఖంబులు పర్వఁగ నేచి, కౌరవసైన్యమును దఱిమి, యప్పుడు పార్థునిఁదలంచి, సారథితో,

"నరుఁ డన్నవర్తనము తెలుఁ
గరయుటకై మందిఁగలంగ నటచనినాఁడ
న్నరపతి దుర్దశఁ గని దు
స్తరశోకం బడరి తాను దదవస్థుఁడగుఁ."

"అయ్యిరువురకు నొకటియైనట్టిదైన
మనము కౌరవసంఘంబు గ్రమ్మఁజేసి
గెలుపుఁ గొంటిమేనియు ఫలము దాన
నేమి గలదనువగఁ జిత్త మెఱియఁజొచ్చె."

అని పల్కినాఁడు. కొంతసేపటిలో నర్జునుని రథమును గుర్తించి సారథి యతనితో,

"హరి మేనికాంతియును నరు
కిరీట రత్నాంశువులును గిరిగొన రథర
థ్యరుచులు బెరసి విచిత్ర
స్ఫురణమ్మునఁ దేజరిల్లెఁ జూడు కుమారా."

అనిన విని యంతరంగంబు సంతోషమయంబుగా నంగంబు పొంగ మనశ్శాంతినిఁ బొందినాఁడు భీముఁడు. ఇట్లు మధ్యాహ్నమార్తాండు నివలెఁ బ్రచండుఁడై శత్రుతాప మొనరించుచున్న భీముఁడు భ్రాతృ

వాత్సల్యమున, నొక్కత్రుటిలో నమృతకిరణుఁడుగఁ బరివర్తన మొందినట్లు, తిక్కన వర్ణించియున్నాఁడు.

ద్రోణునివధ విషయమై యర్జునుఁడు ధర్మజు నాక్షేపించుచు,

"మన సేనల నొక్కత్తునఁ
గొనఁదలఁచి కడంగివచ్చు గురుపుత్త్రుని మా
రొక్కన ధృష్టద్యుమ్నునిఁ గా
వను శక్యమె నీకు నిచటి వారికి నధిపా."

యనినం గోపించి, యనిలనందనుండా సంక్రందననందనున కిట్లనియె.

"అడవులనుండు తాపసుల యట్టులు వల్కెదు రాజనీతి యి
ట్లొడఁబడి చేయవచ్చి వధకొల్లమి యొప్పున ధర్మనిష్ఠయె
క్కడఁగల దాసభన్ ద్రుపదకన్యక పాటున కిట్టివెన్నియుం
గడుకొని చేసినన్ మనలఁ గల్మష మొందఁగ నేర దర్జునా."

"అరులు మనమీఁద నురవడి నరుఁగు దేర
మేము సిడిముడి పడుచుండ నిట్టులనుట
యొప్ప దురిసినపుండుల నుప్పువెట్ట
దరయ దీనికి నిన్ను నేమందుఁ బార్థ."

కురువీరు లెఱుఁగుదురు నను
గురువీరుల తెఱఁగు నేను గొంత యెఱుఁగుదుఁ
శరపరిఘ ప్రహరణములఁ
బొరిఁగొనియెదఁ గాక వారిఁ బోనిచ్చెదనే."

కర్తవ్యనిరూఢుఁడగు భీముని పల్కులెంతయు సమయోచితములై యతని శీల స్వభావములకు ద్యోతకములగుచున్నవి. అశ్వత్థామ

ప్రయుక్తమైన నారాయణాశాస్త్రమునకుఁ బ్రతిక్రియగా నర్జునాదు లందఱును శస్త్రాదులను వదలి, రథములనుండి దిగఁగా, సమీరనంద నుండు సైనికులతో,

"డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమిఁ గోలుపోవ మీ
రు గడఁకఁదక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధముల్ మహాస్త్ర
శక్తి గెలుతు గోత్రభిత్కులిశతీవ్రశరంబుల వైభవంబు భూ
రి గదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగ౯."

"అని బరవసంబుసేసి, శంఖంబొత్తి, మల్లచఱచి, సింహనాదంబు సెలంగ నశ్వత్థామను మార్కొనుటయు," నశ్వత్థామ యమ్మహా స్త్రంబు దీపింపంజేసిన, నది పేర్చి, కార్చిచ్చు వోదవుచందంబున సమీరనందనుం జుట్టుముట్టె. అప్పుడు కృష్ణార్జునులు తేరు డిగ్గి, రిత్త చేతులం బారి, యాభీముని నిరాయుధుంజేసి, రథంబు డిగ్గఁద్రోయ నారాయణాస్త్రంబు ప్రశాంతిఁబొందె. ఇందు భీముని సహజౌద్ధత్య సాహసాదులు, ప్రదర్శితములైనవి. ఇట్లు వివిధ సన్నివేశములయందుఁ బ్రదర్శితములగు విలక్షణ మానవ స్వభావములను రసవత్తరముగఁ దిక్కన చిత్రించియున్నాఁడు.

ఇట్లే యుద్ధవృత్తాంతమును సంజయుఁడు దెల్పఁగా వినుచున్న ధృత రాష్ట్రునియందుఁ గలుగు భావోద్వేగాదులు, నతని స్వభావము, నతని పలుకులవలన వ్యక్తమగుచున్నవి.

సాత్యకి వీరాటోపమున కాగ లేక దుర్యోధనాదు లెల్లరును బాఱిరని సంజయుఁడు చెప్పగా, ధృతరాష్ట్రుఁడు,

"పులికిఁ బసులు వాఱిన క్రియ
నలవుఁ జలము సిగ్గు విడిచి యట్లొక్కని కో
ల్తల కోర్వక విరిగిన
పుత్రుల నేమని విందు నేను రోయక యింక౯."

అని తనకుమారుల యశక్తతను గర్హించినాడు. భీముడు ద్రోణాది రథికుల నతిక్రమించి, వ్యూహమ్ముం బ్రవేశించి, యర్జునుం జేర నరిగె నని విని,

"ఇట్లు సింహనాదమిచ్చిన భీముని
మార్కొనంగ మగఁడు మనబలమున
గలిగెనే మదాత్మజులఁ గాల్పఁబుట్టిన
చిచ్చు వాఁడు వానిఁ జెనయుటరిది."

అని వాపోయినాఁడు. కౌరవుల పాలిఁటి యముఁడైన భీముని మార్కొనువాఁడు తనబలమున లేఁడే యని యతని దుఃఖము. కర్ణునిచేఁ బ్రయుక్తమైనశక్తి ఘటోత్కచునిఁ జంపెనని విని ధృతరాష్ట్రుఁడు,

"ఒకనినిఁజంపి యిట్లు సను నుజ్జ్వలశక్తి నెఱింగి కర్ణుఁడే
టికి నరుమీఁద దాని నిగిడింపక యిన్ని దినంబు లప్రయో
జకముగఁ జేసెఁ గయ్యము భుజాబలశాలి నరుండు వడ్డఁ బో
రికి మఱి యుత్సహింపఁగలరే పెరవారలు సూతనందనా."

అని సంజయునితోఁ బల్కినాఁడు, కర్ణుఁడర్జునునిపై నాశక్తినిఁ బ్రయోగింపలేదే, ప్రయోగించియుండినఁ, బాండవుల పీడ తమకు లేకుండెడిదే, యను ధృతరాష్ట్రునివాక్కు లతనికిఁ బాండవులయెడఁగల యభిప్రాయమును వెలిబుచ్చుచున్నవి. అంతమాత్రమే కాక, మఱియు నతఁడు,

"పిలిచికొనిపైనఁ బార్థుం
బొలియింపఁడ శక్తి నతఁడు పోరికి నెవ్వా
రలు రమ్మన్నను వ్రతమయి
తలకొనిచను గర్ణుఁడేల తప్పం జేసెన్."

అని కర్ణుని బుద్ధిహీనతకు వాపోయినాఁడు. ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచి కొనిపైనఁ గర్ణుఁడర్జునునిపై శక్తినిఁ బ్రయోగింపకపోయె నని చింతిం

మాట ధృతరాష్ట్రుని మోహాంధ్యమును ప్రకటించుచున్నది. దైవముపై విశ్వాసయును, విధివిలాస మవిలంఘ్య మనుజ్ఞానమును, నున్న వాఁడెవ్వఁడును నిట్లుఁ గతము తన కనుకూలింపలేదే యని దుఃఖింపఁడు. ధృతరాష్ట్రుని యశక్తదుర్జనత్వమున కీవాక్యము ప్రబల నిదర్శనము.

కర్ణుని ద్వితీయదివస యుద్ధమును గూర్చి వినుచు, ధృతరాష్ట్రుఁ డిట్లు పలికినాఁడు.

"పాండునృపసుతులలో నొ
క్కండైనను నొవ్వఁ డింతకును మును వనితా
మండలి చేరువ మెలఁగెడు
గండున మెఱసెదరు కురునికాయము నడుమన్."

ఇట్లు, శల్యదుర్యోధనాదుల చావు వినినప్పుడుకూడ,

"చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు చెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరములై చే
తోవృత్తి దహింపఁజొచ్చె దుర్భరభంగిన్."

అని ధృతరాష్ట్రుఁడు వాపోయినాఁడు. ఈ పల్కులవలన విషపూరితమగు నాతనిహృదయమును, లోక సహజమగు దుర్జన స్వభావమును విశదమగుచున్నవి. తన కుమారులతోఁ బాటు, పాండవులందరు కాకపోయినను, నొకఁడైనను గూలియుండిన నీయంధునకుఁ గొంత మనశ్శాంతి కల్గెడిది. అట్లు కాకపోగా, వారి కేమాత్రము నొప్పియుఁ గలుగలేదను సంజయుని వాక్యములు, ధృతరాష్ట్రుని హృదయమును దుఃసహముగునట్లు దహించినవి. తమలోఁ బాటి ఇతరులును గష్టపడుచున్నచో నూఱటనందుట, దుర్జన స్వభావము. తమకుఁ గీడు సంభవించినప్పుడు పరులకుఁ గీడు కలుగలేదే యని దుష్టులీర్ష్యాపరులగుట లోక సహజ

మగు విషయము. ఈర్ష్యాపరుఁడు, నశక్తదుర్జనుఁడు, నగు ధృతరాష్ట్రుని స్వభావ మీమాటలలో సువ్యక్తమైనది. ఇంతలో నతనిని పుత్రదుఃఖము ముంచివేయఁగా,

"కొడుక తమ్ములుతోడ్పడఁ గలిగి శత్రు
వరుల గెలిచెదనంటి వొక్కరుఁడుఁ దక్క
కుండ నీతమ్ముఁగుఱ్ఱల నూచముట్టు
గొనియెనే విధి యేగతిఁ జనుదుఁ జెపుమ."

"కదిసి పవనజుఁడు బెట్టుగ
గద వ్రేసిన తొడలు విఱిగి కయ్యపు నేలన్
మదమఱి పడినప్పుడు నీ
మది నేమని తలచితో కుమార యెఱుంగఁ."

అని, యతిదీనముగఁ బలవించినాఁడు. సుజనుఁడైనను, దుర్జనుఁడైనను, మానవునకు రాగ మోహాదులును, బంధుభావ వాత్సల్యాదులును, సమానములగుట ప్రకృతిసిద్ధమగు విషయము.

కర్ణుని చావును గూర్చి విలపించుచు, ధృతరాష్ట్రుఁడిట్లు,

"అలలోని యాఁబోతును బోలె నొప్పుఁ
గురుబలంబులో నున్మదద్విరదమూర్తి
సింహసంహననుండు నిస్సీమవిక్ర
మాభిరాముండు వోయెనే యక్కటకట."

అని వాపోవుచుఁ గర్ణునకుదాత్తమగు గౌరవము నొసంగినాఁడు. 'ఉన్మదద్విరదమూర్తి' 'సింహసంహననుండు' 'నిస్సీమవిక్రమాభిరాముఁడు' అను విశేషణములు, కర్ణునిపై ధృతరాష్ట్రుడెంత యధారపడియుండిరో వ్యక్తముఁ జేయుచున్నవి. ఉన్మద ద్విరదమూర్తివలె

నొప్పు వృషభముచే నాలమందకుఁ గలుగుశోభయు, రక్షణయు, సుప మేయమునందు గమ్యమానములగుచున్నవి. అదియునుంగాక, యివి, యుత్తరోత్తరోత్కర్షములై కర్ణునియందు వారికున్న యభిమాన విశ్వాసములను వ్యక్తముఁజేయుచున్నవి. తన్మూలమునఁ, గర్ణుని వధచేఁ గౌరవసైన్యము కాంతి రహితము, రక్షణశూన్యము నైనది యనునర్థము ప్రస్ఫుట మగుచున్నది. ఈవిషయమునే సంజయుఁడు,

"బలితపువెస నాఖోతుం
బులిగొనినం బసులు వాఱుపోలికి గ్రోధో
జ్జ్వలుఁడగు పార్థుఁడు గర్ణునిఁ
బొలియించిన నీదుసైన్యములు వెఱఁ బఱచెన్."

అనిధృతరాష్ట్రునకుఁ దెల్పినాఁడు. కర్ణునియుద్ధమునువర్ణించుటకుఁబూర్వ మతనిఁగూర్చి ప్రయోగించిన యుపమానము నేమఱక తిక్కన తద్యుద్ధ వర్ణనానంతరమునఁగూడ నిట్లు ప్రయోగించి, పూర్వాపరవర్ణనములకు సమన్వయముం గూర్చియుండుట గమనింప వలసిన విషయము.

ఇట్లు తిక్కన, సన్నివేశాదులం బురస్కరించుకొని, మానవ స్వభావ వైవిధ్య వైలక్షణ్యములను, లోక స్వభావానుగుణముగ, నాకర్షణీయమగు విధమునఁ జిత్రించి, తన యుద్ధపర్వరచనను బాఠక జీవితసన్నిహితముం గావించియున్నాఁడు.

నాయక ప్రతినాయకులగు ధర్మజ దుర్యోధనుల శీల స్వభావాదులను బ్రదర్శించు వీరరస ప్రధానమగు భీమదుర్యోధనుల గదాయుద్ధ, మిట్టి యుదాత్త రచనతోఁ గూడిన ఘట్టమై యొప్పుచున్నది. విజయపరం పరల కారణమున నమితోత్సాహియై, సోదర బంధు పరివృతుఁడై యున్న ధర్మజుని యొక్కయు, బంధుమిత్రాదుల నెల్లఱఁ జంపికొని,

యపజయము వెన్నాడుచుండ నేకాకియై, నిరుత్సాహియై, ద్వైపాయన హ్రదమున డాగిన దుర్యోధనునియొక్కయు, మానసిక స్థితిగతులను దిక్కన యిందు జక్కగఁ జిత్రించియున్నాఁడు.

జల స్తంభన విద్యచే మడుగున డాగియున్న దుర్యోధనునిఁ బాండవులు పోటుమాటలచే నొప్పించి, రోషముఁ దెప్పించుచుండ, నతఁడు దీనుఁడై,

"ఏనింక సమరమొల్ల మ
హీనాయక నీక యుర్వినిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరి
ధానుఁడనై తపమొనర్చెదను మునుల కడన్."

"ఓడివచ్చినాఁడ నుద్ధతి నాకేల
యుదుకు మాని నీవ యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁగులు లేని బయలు నీ
తలనె కట్టికొనుము ధర్మతనయ."

అని నైరాశ్యమును బ్రకటించినునాఁడు. ఈవాక్యము లిప్పటి యతని దిక్కుమాలిన దీనావస్థ కెంతయు నుచితములై యున్నవి. కాని "ధర్మతనయుండును, దమ్ములుఁ, గొడుకులు, ద్రుపదపుత్రులుఁ బొమవుకొని పలుకు పలుకులకు జిత్తంబు త్తలపడ, నాననంబు పల్లటిల్ల, రంగబులు విదిర్చి, దురంబొనర్చువాఁడై, యప్పాండవాగ్రజునకు నతఁ డిట్లనియె."

"మీరేవురును బరివార బాంధవ మిత్ర
సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిబృందనతురఁగసమేతుల
శేనొకరుండ విహీనసహాచ

రత్వంబు విగతాయుధత్వంబు వాహన
హీనత నొందితి నేవిధమున
ననిరయోనర్పఁగవచ్చు నదిగాక పోటుల
డస్సితిఁ గడు మీకు డప్పిలేదు
వరుసఁ దగ నొక్కఁడొక్కఁడ వచ్చి పోరుఁ
డిపుడ వెడలి మిమ్ముందఱ నెల్ల చెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ జుట్టుముట్టి
పలువు రొక్కనితోఁ బోరఁ బాడియగునె!”

జీవితమున నతిక్రమింపఁజాలని విషమదశ ప్రాప్తించినపుడు మానవునకు న్యాయాన్యాయ, ధర్మాధర్మ వివక్ష కలుగుట సహజము. తాను బలవంతుఁడై యున్నంతవఱకు న్యాయమునుగూర్చిన యాలోచనయే పొడమదు. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధమున, నర్జునునిపైఁ దాఁ బ్రయోగించిన సర్పముఖ శరం బాభంగి నిష్ఫలప్రయత్నంబగుటయును, దన మనంబున నొవ్వడరి యక్కర్ణుండు గరంబుల విదిర్చుచు,

“ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తులగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకుఁగావించె నతులధర్మ
శీలుఁడగు నన్ను ధర్మువుసెలవు లేద.”

అని ధర్మంబును దూఱియున్నాఁడు. అంతియకాక, రథచక్రంబు క్రుంగినపు డతఁ డర్జును నుద్దేశించి,

“అరదంబు చక్రంబు ధరఁ జాలఁగ్రుంగిన
నెత్తెద నంతకు నేయకుండు”

అని ప్రార్థించియు,

ఏను భూమిస్థుఁడ నీవు రథస్థుండ
వీయెడఁ దగవగు నేయకునికి
విరిదలవానిని విరథుని నాయుధం
బిడినవానిని శూరు లేయ రెందు
మహిని శూరుఁడవనుమాత్రగా దుత్తమ
కులుఁడువు రణ ధర్మకోవిదుండ
విట్టి నీవు తగినయట్టి భంగిన యని
సేయవలయు."

ననుచు రణధర్మములను గూడ ప్రస్తావించియున్నాఁడు. లక్షాగృహ దాహ, ద్రౌపదీపరిభవ, అభిమన్యువధాది సందర్భములలో నీధర్మ చింత కర్ణున కేల కల్గినది కాదని, యపుడు శ్రీకృష్ణుఁడే తగినట్లు ప్రశ్నించినాఁడు.

అట్లే అభిమన్యువధ సమయమున దుర్యోధనుని స్థితి వేరు, నిప్పటిస్థితి వేరు. కావుననే యప్పుడు తలంపునకు రాని యుద్ధధర్మములు, దయా దాక్షిణ్యములు, నతని కిప్పుడు స్ఫురించుచున్నవి. ఇది మానవ ప్రకృతికి సహజమగు విషయము. ఇతనికిధర్మజుఁడిచ్చిన ప్రత్యుత్తరముఁజూతము.

"వలసిన వస్త్రశస్త్రములు వాహనముంగొను మొక్కరుండ నిన్
గలన జయించువాఁడతనిగర్వము నీవడఁగించితేని యీ
యిల సకలంబుఁ గైకొని వహింపుము రాజ్యవిభూతి వాడు నిం
దలపడిపోరు జుట్టలును దక్కటివారలు నిల్చి చూడగన్."

విజయ ముత్సాహకారి. "ఉత్సాహము సగము బలము." అను నానుడి ఇందుఁజక్కఁగ ననువర్తించుచున్నది. ఇట్టి ప్రతివచనము నకు విజయ లాభమున సుప్పొంగియున్న ధర్మజుని యత్యుత్సాహమే హేతువు. ఉత్సాహపరున కాత్మవిశ్వాస, బలగర్వములు ద్విగుణమగు

టయు సహజమే. కావుననే ధర్మజుఁ డొక్కని జయించి, రాజ్యముఁ గైకొనుమనుటకు సాహసించినాఁడు. అంతమాత్రమే కాక, దుర్యోధనుఁడు గదాయుద్ధముఁ గోరఁగా,

"పొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నే
గొనియెద నీదు ప్రాణము లకుంఠిత బాహువిలాసభాసినై
యనవుడుఁ బుట్టలోపలి మహాభుజగేంద్రుఁడు రోజనట్లు రో
జె నధిప యవ్విభుండు దనచిత్తము నప్పలుకుల్ గలంచినన్."

భీముఁడే గదాయుద్ధమునఁ దనకుఁ జాలఁడను నాత్మాభిమానముతో నున్న దుర్యోధనున కీ ధర్మరాజు వాక్యములు సహింపరానివైనవి. కనుకనే రోషావేశముచేఁ, బుట్టలోపలి మహానాగము బుసగొట్టినట్లు, మడుగులో నున్న దుర్యోధనుఁడు మహాభిమానమున నుత్కటముగ నిశ్వసించినాఁడు. దెబ్బఁదిని. ప్రతీకారావకాశము లేని స్థితియందున్న సామాన్య సర్పములే, రోషాభిమానముల కారణమున నుద్రేకముం జెంది. పడగలనువిప్పి, నేలనుగొట్టి, బుసగొట్టుట లోకమునఁ గాననగువిషయము. అట్టియెడ 'మహాభుజగేంద్రుఁ' డెట్లుప్రవర్తించునో యూహించు కొనవచ్చును. ఇప్పటిదుర్యోధనుని యవస్థ కీయుపమాన మెంతయు సముచిత మగుచున్నది.

విజయ మూలకమగు నత్యుత్సాహమునకు లోనై ధర్మజుఁడు స్వపరబల తారతమ్యమెఱుఁగక యుక్తాయుక్తములు గణింపక, పలికినాఁడు. మానవ స్వభావమే యట్టిది. ఈమాటలువిని రోషావేశమున మడుగువెడలి సంరంభ విజృంభితుండై వచ్చు దుర్యోధనునిఁ జూచి,

"చిఱుతనగవుతో నొండొరు చేతులప్పళించి నిర్భర సంతోషలీల నొప్పి

రమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడమఁ గెంపు."

కోపావేశంబునొంది, యుద్వృత్త తారకంబులవారలనెల్ల నాలోకించి,

"ఈగలి వేలార్చెద బా
హాగర్వముమెఱయ మిమ్ము నందఱను మహీ
భాగమున గూల్చి నెఱపెద
నాగదబలు పెట్టులైన నగుఁ డందాకన్."

"అనుచుఁ బోటులఁ దొరుగు రక్తంబుధార
లంగమెల్లను గప్పిన నప్పుడొప్పెఁ
గావి సెలయేఱు లెల్లెడఁ గలయఁబర్వఁ
బొలుచు కులపర్వతంబు చాడ్పున నతండు."

పాండవాదులెల్లరు నొక్కపెట్టఁదన్నుం బొదువుదురని శంకించుచున్న దుర్యోధనునితో, ధర్మరాజు,

"ఏరికొను మీవు నొకని మా యేవురందు
వాఁడు నీతోడఁ దగఁ బోరువాఁడు వానిఁ
జంపి మహియేలు వానిచేఁ జచ్చి త్రిదివ
సౌఖ్యమొందుము చేసితి సమయమేను."

అని పలికి యుజ్జ్వలవివిధవర్మంబు లాతని ముందటఁ బెట్టించి,

"విను జీవముతో నిన్నుం
జననిచ్చుట యొందు దక్క సమరంబున గో
రినయది నీకొసఁగెద నిం
తన చెడియెనె యకట యన్నదమ్ముల కూర్మిల్."

అని యుదారముగఁ బల్కినాఁడు. ధర్మజుని యీ ప్రవర్తన యతని హృదయవైశాల్యమును, ధర్మబుద్ధిని, దాక్షిణ్యభావమును, ప్రదర్శించుచుండుట నిజమే. కాని వానితో నతని స్వభావసిద్ధమగు నొక లోపముకూడ వెలువడినది. దానిని గుర్తించియే,

"ఇతఁడు గదారణంబునకు నీకొలఁది న్నినుబిల్చినన్ మఱు
త్సుతునుతుఁ గోరినన్ జిఱుతతమ్ములలో నొకని న్వరించినన్
మతిచెడిరొక్క వీర లను మాటకుఁ బాత్రముకాదె సాహసం
బు తతియె మేదినీశ యిది బుద్ధిదొలంగి తనుగ్రహంబునన్."

"ఒకరునిఁ జంపితేని సకలోర్వియుఁ గైకొను మంట నీవు మున్
శకునికి మాయజూదమున సంపదలెల్లఁ బ్రదయోదకాబ్దభో
గ్యకృతి నమర్చి యొడ్డినటులైనది పందెపుఁగయ్యమయ్యె క
ట్రుకులమునెల్ల దుఃఖపడి త్రుంచుట కాఁదుదిఁ బందెమాడనే."

అనికృష్ణుఁడు ధర్మజునిఁ గఠినముగ విమర్శింపవలసి వచ్చినది. అతితో త్సాహపరవశుడై యేమాత్రమును యోచింపక పందెములు చరచుటయు, శపథములు పల్కుటయుఁ, గొందఱి స్వభావము. అది యనర్థదాయకమనుట లోక విదితము. పందెములు ప్రధానముగా గల ద్యూతమునందు ధర్మజునకుఁగలయాసక్తికిని, నీలోపలేశమే కారణము. ఈ భారతయుద్ధమునకంతకును, నదియే మూల హేతువైనది. తన యొక్కయుఁ, దమ్ములయొక్కయు, శక్తిసామర్థ్యముల యందును, జయసిద్ధియందును, ధర్మజునకు సంపూర్ణ విశ్వాసముండుటచే, నతఁడట్టి సమయమును జేసెనని సమర్థించుటకును వీలులేదు. కావుననే కృష్ణుఁడు,

నరవర యొక్కటొక్కటి పెనంగగ భీమునినైనఁ బన్నఁగా
దరఁయుగ భీముకంటె గదయందలి కౌశలమెక్కుడీ మహీ

క్రూరునకు భీమమైన బలసంపద మిక్కిలి దానఁ బోవునే
వెరవునఁ గోలుపోద భుజవీర్యము పోరుల నెందుఁ జూడమే.'

అని ధర్మజుఁడొనర్చిన యనుచితమెట్టిదో వివరించినాఁడు. కృష్ణుని యీ మాటలయందలి యాథార్థ్యము, గదాయుద్ధసందర్భమున విదితము కూడ నైనది. ప్రస్తుత విషమస్థితినుండి పాండవులను దప్పించుటకై కృష్ణుఁడు గావించిన ప్రయత్న మతని మానవ స్వభావ పరిజ్ఞానమునకు సాక్ష్యమగుచున్నది. దుర్యోధనుఁడు వినుచుండ, భీముని బలశౌర్యాదులను, నతఁడు హిడింబాదులను జంపుటను, ప్రశంసించి భీమున కుత్సాహముఁ గల్పించినాఁడు. అంతియకాక, భీముఁడొనర్చిన దుశ్శాసన వధను ప్రత్యక్షమగు రీతిని వర్ణించి, దుర్యోధనుని హృదయమును బ్రజ్వలింపఁజేసినాఁడు. ద్రౌపది కవమాన మొనర్చిన యిరువురిలో నొక్కనిఁ జంపి ప్రతినఁదీర్చికొంటివి; మిగిలినదాని నిప్పుడు తీర్పుమని భీమునిఁ బురికొల్పుచు. దుర్యోధనునకు భీమునిపైఁ గ్రోధావేశ మగ్గలమగునట్లు చేయుట, కృష్ణుని పన్నాగము. ఇట్లు తనవాక్యములచే నొకవంక, భీమున కుత్సాహముఁ గూర్చుటయు, మఱొకవంక, ధర్మజుఁడొనర్చిన యయుక్తకార్యమును దిద్దుటయుఁ, గృష్ణుని కర్తవ్యములైనవి. అదృష్టవశమున దుర్యోధనుఁడు గదాయుద్ధమునకు భీమునే కోరుకొనెను. కృష్ణుని ప్రయత్నము సిద్ధించినది.

ధర్మజుఁడు సంస్కృతినందిన మానవశ్రేష్ఠుఁడనుట నిక్కము. కాని మానవ స్వభావాతీతుఁడగు దివ్యపురుషుఁడు మాత్రము కాఁడు. కావుననే మనకు సన్నిహితుఁడగుచున్నాఁడు. వాల్మీకి శ్రీరాముని బురుషోత్తమునిగఁ జిత్రించి, యతని జీవితమును మానవజీవితముతో ననుసంధింపఁజేసియుండుటవల్లనే రామాయణరచన జనరంజకమైయున్నది. అట్లే వ్యాసుఁడును, ధర్మజాదుల నింద్రియవ్యాపారములతోఁ గూడిన

మానవులుగఁ జిత్రించి, భారతపాత్రలను లోక జీవితముతో నను సంధింపఁ జేసినాఁడు.

కావ్యములలో నాదర్శమునకై యుత్తమవ్యక్తులనే ప్రధానపాత్రలుగా జేసినను, వారిలోపములను, వానివలన వారుపొందెడి యనర్థములను, సువిదితమగునట్లు చిత్రించుట లోకసంస్కరణమున కొక మార్గము. ఆ విధానము ననుసరించియే నాయకుఁడగు ధర్మజుని యుత్తమగుణములతోఁ బాటు టతని లోపములను గూడ బహిర్గతములుగావించి, వానివలని యనర్థములను కవిసువ్యక్తముగావించియున్నాఁడు. కర్ణునిచే పరాభూతుఁడై నొచ్చి శిబిరముం జేరిన ధర్మజుని సేమ మరయుటకై, కృష్ణార్జును లచటికిఁ బోగాఁ గర్ణుఁ డింకను బ్రతికియున్నాఁడని విని ధర్మరా జర్జునుని నిందించుట యట్టి సన్నివేశములలో నొకటి.

"విను కర్ణున కే నోడితి
ననసేటికి నీవునోడి తనిలజ మాద్రీ
తనయులు మున్నే యోడిరి
మనతోఁ గూడంగఁ గంసమర్దియు నోడెన్."

అని ధర్మరాజపుడు కిరీటినుద్దేశించి యతితీక్ష్ణముగఁ బల్కినాఁడు. దానితో నూరకపోక,

"అని వధించెదఁ గర్ణు నే నని ప్రతిజ్ఞ
సేసి యిటుదెచ్చి నన్నిట్లుసేసి యింత
కట్లునేర్చితి పాడవుగానత్తి నేల
దైవనోర్చితి నను బగవారినడుమ."

అని తన యావేగమునంతను నర్జునునిపైఁ గ్రుమ్మరించినాఁడు. "మనతోఁగూడంగఁ గంసమర్దియు నోడెన్" అను పల్కు సందర్భమున

కుచితమును, నర్థపోషకము నగును ఎంతయోయాశను, నమ్మకమును గల్గించి, యుద్ధమున దింపి, యిప్పుడు వంచించి, తన్ను పరులయెదుట యర్జునుఁడే భంగపఱచుచున్నాఁడను నర్థమును సూచించుచు, "పాడవుగా నత్తి నేలవైవనోర్చితి నను బగవారినడుమ" అని ధర్మజుఁడు నిందించినాఁడు. సూక్ష్మముగఁ బరిశీలించినచో, ధర్మార్జునుల మనోగతములైయడఁగియున్న భావము లిందు బహిర్గతములై యుండుట కాననగును. భీష్మపర్వముననే ధర్మరా జర్జునునిగూర్చి,

"అతని జయించునంచు మన మర్జును నెంతయు నమ్మియుండఁగా
నితఁడును సంగరంబు నుపేక్షకుఁడయ్యె వృకోదరుం డొకం,
డ తఱికిఁజొచ్చి దోర్బలముడాపకఁ బోరెడు నేమిసేయు నా
కితనిని నీతనిం దడవనేటికిఁ గయ్యపుజోలి మానెదన్."

అని కృష్ణునితోఁ బల్కియున్నాడు. అట్లే యిప్పుడును "కర్ణ నిగ్రహించుట యశక్యంబయ్యె. సుయోధనాదికౌరవులు గనుంగొన, వాని చేతం బరిభవింపంబడ యేను జీవంబుతోనునికిం గడచిన కష్టంబునుం గలదె! అదియట్లుండె, నేను జావుఁదప్పివచ్చుట వడముడి కతంబునం గలిగె, నతం డొక్కరుండును, బ్రాణంబులు దాపక, పరబలంబులు బడలువడం బోరుచున్నవాఁడు." అని కృష్ణునితో బల్కి యర్జునుఁడు మనః స్ఫూర్తిగబోరుచుండుట లేదను స్వాభిప్రాయమును బ్రకటించినాఁడు. ఈవిధముననే, యర్జునుని యంతరంగమందును నొకవికృతి భావము సిగూఢమై స్వప్నావస్థయందువలె బ్రజ్ఞానిబద్ధముకాక వర్తించుచున్నది. అభిమన్యువధనాఁడు శిబిరమును జేరవచ్చుచు, దుర్నిమిత్తముల సూచించి కలఁతఁజెందు నర్జునుఁడు,

"ఈమేలు ప్రజకొనర్చిన
యామహిమకు నెలవు గొంతి యగ్రతనయుఁడో"

యని ధర్మజుని పై తనకుఁగల యాక్రోశమును వెడలఁగ్రక్కినాఁడు. లోకమున కీయుద్ధమనెడి మహానర్థమును దెచ్చిపెట్టినవాఁడు ధర్మరాజే యని యతని భావము. ఈసందర్భమున, ధర్మజుఁడు పరిభవ జనితమగు దుఃఖరోషావేశమునకు లోనై నిందింపఁగనే, యర్జునుని హృదయమున నడఁగియున్న వికారభావము క్రోధస్వరూపముఁ గైకొన్నది. మానవమన స్సత్త్వాదుల ప్రాబల్యము నెఱింగిన కృష్ణుఁడీ భావముల కన్యథాప్రవృత్తిఁ గల్పించి, ధర్మార్జునుల మానసములను బరిశుద్ధ మొనర్చియున్నాఁడు. 'ప్రభువు, గురుఁడు నగువాని దోషముల నెన్ని దూషించుట యతనినిఁ జంపుటతోఁ దుల్య' మను ధర్మసూత్రముం దెల్పి కృష్ణుఁ డర్జునునిచే నట్లు చేయించినాఁడు. అతనిమాట ననుసరించి, యర్జునుఁడు ధర్మజు నుద్దేశించి,

"కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భటగదా ఘాతంబులన్ గాలఁ గే
లను విద్వేట్చతురంగ సంఘములు గూలన్ గెలిసల్పంగఁ జా
లిన యాభీముఁడు వల్కఁగాక నను దోర్లీలాసమగ్రుండవై
యనిలో నిల్వఁగ లేని నీ విటులఁ గీడాడంగ నర్హుండవే."

"నకులుఁడు సహదేవుండును
బ్రకట భుజాస్ఫురణమున నరాతిబలము నే
లకు గోలకు దెత్తురు నో
రికి వచ్చినయట్టు లాడి రే యిబ్బంగిన్."

"నీవు జూదంబాడఁగా వైరబంధంబు
గౌరవజాతితోఁ గలిగె నునకు
రాజ్యనాశంబు, నరణ్యవాసంబును,
దాస్యదైన్యంబు నత్యంత దుఃఖ
ములు దెచ్చికొంటి సిగ్గొలయదు నీ మనం
బున నించుకేసియు ననికిఁ జాల

కున్న వానికిఁ దాల్మి యొప్పగుఁ గాక ప్ర
ల్లదములు పలికిన లాఘవంబు
నెందు మున్నేమి సేసినఁ జేసి తింక
నైన దుర్బుద్ధితనములు మాని తగిన
పౌరుషము లేము సేయఁగ నూరకుండు
నిమమవడువారు నైతురే యింత వట్టు.''

అని యగ్రజు నప్రియంబుపల్కి, యంతరంగంబు సంతాపంబునొంద నాత్మహత్యకై ఖడ్గమును దూసినాఁడు. ఈపల్కు లప్రయత్నముగ నర్జునుని నోటినుండి వెల్వడినవి. చిరకాలమునుండియు నతనిహృదయమున సుప్తమైయుండిన భావవికారావేశ మీపరుష వాగ్రూపమును దాల్చినది. మనసులోని భావమిట్లు బైటపడినతోడనే సజ్జనుఁడగు నర్జునుని హృదయము పరితాపమునకు లోనైనది. సత్యమేయైనను నప్రియమును బల్కి సజ్జనులితరుల మనసులను నొప్పింపఁజాలరు. కృష్ణుఁ డిట్టి సోదరుల హృదయములను పరస్పర నిందాగ్నిశుద్ధముఁ గావించి, వాని శుదాత్తతను గల్గించినాఁడు. విషమ పరిస్థితుల కారణమున నేకకుటుంబమునందలి యన్నదమ్ము లావేశపూరితులై, కలహించి, మరల నంతలోననే సహజానుబంధకారణమున నేకీభవించున ట్టిఘట్టము నెంతయు స్వాభావికమగువిధమునఁ దిక్కన రచించియుండుట గమనింపఁ దగినది.

అట్లే, భీష్మునిపైఁ గోపించి యావేశమునకు లోనై యస్త్రసన్యాసముఁ గావించిన కర్ణుఁడు, భీష్ముఁడు శరతల్పగతుఁడైన యనంతర మతని యెడఁ బ్రవర్తించిన విధాన మిందులకు మఱియొక యుదాహరణ.

''శరతల్పగతుండైన గాంగేయు కడకుం బోయి, కర్ణుండు భక్తివినయంబులు దోపం బాదప్రణామం బాచరించి,

"అలుకదక్క నన్ను నధికవాత్సల్యశీ
తలముఁగాఁగఁ జూచి తగినమాట
లాడవే మహాత్మ."

అని కంఠము రుద్ధమగుచుండఁ బ్రార్థించినాఁడు. తండ్రియెడఁ గోపించి యతని విడిచిపోయిన కుమారుఁడు, కొంతకాలమునకుఁ బశ్చాత్తాపతప్త హృదయుఁడై మరణశయ్య యందున్న తండ్రిని మరల చేరిన విధము నీ ఘట్టము స్మరింపఁజేయుచున్నది. భీష్ముఁ డతనిఁ జేరఁబిలిచి, యొక్క కరంబు మలంచి, కౌఁగలించుకొని, పుత్రవాత్సల్యమును బ్రదర్శించు నంతవఱకును, గర్ణుని హృదయావేగ ముపశమించినది కాదు. "నీదెసఁ గోపింతును అది శిశుగాని రోషంబు కాదు, నీవు పాండుతనయుండ వగుటం జేసి, నీయెడ వాత్సల్యంబ కాని మాత్సర్యంబు లేదు," అని యా కురువృద్ధుఁ డనునయించినప్పుడు కర్ణుని హృదయ మెట్టి యమృతసేచన మొందినదో కదా! కౌరవులకు జయము లభింపదనియుఁ, గుంతీపుత్రుఁ డగు కర్ణుఁడు కౌంతేయులం జేరుట శ్రేయమనియు, భీష్ముఁ డుపదేశింపఁగా నతఁడు "దైవాధీనము సర్వముఁ మనమతిం దప్పింపఁగా వచ్చునే" యని విధివిలాసమునకుఁ దలయొగ్గియు,

"నీవింక నను నొండువల్కక పరానీకంబుపై బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద--"

ననుచు యుద్ధమున కనుమతి యిమ్మని ప్రార్థించినాఁడు. మఱుదినమునఁ గర్ణుఁడు యుద్ధమునకు సంసిద్ధుఁడై, భీష్ముని సమీపించి, వీరశయన మహనీయుండైన యమ్మహానుభావుని యడుగులపైఁ గన్నీరు దొరఁగం బ్రణమిల్లి, కేలు మొగిడ్చి, వినయ వినమితశరీరుండై,

"వచ్చితి రాధేయుఁడఁ గను
విచ్చి ననుం జూడు భరతవీరాగ్రణి నీ

సచ్చరితము ఫలమే యి
ట్లిచ్చుట నీయునికి ధాత నేమన నేర్తున్."

"పావనంబులైన పలుకులు నా చెవు
లార నెమ్మి నన్ను నాదరింపు
మయ్య ధర్మనిత్య యంచితసత్య శం
తనుకుమార గాఢధైర్యసార."

అని నిస్సహాయుఁడగు బాలునివోలె వాపోయినాఁడు. "ఇట్లిచ్చుట నీయునికి నీ సచ్చరిత్రమునకు ఫల మా, ధాత నేమన నేర్తున్." అను నాతనివచనములలో భీష్మునెడఁ గర్ణునకుగల పవిత్ర పూజ్యభావములు మాత్రమే కాక, యతని హృదయమార్దవమును వ్యక్తమగుచున్నది. కనువిచ్చి చూచి తన్నాదరింపుమని కులవృద్ధుని వేడికొను కర్ణునియందు, సద్వంశోచితములగు భక్తి ప్రేమౌదార్యములు మూర్తీభవించినవి. ఒకప్పుడు భీష్ము నుద్దేశించి సభలో,

"నావ్వఁబలుకుదు సభలోనఁ జివ్వకొల్ల
కేను గురుపతి సూచి సహించిపోదు
సురనదీపుత్ర విను నాకుఁజూడ నర్ధ
రథుఁడవగుదీవు లావు బీరమ్ము నరయ."

అని పల్కి, భీష్మునిదుర్మాని యనుచు కోపావేశంబునఁ దృణీకరించిన కర్ణుని యందెట్టి పరివర్తనము గల్గినదో యీఘట్టమున విదితమైనది.

"దమమును సత్యముం దపము దానము శీలము శస్త్రవీర్య శౌ
ర్యములును భీష్మునంద కల వట్టి మహాత్ముఁడు పోర నీల్గె నిం
క మనకు నేటి బాహుబలగర్వము లెక్కడి సేన లక్కటా
సమసెను కౌరవేశ్వరుని సంపద యంచు విషణ్ణమూర్తియై."

కన్నీరొలుకఁగ వగచిన కర్ణునిఁ గాంచి నరపతులెల్ల రార్తరావములు మిన్నంద విలపించినారు.

"ధరితాశాంతర పాంచజన్యరవ దృప్యద్దేవదత్తధ్వని
స్ఫురణల్ వీనులు వ్రయ్యఁ గేతనకపిస్ఫూర్జత్ప్రభన్ జూడ్కులా
తురతంబొందఁగ చండ గాండివ సముద్భూతాస్త్రజాలంబు లె
వ్వరు సైరింతురు నీవు దక్క భుజగర్వస్ఫూర్తినిర్వాహకా."

అను కర్ణుని వాక్యమున నతని నైజసౌజన్యము ప్రదర్శితమైనది. ఈ పలుకులలో, నతఁడు భీష్ముని యెడ దనకున్న గౌరవ భావమును దెలుపుటతోఁ బాటు ప్రతివీరుఁడగు నర్జునుని గొప్పఁదనమును గూడ జంకులేక ప్రశంసించినాఁడు. విశాలహృదయులగు మహావీరుల స్వభావమిట్టిది. ఇట్లు జీవితమునసంభవించు వివిధసంఘటనలవలన మానవుని హృదయమునఁ గలుగు పరివర్తనమును, దత్కారణమగు నతనిప్రవర్తన వలన వ్యక్తములగు నైజశీల స్వభావాదులును, దిక్కనచే నాయాఘట్టములలో రసవత్తరముగఁ బోషితములైయున్నవి.

ఇట్లు తిక్కన యుద్ధపర్వములందు భిన్నభిన్న సన్నివేశములలోఁ బాత్రల మానసిక స్వభావాదుల కత్యధిక ప్రాధాన్యమిచ్చి, యుద్ధవర్ణనమును మానవ జీవితమునకు సన్నిహిత మగునట్లు గావించియున్నాఁడు. వీనియందలి వివిధఘట్టములను జిత్రించుటలోఁ దిక్కన యవలంబించినది పౌరాణికమార్గము కాదు. రూపకర్తవలెఁ దాను బాత్రల వెనుక నొదిగియుండి, యాయా ఘట్టములను నాటకమందలి రంగములవలె నిర్మించినాఁడు. ఒకచోఁ ప్రశాంత మనోహరమగు ప్రకృతి సౌందర్యము, నొకచోఁ ప్రకృతిసిద్ధములగు నుచితోపమాన రామణీయకము, మరియొకచో విశిష్టశబ్ద ప్రయోగచాతురివలనఁగలుగు వర్ణ

గౌరవ రసధ్వనుల స్ఫూర్తియు, వేఱొకచో సందర్భోచితమగు సంభాషణాత్మక రసవత్తర నాటకీయ సంవిధానము, కొండొకచో, సన్నివేశానుసారమగు మానవ స్వభావ వ్యక్తీకరణము, నందందు స్థిత్యంతరానుగత మానసిక ప్రవృత్తులును, మనోరంజకమగునట్లు చిత్రించి, తిక్కన యీయుద్ధపంచకము నుదాత్త ప్రౌఢ కవితా రచన కాదర్శముఁ గావించియున్నాఁడు.

# స్త్రీ పర్వము

పలువిధములగు రసవత్తర సన్నివేశముల కాకరము, వీరరౌద్రాదు లకుఁ ప్రధానము నగు యుద్ధముతో, భారతేతివృత్తము నందలిముఖ్య ఘట్టము సమాప్తమైనది. ఇతివృత్తముతోఁ బాటు భావముగూడ మారుట సహజము. యుద్ధభాగమునఁ బ్రాధాన్యము వహించిన యుత్సాహ మిప్పుడు వెనుకకొదిగి, శోక నిర్వేదములకుఁ దావిచ్చినది. సౌప్తికపర్వ గతమగు ద్రౌపదీ విలాపముతోడనే శోకము స్థాయీ రూపముఁ దాల్చినది. స్త్రీపర్వమున నయ్యది ప్రాధాన్యము వహించి, గాంధారి యొక్కయు, నితరకురుపాండవ స్త్రీలయొక్కయు నాక్రంద ములం మత్కటమై, కరుణ రససిద్ధిం గాంచినది. యుద్ధరంగమున భర్తృభ్రాతృ పుత్రాదుల మృత దేహములపైఁ బడి దీనముగ విలపించు స్త్రీజనసమూహమును గాంచుటచే, ధర్మజుని మనస్సు వికలమైనది. హృదయ విదారకమగు నీదృశ్యముచే నతఁడు నిర్వేదమునకు లోనై నాఁడు. యుద్ధపరిణామఫల మతనికి సంపూర్ణముగఁ బ్రత్యక్షమైనది. ఇంతటి సర్వనాశమునకును మూలహేతువగు తన ద్యూతప్రవర్తన స్మృతికివచ్చి యతనిమనస్సును వికలముఁ గావించినది. ఈ నిర్వేదము వలననే ప్రజాపాలనమునెడ విముఖుఁడై ధర్మజుఁడు వనవాసమునకు బోవనెంచినాఁడు. అతఁ డిట్టి నిర్ణయమునకు వచ్చుటలో నాశ్చర్యమే మాత్రమును లేదు. తన తప్పిదము కారణముగా లోకమునకుఁ గీడు కలిగినచో సత్పురుషుని మనస్సు నిర్వేదమునొందుట ప్రకృతి సహజము. భారతేతివృత్తమునకు నాయకుఁడగు ధర్మజుని హృదయము కూడ నట్లే పరితాపతప్తమై పరిశుద్ధిం గాంచి, ప్రశాంతి నొందవలసి

యున్నది. శాంతి లభించినపిమ్మట గురూపదేశముచే జ్ఞానోదయమును, దత్ఫలముగ ధర్మనిష్ఠయు సిద్ధింపఁగలవు. ఈ క్రమము ననుసరించియే, భారతయుద్ధానంతరము శోకాధిష్ఠితమగు స్త్రీపర్వ రచన యావశ్యకమైనది. గాంధారీధృతరాష్ట్రుల హృదయములును, నట్లే, భారతేతివృత్తముతో సంబంధమున్న యందఱ హృదయములును, శోకాగ్నితప్తములు గావలసి యున్నవి. పాపపరిణామ ఫలమగు శోకానుభవమునెల్లరును సమానముగ బంచుకొనక తప్పదు. కావుననే ముగ్ధయు, నవవధువు నగు నుత్తరకూడ కౌరవ స్త్రీలతో సమదుఃఖ భాగినియైనది. పాపులహృదయములు మాత్రమే కాక, పుణ్యవంతుల హృదయములు కూడ నిట్టివిధమున దప్తమైనప్పుడే లోకమునకు న్యాయ, ధర్మములఁ గూర్చిన స్మృతికొంత కలుగఁగలదు. ఒకఁడొనర్చిన పాపమువలన, సంఘమున ననేకులు నశింతురను ప్రకృతిసత్యము హృదయములలో నాటుకొనినప్పుడే, లోకులయందు పాపభీతి యంకురించును. ఇట్లు లోకమునఁ బాపభీతియు, నసత్యాధర్మ పరాఙ్ముఖత్వమును గలిగినచో ధర్మస్థాపన కవకాశ మేర్పడును. ఈ మహోద్దేశము ననుసరించియే స్త్రీపర్వ' ముత్కటశోకావేగమున కాధారముగ రచితమైనది. ఇందు ధర్మజుని హృదయము నిర్భరమగు నిర్వేదమునకు లోనై పశ్చాత్తాపమును జెందినది.

తనకుమారులెల్లరును పాండునందనులచేతఁ దెగుట సంజయుని వలన విని, దీనముగ దుఃఖించు ధృతరాష్ట్రుని వర్ణనతో స్త్రీపర్వ మారంభమగుచున్నది.

"అట్లుపుత్రశతంబు వైరికులంబుచే
నిరవశేషత నొందుటఁ మహానీయ గౌరవ హీనతఁ
బొరసి కొమ్మలుదున్న ప్రమోడ్పడు భూరుహంబును బోలె ని
ర్భర విపద్వ్యాకులాత్ముఁడై ధృతరాష్ట్రుఁ డుల్లము వెమ్మఁగఁ."

"నా కతంబునఁ బొలిసిరి నందనులును
జెలులుఁ జుట్టంబులును సహోయులును ధైర్య
మెట్లుకలుగు వైదికముల కెట్లు మనసు
గొలుపుఁ బ్రాణంబుతో నెట్లు నిలువ వచ్చు."

శాఖోపశాఖల నన్నిఁటిని గొట్టివేయఁగా, మోడు వడియున్న వృక్షము ధృతరాష్ట్రుని ప్రకృతావస్థ కుపమానమైనది. వృక్షకాండము నుండి యుద్భవించి విస్తరించిన శాఖోపశాఖలవలెనే స్వీయ దేహాజులగు పుత్రపౌత్రాదులందఱు నశింపఁగా, కాండమాత్రావశిష్టమై నిల్చియున్న వృక్షమువలెనే, ధృతరాష్ట్రుఁడును దేహమాత్రా వశిష్టుఁడై యున్నాఁడు. దుఃఖావేశమున నిర్వేదము జనింపఁగా, కర్తవ్యమగు వైదికక్రియలకు బూనుకొనజాలకున్న ధృతరాష్ట్రునకుఁ, దగుమాటలచే సంజయవిదురులు దుఃఖోపశమనము గావించినారు. అందు సంజయుఁడు దుర్యోధనాదుల పాపప్రవర్తనమును, ధృతరాష్ట్రుని లోభమును, గతినరీతి విమర్శించి, స్వయంకృతమును గూర్చి యిప్పుడు వగచుట హాస్యాస్పదమని, ధృతరాష్ట్రుని హెచ్చరించినాఁడు.

"సుహృజ్జనంబు లుపదేశించిన మాటలువిననైతివని, నీవ చెప్పెదు. ఉమ్మలింపంబనియేమి. నీకును నీకొడుకునకును మంత్రులు. దుశ్శాసనుండును, గర్ణుండును, శకునియు నటె ఏమి సెప్పఁగలరు."

"కొఱుతనుఱుకుఁగాని కొడు కెన్నఁడును గార్య
తంత్రమునకుఁ జొరఁడు దాని నీవు
మాన్పనొల్ల వతనిమగటిమియును లావు
నచ్చి లోభ మెదఁ బెనంగొనంగ."

తృష్ణయే కారణముగ నతిసాహసమునకుఁ బూనినచోఁ బరిణామము విపరీత మగుట యాశ్చర్యముకాదు. ఈవిషయమునే సంజయుఁడు,

"జున్ను డెప్పరంపుఁజోఁపైన చఱి నున్న
జూచి వెఱుగఁబడుట చూడఁ డాత్మ
దీఁపు. గోరి యుఱుకు తిండికాఁడునుబోలె
నైతి వగచు టెంక ననుచితంబు."

అని చక్కని లోకన్యాయమును బురస్కరించుకొని వివరించినాఁడు. అందుకొనుట కశక్యమై, యాపదకు మూలమైన కొండచఱియ నున్న పట్టుతేనియకై ప్రలోభపడి, క్రిందుమీఁదెఱుఁగక, తెగనుఱుకు తిండిపోతునకుఁ గల్గినగతియే ధృతరాష్ట్రునకును గలిగినది. అలభ్యమగు పాండవుల సంపదయందలి యతిలోభముచే యుక్తాయుక్తముల గణింపక, కృష్ణ విదురాదుల హితవచనములను గూడ సరకుఁగొనక, దైవమును లెక్కింపక, తృష్ణాపీడితుఁడై, యతిసాహసమునఁ బ్రవర్తించిన ధృతరాష్ట్రుని విషయమున నీ యుపమాన మెంతయు నుచితముగనున్నది. 'వెఱుగఁబడుట చూడక' 'తీపుఁగోరి యుఱుకు తిండికాఁడు' అను తిక్కన ప్రయోగములు తత్తద్దశాసూచకములై యర్థవంతముగ నున్నవి. ఇట్లే స్వయంకృతాపరాధము వలన సిద్ధించిన యనర్థమునకై వగచుట యవివేకము, మీఁదు మిక్కిలి హాస్యాస్పదము, నను నర్థము సాభిప్రాయమగు నీ క్రింది యుపమానముచే సువ్యక్తమగు చున్నది.

"తాన చుట్టుఁదగిల్చియగ్ని యుదగ్రతం దరికొన్నఁ దా
నానుభూతికి నోర్వఁజాలక యప్రయోజన వాక్య సం
తానశోషిత వక్త్రుఁడై యతిదైన్య మొందెడువాని య
ట్లైన నీదువిలాప మన్యుల కాడఁబట్టగు భూవరా."

ధృతరాష్ట్రుఁ డవివేకమునఁ బ్రవర్తించిన విధమును, దత్ఫలమగు నతని ప్రకృతావస్థను నీ యుపమానము సూటిగ విశదపఱచుచున్నది.

"నీదు విలాప మన్యుల కాడఁబట్టగు భూవరా" యను వాక్యమందలి తెలుఁగు నుడికారము కడుంగడు హృద్యమైనది. దుఃఖావేగమున నోటికివచ్చినట్లెల్ల వాగుటచే నొరెందుటతప్ప వేరు ప్రయోజన ముండదను నర్థ ముపమానోపమేయముల రెంటను జక్కగ సమన్వ యించుచున్నది." సత్యములు, మర్మభేదకములు నగు నీవాక్యము లశక్తదుర్జనుఁడగు ధృతరాష్ట్రుని హృదయ సంస్కారమున కెంతయు నవసరములు, నుచితములు. ఇంతియుకాక దైవికముగఁ గల్గిన పుత్ర మరణ కారణమునఁ బరిణతవయస్కులైనవారు దుఃఖించుచోఁ సన్ని హితులగు పెద్దలు కఠినముగ వారినిమందలించుట లోకమునఁ గలదు. సంజయుని పల్కులివ్విధమున నుండఁగా, నీసందర్భమున విదురుఁ డాడిన మాటలు వైరాగ్యబోధకములై యున్నవి.

"యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములు గావె
వీనిహానికి వగ నవివేకమగుటఁ
బండితులు వగఁగూరరు పౌరవేంద్ర."

"ఒకయింటనుండి వేఱొకయింటి కరిగిన
విధమున వస్త్రంబువిడిచి యొండు
వస్త్రంబుఁ గట్టిన వడువును నై యుండు
నొడలు దొఱంగి యొండొక్కయొడలు
గైకొంట నృప విను కడవకు సారెపై
నమర మృత్తిక యిడునపుడు విరియు
టయు వెరవారఁ బట్టగరాక చెడుటయు
వాని నత్తెదునెడ వ్రయ్యుటయును

"నత్తి రొంకచోట డించిన నెడలుటయును
నెండి యవియుటయును నావమిడినఁ బగిలి
పోవుటయు వాఁడుజనులచేఁ బొలియుటయును
గలుగుగతి మేని కెట్లునుఁ గలుగుఁ జేటు."

మొదట, దేహి యనిత్యతను సాధారణముగఁ దెల్పి, పిమ్మట జన్మారంభమునుండి దేహి యెన్నెన్ని గండములకు లోనగునదియు, నుత్కృష్టమగు దృష్టాంతముచే విదురుఁడు వివరించియున్నాఁడు. కుమ్మరిసారెపై నిడిన మట్టి భాండరూపమును దాల్చి, యెండి, కాలి, కుండ యగువఱకును, నెన్నిగండములఁ గడపవలసియున్నదో, పిమ్మట భగ్నమగుట దాని కెట్లుతప్పదో, యిందు వివరింపఁబడినది. జన్మాదారభ్య జీవినిఁ బ్రతిక్షణము మృత్యువెట్లు వెన్నాడునదియుఁ, గడపట నెట్లు తప్పక గ్రసించునదియు, నీ యుపమానము మూలమున విశదమగుచున్నది. భవబంధములపై జుగుప్సను గలిగించి వైరాగ్యము నుదయింపఁ జేయుటయే విదురుని యుద్దేశము. తదనుగుణముగఁ దిక్కనయు, భావ ప్రకటన కనుకూలించు శైలిని, రీతిని, నవలంబించి యున్నాఁడు.

"కలసి శుక్లశోణితములు కరడుగట్టి
విను మమేధ్యమధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది
కాలవశత నప్పిండ మంగంబులెల్లఁ
గలిగి శిశువై మారుతగతి యొలర్ప."

"వెడలునెడ గాఢపీడం
బడి సుడువడి యోని నొత్తువడి యొకభంగిన్
వెడలఁగ గ్రహభూతము ల
ప్పుడు దొడఁగి యనేక దురితములు గల్పించున్."

సంగరాంగణము రమణీయము, భీషణము నగు విధమున వర్ణించిన తిక్కన యీ విషయముఁ నేవిధమున రచించినదియు గమనింప దగును. ఉపమానోత్ప్రేక్షాదుల ప్రసక్తియే మాత్రమును లేక, సూటి మాటలలో, నతిసంక్షేపముగ. గమ్యార్థమునంతను వ్యక్తము జేసి యున్నాఁడు. యుద్ధాంతమువఱకును భారతేతివృత్త మైహిక విషయ సంబంధి. ఆముష్మిక విషయ సంబంధియగు నుత్తరభాగము, పై విదుర వాక్యములతో నారంభమగుట ఔచితీవంతముగ నున్నది.

ధృతరాష్ట్రుఁడు కౌరవ వధూవర్గముతోఁ బొలికలనికిఁ బోవుఘట్టము హృదయవేదనాపాదకమగు శోకోత్కటమున కాటపట్టుగనున్నది.

"చేతులు నడుదల సేర్చుటుత్కటశోక
మాకారములు దాల్చి నట్టులుండ
విరిసిన వేనలుల్ వెన్నులఁ బ్రక్కల
నెఱసి చూపఱదృష్టి నీఱుసేయ
నందంద దొఱఁగెడు నశ్రుజలంబుల
పెంపున మోములు ముంపఁబడఁగ
నేమియుఁ దొడవులు లేమి బోడఱియున్న
యంగంబులందు దైన్యంబు నెఱయఁ
బతుల నన్నలఁ దమ్ముల సుతుల హితుల
బేరుకొని వాఁతులెండంగఁ బ్రేముడించి
పనవు పలుకులు వినువారి వనటఁ దేల్ప
కురుకుమార నారీ జనకోటి వచ్చె."

"చెలువలైనఁ జూడఁ బయ్యెద
దొలఁగుటకును సిగ్గుపడు వధూజనతతి య
త్తల యెదుర నేక వస్త్రం
బులతో నంగములు వికృతిఁ బొందఁగ నడచెఁ,"

"విపుల హర్మ్యతలంబులు వెడలునట్టి
వెలఁది ముత్తముల్ వొల్చె బల్వేటకాఁడు
పతులఁ జంపిన గిరిగుహాప్రతతి వెడలఁ
బాఱు సింగంపుఁ బెంట్లకుఁ బాటియగుచు."

"మున్నెన్నఁడు నెవ్వారికిం
గన్నులెదురఁ బడనియట్టి కాంతలు జను లె
ల్లన్నిలిచిచూడ వెడలిరి
కన్నులు గమరన్ సుహృన్నికాయంబులకున్."

కౌరవ వనితాజనము నుత్కట శోకరూపముగ వర్ణించుచున్నను, తిక్కన యందు రాజాంతఃపుర కాంతల సహజ సౌందర్య, లావణ్య, గాంభీర్యాదులను గూడ వర్ణించియున్నాఁడు. పయ్యెద తొలఁగఁగఁ జెలులు చూచినన్ సిగ్గుపడు వధూజనమనియు, మున్నెన్నఁడు నెవ్వారి కన్నుల యెదుటఁ బడనియట్టి కాంతలనియు, వర్ణించి. కురుకాంతల గుణ శీలాభిజాత్యముల నెంతయు లలితముగ తిక్కన సూచించి యున్నాఁడు. సార్వభౌమ వంశ వధువులైన వారి యిప్పటి దురవస్థను వర్ణించుటలోఁ దిక్కన సాధారణమగు దైన్యమున కవకాశమియ్యక, యుదాత్తతనే సముచితముగ బోషించినాఁడు. వేటకాఁడ్రు మగసింహములనుజంపఁగా పర్వతకందరములనుండి వెల్వడు నాడుసింహములవలె, హర్మ్యముల నుండి వెల్వడు కురుకాంత లొప్పిరట. హర్మ్యమన నేడంతస్తులమేడ గనుక, నున్నతములగు హర్మ్యములకును, బర్వతములకును బోలిక. హర్మ్యాంతః ప్రదేశములకును, గిరిగుహా గహ్వరములకును సామ్యము. ఉపమాన మాకారలక్షణముల రెంటను సమగ్రమైనది. క్రోధశోకముల యుద్వేగ ముపమానోపమేయముల రెంటను సమానమే.

ధర్మజుఁడనుజ సహితుఁడై సమరతలంబునకు రాఁగ, నీ వనితా జనంబు లక్కొంతేయాగ్రజుం గనుంగొని, కరంబు లెత్తి యేడ్చుచు నెదుర్కొని, దూఱిన విధము, స్త్రీజన స్వభావానుగుణముగ నుండుటయేకాక, వారి యాభిజాత్యమునకుఁ దగిన సంయమనముతో నొప్పి, గంభీరమై యున్నది.

"ధర్మవేదిత్వ మీధరణీశ్వరునకు నె
క్కడియది కృప యెందుఁగలదు తలఁపఁ
దండ్రుల మామలఁ దాతలఁ గొడుకులఁ
దోడఁబుట్టువులను ద్రుంచినై చేఁ
గ్రూరత మెఱయంగ గురుజనంబులఁ గూల్చె
సఖుల సంబంధులఁ జంపె నదయుఁ
డని పల్కుదురు కొంద అప్పార్థుఁజేరి గాం
గేయుని ద్రోణుని గెడయఁబొడువఁ

"బనుప నెట్లునేర్చె తని బల్కుదురు గొంద
ఱకట సింధురాజు ననుజమగని
దునిమి తేటిరాజ్య మని బల్కుదురుగొంద
ఱతఁడు మోమువాంచి యరుగుచుండ."

"ఇందఱఁ జంపితినని యుబ్బం
దీఱద ద్రుపదతనయ పట్టుల నభిమ
న్యుం దెగటార్చితి మఱదుల
నందఱ ద్రుంగితి విభూతియన నీకెద్దీ."

హృదయ శోధకములగు నీపల్కులును, వారి దీనావస్థయు, ధర్మజుని నిర్వేదమునకు ముఖ్యకారణము లగుచున్నవి.

ధర్మజాదులు గాంధారీధృతరాష్ట్రులయొద్దకు వచ్చుటయు, ధృతరాష్ట్రుఁడు భీముని జంపఁ బ్రయత్నించి, కృష్ణుని యుపాయమువలన విఫలుఁడగుటయు, గాంధారీ భీములకుఁ జరిగిన సంభాషణయు.- నిత్యాది వివరములతో నొప్పు తరువాతిఘట్టమును, తిక్కన, నాటకరంగమువలె నడిపించి యున్నాఁడు. అందు ధృతరాష్ట్రుని స్వభావ, మొకరూపమును వహించి. పాఠకుల యెదుటఁ బ్రత్యక్షమైనది. ధృతరాష్ట్రుని దుష్టభావము తొల్లి యెఱింగి త్రికాలవేదియైన కృష్ణుండయోమయంబుగా భీమ ప్రతిరూపంబు సేయించి, సంగ్రహించి, నిగూఢప్రకారంబునం దత్ప్రదేశంబునకుఁ దెప్పించినవాఁడు గావున నద్దాని నతనియెదుట నిల్పిన, నది భీమసేనుండ కాఁదలంచి,

"కోపంబుత్కటమై యా
రూపము నిరుగేలఁ బట్టి రూఢతఘోరా
టోపం బెసక మెసగ నా
భూపతి వెసఁ గౌఁగిలించి పొలుపఱ విఱిచెన్."

ఇట్లా యంధనృపతి భీముని ప్రతిరూపంబు భగ్నంబుచేసి, దుర్యోధను నాత్మకు శాంతి నాపాదించితినని యెడంద నిర్భరమగు హర్షము నొందినాఁడు. కాని, యా హర్షాతిశయమును బాహ్యము కానీయక లోకుల మెరమెచ్చునకై, భీమునిచావునకు దుఃఖించిన హాడుంబోలె నతనిం జేర్కొని హాహాకారంబు లెసంగ రోదనంబుచేసిన విధమును, దానింజూచి, చిఱునవ్వునం దన వదనకమలంబొప్ప కమలనాభుండతనిని మందలించినవిధానమును దృశ్యకావ్యమునందువలె వర్ణితములైనవి.

"తనయ శోకాతురుండవై ధర్మమెడలి
యనిలసుతుఁ డెగటార్చెదనని తలంచి
తట్టిపని నీదుచే నేలయగు విధాతృ
లీలఁబరికింపనేరక జేలవైతి."

అను శ్రీకృష్ణుని పలుకులు, ధృతరాష్ట్రుని ప్రకృతితత్త్వమునకుఁ జక్కని వ్యాఖ్య లగుచున్నవి. 'ధర్మమెడలి' 'విధాతృలీలఁ బఱికింప నేఱక', స్వసామర్థ్యమునే యాలంబముగఁగొని, స్వోత్కర్షకై, పాపమునఁ బ్రవర్తించిన ధృతరాష్ట్రుని స్వభావ మిట్లు వివృతమైనది. విధిప్రభావమును గుర్తెఱుంగక పోవుటయే లోకుల పాపాచరణమునకు మూలహేతు వను విశిష్టార్థ మిందు వ్యక్తమైనది.

పుత్రశోకము గాంధారియందు మూర్తీభవించినది; ధర్మజుని శపింపఁ బూనినది. కాని, భీముఁడుపల్కిన ట్లామె సువిచార యనక తప్పదు; మంచిచెడ్డల నరయఁగల పరిజ్ఞాన మామెకుఁ గలదు. ఐనను, భీముఁడు గదతోఁ దన కుమారుని నాభికి దిగువఁ గొట్టుటయు, దుశ్శాసనునిఁ గ్రూరముగ వధించుటయు, నామెకు హృదయాఘాతములైనవి. భీముని ప్రవర్తన యధర్మమనియు, నాసురమనియు నామె కఠినముగఁ బల్కినది. భీముఁ డందులకుచిత సమాధాన మొసంగి, "నీవును సువిచార, వింతయు విచారింపు మనవుడు" నందలి సత్యమామె గ్రహింపఁగల్గినది. ఐనను,

"అంధులకు నూతకోలగా నకట యొకని
నైన నిలుపక నూర్వుర నదయవృత్తి
మ్రింగి తండెవ్వఁడేనియు మీకు నెగ్గు
లాచరింపనివాఁడు లేఁడయ్యె నయ్య."

"ఒక్కరుని నీవు సంపక
తక్కిననంతటనె ప్రతినదప్పూనె విభవం
బెక్కఁగ మీయన్న నతం
డెక్కటి రాజ్యంబు సేయనీఁడె కుమారా."

అని యతిదీనముగఁ బల్కినది. అడుగడుగునకును నంధున, కూతకోల్ల

యెంతయవసరమో లోకవిదితము. వృద్ధాప్యమునఁ గుమారుఁడు నశ్లే, తలిదండ్రుల కాలంబమగును. ఇట్టీయుపమాన మెంతయు నుచిత మగుచున్నది. మరియు నంధులగు గాంధారీధృతరాష్ట్రుల విషయమున యథార్థముకూడ నగునట్లు 'ఊతకోల' యను నీ శబ్దమును దిక్కన మెలఁకువతో బ్రయోగించినాఁడు. 'అదయావృత్తిఁ బ్రమింగితివి' అనుచో 'ప్రమింగు' అనుశబ్దమిచ్చుట తెనుఁగునుడికారమున కెంతసన్నిహితమో గమనింపనగును. పుత్రశోకమునకు లోనైన, తల్లులు, తమవారిని 'మిత్తి పొట్టను బెట్టుకొన్నదనియు' 'వాఁతవేసికొన్న దనియుఁ,' బల్కుట సహజము. తనకుమారులనందఱినిఁ జంపినభీముని విషయమునఁ బై పదములకంటె శీఘ్రకబళనమును సూచించు 'ప్రమింగి తను శబ్దప్రయోగము మిక్కిలి సమంజసము.

దుఃఖాతిశయమునఁ దానున్నను, దనవలెనే దుఃఖముననున్న ద్రౌపదినిఁ జూచి, గాంధారి వెలువర్చిన సానుభూతి ప్రశంసనీయము. పుత్రశోకమునఁ బొగులుచు, నెండదాఁకి వందిన తీగచందమున నున్న ద్రౌపది, గాంధారిని సమీపించి పాదంబులకు మ్రొక్కి వెక్కుచున్న యా వృద్ధమాత,

"పుత్రి యిట్లగునమ్మ శోకముఁబొంది కుందుచునున్న నీ
గాత్రమం దొక కీడుపాటెలి కంటుఁ బాండుతనూభవుల్
పుత్రవర్గము గన్నచో నెద భూరితాపముఁబొందుదుర్
బాత్రహీనతఁ బడ్డ కొంతికిఁ బాయనేర్చునె నవ్వగల్."

"విను నే నిట్టూరార్చెద
వను నీవూరార్పవలదె నా నీ తెఱఁగుల్
విను మొక్కరూప మన కే
ఘనగలదు విధాత బ్రూరుఁడై పఱుపంగన్."

అని యామెనూరార్చినది. గాంధారి గర్భశోకము ననుభవించు చున్నది యగుటచేఁ "గొంతికిఁ బాయనేర్చునె నెవ్వగల్," యని పలుకుట, సముచితము, ప్రకృతిసహజము నగుచున్నది. అట్లే, గర్భశోకాతురయైన ద్రౌపదిస్థితియుఁ, దనస్థితి యట్టిదేయని గుర్తించినదియగుటచే, "నానీ తెఱఁగు లొక్కరూప యగుటచే మనమెుం డొరుల నూరార్చుకొనవలె" నని పల్కినది. ధర్మజుని దుర్యాత ప్రవర్తనవలనను, ధృతరాష్ట్రుని యుపేక్షవలనను సంభవించిన యీ యనర్థమును ద్రౌపదీగాంధారు లనుభవింపవలసి వచ్చినది. యుద్ధానర్థములను ప్రత్యక్ష కర్తలు గాక బాల వృద్ధ స్త్రీజనము లనుభవింపవలసివచ్చుట నాఁటికిని నేఁటికినిఁ దప్పనిసరియగుచున్నది.

గాంధారి, తన దుఃఖమును మాత్రమేకాక, కౌరవ పాండవ వనితా జనముల హృదయగత దుఃఖమునుగూడ తానే వెలిబుచ్చినది. కురు వంశమునఁ బ్రతివ్యక్తికిఁ గల్గిన దుఃఖమును, దద్వంశవృద్ధయగు గాంధారికిఁ జెందుటయు నుచితమగుచున్నది. రణరంగమున దమతమ ఆత్మీయుల కళేబరములంగాంచి, పలువిధముల, హృదయ విదారకమగు భంగిని దుఃఖించు కురుకాంతల నొక్కరొక్కరినే, కృష్ణునకుఁ జూపి, గాంధారి తనహృదయావేదనను వెలిగ్రక్కుచున్నది.

"ప్రేవులు గండలు పెరికి వేటాఁడి యం
గదఁగొని మెదళు లగల్చికొనుచు
రాగిలి రక్తంబు ద్రావుచు లోచన
గుళికల నొలిచి మ్రింగుచును గుండె
కాయ లాదటమెయిఁ గబళించుచును గ్రొవ్వుఁ
దెమలిచి నమలుచు నెముకయూట
చవిగొని యానుచుఁ జావకయున్న యా
పులు సచ్చుటకుఁగాగఁ బెలుచఁదని

కొనిన వెఱఁ బాయబారుచుఁ జెనకి తొడరి
కాటులాడుచు నున్న సృగాలములును
గాకములు రాపులుఁగులును గ్రద్దలును వృ
కంబులును మానసము వికలంబుసేయ."

ఇంత బీభత్సముగనున్న పొలికలని దర్శనముచే, గాంధారి మాత్రమే కాక ధర్మజాదులును హృదయవైకల్యమును బొందుటలో నాశ్చర్యము లేదు. పిమ్మట భీష్మ ద్రోణులను, విరాటద్రుపదులను, ద్రౌపదేయాభిమన్యులను, సమస్త బంధుమిత్రాదులను, బనవి పనవి గాంధారి వాపోయినది.

"కూలియుఁగాంతియుగుర్వఁగఁదేజముగుందకవహ్నులుగ్రూరశిఖా
జాలమడంగియుఁ జాయవెలింగెడు చందమునొందిరి కల్యుఁడు బాం
చాలుఁడు గర్ణుఁడుఁ జాపగురుండును శాంతనవుండు నిజంబున కీ
బాలుఁడు వీరిప్రభం గడచెన్ గుణభద్రునిగంటె సుభద్రసుతుఁ."

"హంసతూలికాతల్పములందు బొందు
భోగిజనముల మృదుగాత్రములు ముకుంద,
కంటెఁ బరుసని ధరణిభాగములఁ గూలి
యున్నయవి సూచువారల యుల్ల ముడుక."

కౌరవస్త్రీలు పడునవస్థను గృష్ణునకుఁ జూపుచు,

"అట్టలకడ నుత్తమాంగముల్ గానక
యలమట నలుఁగడ లరయువారు
తలలు చేతులఁగొని తనువు లత్తలమున
దఱచు పీనుఁగులలోఁ దడవువారు.
శిరములు మేనులఁజేర్చి భావించి ని
జాస్యముల్ వ్రేసికొం చఱచువారు

తునియలు పెక్కైనఁ బనివడిఁ గూర్చి రూ
పులు గనుంగొని మూర్ఛ మునుఁగువారు

నైన కౌరవ పాంచాల మానినీ జ
నముల నచ్యుత, చూడుము నాథ జనక
పుత్ర సోదర శవముల పొంత కేఁగి
పెక్కు దురవస్థ లొందెద రక్కటకట.''

''అవయవములు రూపఱఁగఁ గ్రవ్యాదభక్షి
తంబులై యున్న కొన్ని శవంబు లువిద
లెంతసూచియు నవి గొంద ఱెఱుఁగఁజాల
రయ్యెదరు నూడు తమబంధులగుట కృష్ణ.''

అని, యుద్ధఫలము నెట్లు నిర్దోషు లనుభవించుచున్నారో గాంధారి ప్రదర్శించుచున్నది.

''చందనార్ద్రకుట్టిమముల చరణతలము
లొందుటకు నేవగించు నయ్యువిద లిపుడు
నెత్తురుల తేవ మెక్కిన నేలఁ బొరలు
చున్న వా రేమి సెప్పుదు నుడుకు పేర్మి.''

''బాలలుఁ దరుణులు ప్రౌఢలు
దూ లెదు వికలాంగకములతో డెందములన్
వాలిన విరహానలముల
పాలై వందు రెద రొక్కభంగిన యకటా.''

కోమలత్వ లాలిత్యములకు స్థానములై, సకల సౌభాగ్యములఁ దులఁ దూగుచున్న కౌరవవంశ స్త్రీలకుఁ గలిగిన దుస్థితి నీపద్యములు కన్నుల

లకుఁ గట్టినట్లు వర్ణించుచున్నవి. కొడుకుదుఃఖమును, సుమార్తి స్థితినిఁ, జూచుకొలఁది గాంధారిశోకము హృదయము పట్టరానిదైనది.

"కొడుకుచావుకంటెఁ గోడలియడలున
బెరిగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గల మెరియంగఁ
"దొడఁగె దీని కేదితుది యుపేంద్ర.

హృదయమున వగ లేని యట్టిట్టు నట్టు
దిరుగుచున్నది దుస్సల వరునిశిరము
గాన కీకూఁతు నిమ్మాయిఁ గనుటకంటెఁ
దలఁప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ."

దుస్సల తనభర్తశిరస్సునుగానక, హృదయమున దుఃఖము లేనిదాని వలె నిట్టట్టు తిరుగుచు వెదకుచున్నది. హృదయము శోకముచే సంపూర్ణముగ నిండియున్నప్పుడు బాహ్యముగ దుఃఖము కనఁబడ కుండుటయే సహజము. ఇచట, దుస్సలయందు నట్లి, యవధిని దాటిన శోకోద్వేగ స్వరూపము చిత్రితమైయున్నది.

అభిమన్యు కళేబరముపైఁబడి దుఃఖించు నుత్తర దీనావస్థను గాంచి, గాంధారి విలపించుటలో నెంతయు నౌచిత్యముగలదు. కురువృద్ధయు నుత్కట శోకవిదూనమానసయునగు గాంధారికంటె సుత్తరా సుభద్రల యావేదన నెఱుంగఁగలవా రెవ్వరు.

"పాడిమాలి తన్ను బలువురు పొదివినఁ
బోరి తద్ద డప్పిఁగూరి నిదుర
పోయెనొకొ సుభద్రపుత్త్రుండు మృత్యువైఁన
 తెలఁ ప వింతయేల గలుగనేర్చు."

"ఉత్తర యిక్కమారోత్తము నురమున
వ్రాలి మోమునఁ దన వదనకమల
మందంద సేర్చుచున్నది మున్ను గన్నంత
మెలఁగంగ నేలిక చెలుల మాటు
గొను సిగ్గుపెంపున వనట నిట్లయ్యె ని
ప్పుడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియుని
గనుఁగొని బిగియారఁ గౌఁగిలించుచు శిర
మూరుతలంబున నునిచి పాణి

వల్లవంబున నానన మల్లనల్లఁ
దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ
బొడము పెల్లునఁ గన్నీరుఁ దుడిచికొనుచు
నలఁత పెనువెల్లిఁ దేలెడు నంబుజాక్ష."

భగ్నజీవితమగు నుత్తర ముగ్ధస్వరూప మెంతయు స్వాభావికముగ నిందుఁ జిత్రితమైనది. వివాహానంతర ముత్తరాభిమాన్యుల దాంపత్యజీవితము, నుత్తర ముగ్ధప్రవర్తన, యామె భర్త్రనురాగము, నిత్యాదులన్నియు నిందు సుకుమారముగ సూచితములై, యామె ప్రస్తుత శోకభావమున కుత్కర్ష నాపాదించుచున్నవి. తనకత్యంతము ప్రీతిపాత్రమగు బొమ్మ క్రిందఁబడి భగ్నముకాగా, నాశకలములను గూర్చి హృదయమునకుఁ జేర్చికొనుచుఁ, గన్నీరుఁ గురియుచు, మాటిమాటికిఁ దల్లిముఖమును జూచుచున్న బాలికవలె నుత్తర తనజీవితేశ్వరుని మృతదేహమును హృదయమునఁ జేర్చుచుఁ, గన్నీరుఁ గార్చుచు, మాటిమాటికిఁ గృష్ణునిఁ జూచుచున్నది. ఉత్కటశోకభావముతోఁ, గడచిపోయిన యుత్తర లలితశృంగారము నిట్లు స్వభావికమగు విధమున మేళవించి, తిక్కన, కరుణరసమును బోషించినాఁడు. భగ్నజీవిత

యగు నుత్తర ముగ్ధస్వరూపమున కనుగుణముగ, రచనయు లలిత ములగు నల్పతి యలంతి శబ్దముల కూర్పుచే సుకుమారమై, కరుణ రసపోషకమై యొప్పినది.

ఈపర్వమంతయు నిట్టి హృదయవిదారక శోకభూయిష్ఠములైన వర్ణనలతో నిండియున్నది. పాపపరిణామ రూపమగు యుద్ధఫలము ననుభవించుచున్న లోకము, స్త్రీరూపమున భగవంతునిఁగూర్చి మొఱ పెట్టుకొన్న విధమున గాంధారి విలాప మొప్పుచున్నది. సంఘమున జరుగు పాపములకు సంఘమంతయు బాధ్యత వహింపక తప్పదు. దక్షులైన వారు పాపాచరణమునెడ నౌదాసీన్యము వహింటకూడ, పాపమున కొకవిధముగ దోహదకే యగుచున్నది. ఈవిషయముననే కృష్ణుఁడు,

> ''సారపుధర్మమున్ విమలసత్యము పాపముచేత బొంకుచేఁ
> బారముఁబొందలేక చెడబారినదైన యవస్థ దక్షు లె
> వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁగాని ధర్మ ని
> స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవముండెడున్''

అను మాటలలోఁ, బ్రత్యక్షపాపప్రవర్తకులే కాక, పాపమును బ్రతి ఘటింపలేక యుపేక్ష వహించిన దక్షులుకూడ, పాపఫల మనుభవింపక తప్పదని వివరించియున్నాఁడు. కావుననే గాంధారీప్రభృతు లెల్లరును దుర్యోధనకృత పాపఫలము ననుభవింపవలసివచ్చినది. లోకు లీ సత్య మును గుర్తెఱుంగక, నిర్దోషులు బాధఁజెందుటఁ గాంచి, దైవమును దూఱుదురు. అట్లే దుర్యోధనకృత పాపఫల మనుభవించు కురువంశ బాలవృద్ధ తరుణులఁగాంచిన గాంధారి వికలమతియై కృష్ణుని శపించినది. వ్యామోహ మెట్లు వివేకమును నశింపఁజేయునదియు నిందు వ్యక్త మైనది. ద్రౌపదీ పరిభవ సందర్భములఁ దాను వహించిన యుపే క్షయే యిట్లు పరిణమించినదను జ్ఞానమిప్పుడైనను గాంధారికిఁ గలుగ లేదు, తాను స్వయముగా నడ్డుపడి ద్రౌపదిని రక్షింపకపోవుట తన

ధర్మలోపమని, నైతిక దౌర్బల్యమని యామె తెలిసికొనలేక పోయినది. కాని, తత్ఫల మనుభవమునకు వచ్చినప్పుడు మాత్రము దైవమును దూఱినది. అన్నదమ్ముల కుమారులు తమలోఁ దాము కలహించుచుండ, సమర్థుఁడయ్యును, కృష్ణుఁడు మాన్పక యుపేక్షఁ జేసెనని, యతనిని శపించినది. తన తోడి స్త్రీకిఁ, గురుకులవధూమణికిఁ, దన కుమారుల వలనఁ బరిభవము గలుగుచుండ, నుపేక్ష వహించినగాంధారి, యుద్ధమును మాన్పక యుపేక్షించెనని కృష్ణుని నిందించుటలో, నామె వ్యామోహము వ్యక్తమగుచున్నది. వ్యామోహావిష్టమగు లోక స్వభావమే యిట్టిది.

ఇట్లు స్త్రీపర్వమున యుద్ధమువలనఁ గలిగిన లోకానర్థము ప్రత్యక్షముగ, శోకభూయిష్ఠముగ, కరుణరసోత్పాదకముగ వర్ణితమైనది.

# శాంత్యనుశాసనికాశ్వమేధ పర్వములు

౧

కౌరవ పాండవాంగనా జనముల యాక్రందనము లాధారముగ, స్త్రీపర్వమునఁ బోషితమైన నిర్వేదము తదనంతర కథాభాగమున శాంతిగఁ బరిణమించినది. శాంతిరసమునకు నిర్వేదము స్థాయీభావ మగుటచే, శోకాధిష్ఠితమగు స్త్రీపర్వరచనానంతరము శాంత్యనుశాసనిక పర్వముల రచన యెంతయు నుచిత మగుచున్నది. భారతేతివృత్త పరిణామము ననుసరించియు నితివృత్తాధికారి యగు ధర్మజుని జీవితపరిణామము ననుసరించియుఁ గూడ, స్త్రీపర్వానంతర భాగము శాంత్యధిష్ఠిత మగుట సముచితము. యుద్ధపరిణామ ఫలమును ప్రత్యక్షముగ ననుభవించుటవలన, ఖిన్నుఁడై, ప్రజాపాలన విముఖుఁడై యున్న ధర్మజునకుఁ, గృష్ణచోదితుఁడైన భీష్ముఁడు విశిష్ట ధర్మోపదేశముం గావించి, యతని తమస్సును నిర్మూలింపఁజేసి, యతనిని స్వధర్మోన్ముఖుని గావించుట యీ భాగమందలి ప్రధానేతివృత్తము.

సంఘము ధర్మవిముఖమై యుండిన కారణమునఁ, గౌరవు లవాచ్యమగు పాపము నాచరించుటయుఁ, దత్ఫలముగఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యముతోఁ గూడ ననేకులు వీరాధివీరులు నశించుటయు జరిగినది. న్యాయధర్మముల స్మరణ కొంత లోకమునఁ గలిగినది. అట్టి స్థితిలో, ధర్మపరుఁడు, నీతివంతుఁడు, శిష్టాచారగుణసంపన్నుఁడు, ననుభవజ్ఞుఁడు, నిరాసక్తుఁడు, నగు కర్మయోగి, లోకకల్యాణము ప్రయోజనముగ రాజ్యపాలనకుఁ బూనుకొన్నచో, సంఘమున ధర్మము మఱల సుప్రతిష్ఠిత మగుట కవకాశము గలుగును. అట్టి పరిస్థితిని, గలుగఁ జేయుట శ్రీకృష్ణుని యాశయము, ధర్మజుఁడు రాజ్యభారము వహించుచో నీయాశయము సిద్ధింపఁగలదు, కాని, యుద్ధ

ఫలమువలన వికలమనస్కుఁడై, నిర్వేదమునకు లోనై యున్న ధర్మజుఁడు, సంసారవిముఖుఁడుగ నున్నాఁడు.

"ధృతరాష్ట్రుండు దనూజుకీడు సమబుద్ధిం జూడ కన్నిచుఁ డే
గతిఁ జన్నం జననిచ్చెఁ గాని వ గుడంగాఁ దివ్వఁడయ్యెన్ నిరా
కృత శీలుండగు నా సుయోధనుఁడు సంక్షీణంబు సేసెం గులం
బతనిం జంపఁగఁ గోపమాఱె మది శోకాక్రాంతమయ్యెం దుదిన్,

"ఆదుర్జనుండు గర్జం బెఱుంగక దుర్మానంబు వాటించిన సైరించి తాలంగనైతి. రాజ్యపరిగ్రహ పరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషం బత్యంతంబు నాచరింపవలసె. పరిగ్రహ దోషంబు పరిగ్రహ త్యాగంబునంగాని పోదు. పరిగ్రహ త్యాగశీలుండు జన్మ మరణ దుఃఖంబులం బొరయండని శ్రుతులు సెప్పెడు. అపరిగ్రహం బొక్కటన శుద్ధుండ నయ్యెద."

అను, ధర్మజు వాక్యము లతని మానసిక క్షోభనంతయుఁ జక్కగ వ్యక్తపఱచు చున్నవి. అపకారము చేసిన పాపినిఁజంపుటతోఁ గోపము చల్లారినది. కాని, మనస్సు శోకాక్రాంతమైనది. ప్రతిహింసా చరణముచేఁ జిత్తస్వాస్థ్యము లభించుననుట కల్ల. తద్విపరీతమగు ఫలమును గర్త యనుభవింపవలసి వచ్చుననుట, ప్రకృతి సత్యము. Vengeance recoils itself on the perpetrator అను నాంగ్లసూక్తి యీవిషయమునే యుద్ఘోషించుచున్నది. అమానుషమగు పాప మొనర్చిన దుర్యోధన దుశ్శాసనులను జంపుటచేఁ గ్రోధము శాంతించినది; తాత్కాలికమగు తృప్తి కల్గినది. కాని, సకల హిత బంధు వర్గ నాశనముచేఁ గల్గిన శోకవేగ ముత్కటమై, సత్పురుషుఁడగు ధర్మజుని మనస్సును వికలపఱచినది. ఇంతటి పాపమునకును గారణమగు రాజ్యసంపదను, బూర్తిగ విసర్జించుటయే తనకుఁ గర్తవ్యమని ధర్మజుఁడు నిశ్చ

యించినాఁడు. పశ్చాత్తాపమున కిది ముఖ్యలక్షణము. ధర్మజుని మనో వైకల్యము పోవుటకును, మనస్సు ప్రశాంతత నొందుటకును గురూప దేశ మవసరము. అంతియు కాక, విశిష్ట జ్ఞానోపేతుఁడగు కర్మయోగిగ, ధర్మజుఁడు పరివర్తన మొందవలసి యున్నది. ప్రజాపాలనకు జనక మహారాజు వంటి జీవన్ముక్తులే యర్హులని, భారతీయుల యభిప్రాయము. కనుక, ప్రజాపాలన భారమును వహింపఁబోవు ధర్మజునకు, సమగ్రమగు సహితాముష్మిక జ్ఞానము మిక్కిలి యవసరమై యున్నది. ఇట్లు శాంత్యనుశాసనిక పర్వగత మగు విషయ మంతయుఁ బ్రధానేతివృత్త ముతో సమన్వయముఁ బొందుచున్నది. జ్ఞానోపదేశమునం జేసి, స్వధర్మోన్ముఖుఁడైన ధర్మజుఁడు, రాజ్యభారమును వహించి, వ్యాస చోదితుఁడై, లోకహితార్థ మశ్వమేధమును వేదోక్తవిధమున నిర్వ హించి, దేశమునందలి రాజులనెల్లర నేకైక ధర్మశాసన బద్ధులం గావించినాఁడు. అంతియే కాక, నిరాశక్తుఁడై వేదోక్తములగు కర్మల నాచరించుట వలనను, స్వధర్మమును శ్రద్ధతో నిర్వహించుట వలనను గృహస్థుఁడు భవబంధ విమోచనముం బడయఁగలడను విషయము, ధర్మజు నశ్వమేధ వృత్తాంతము మూలమున వ్యక్తీకరింపఁ బడినది. ఈ పర్వమున వర్ణితమైన సక్తుప్రస్థుని వృత్తాంతము స్వధర్మ నిర్వహణ విశిష్టతను నిరూపించుచున్నది.

ఇట్టి విశిష్టమైన స్వధర్మకర్మాచరణమునకు విముఖుఁడై యున్న నాయకుని చిత్తవృత్తివర్ణనతో, నీఘట్ట మారంభ మగుచున్నది.

"జనసంపూజ్య పదారవిందుఁడగు నాచార్యుండు శోకించి వం
దనుచో న్వారయ వేడి పెద్దయు వనుం దానమ్మి యర్థింపఁ జా
వనివానిం గరిచావు బుద్ధినిడి యశ్వత్థామసచ్చెన్ నిజం
బని యేఁబొంకితి మేదినీభరణ మర్హంబే గురుద్రోహికిన్."

"కడిఁదిమగండు కుంభజుఁడు గానఁగ నొడ్డిన మంటవోలె నం
కెడి మొనఁ జూచిచూచి యిది దెప్పరమ న్వగ లేక పంచితిం
గొడుకుఁ జొరంగ నత్తెఱఁగుక్రూరత సైఁప సుభద్రయట్లుఁ గ
వ్వడిక్రియ నేర్తురే యొరులు వల్లభుఁ డేలగునట్టి దుర్వికిన్."

అను ధర్మజుని మాటలవలన, యుద్ధానంతర మతని మన సెట్టి పరివర్తనముఁ జెందియున్నదియు వ్యక్తమగుచున్నది. యుద్ధమధ్యమున ననతిక్రమణీయములగు విపత్కాలములలో, నత డొనర్చిన దుష్కార్యముల స్మృతి యతనికి మనోవైకల్యమును గలిగించినది. సజ్జనుల చిత్తము లొక్కప్పుడు వజ్రసన్నిభములైనను, స్వాభావికముగ నవి కుసుమ కోమలములై యుండును. ధర్మజుఁడు సజ్జనుఁడగుటచే, తా నాత్మవిమర్శఁ గావించుకొని, ద్రోణాభిమన్యుల యధర్మహననమునకుఁ దానే బాధ్యుఁడని నిశ్చయించినాఁడు. కనుకనే, యధర్మప్రవర్తకుఁడైన తనయట్టివాఁడు రాజ్యమునందు ధర్మము నెట్లు పాలింపఁగలఁడని సంకోచించుచున్నాఁడు. చిత్తమునకుఁ బ్రశాంతత లభించుటకుముం దిట్టి హృదయ సంక్షోభ మావశ్యకము. రాజ్యపాలనార్హత విషయమున వ్యాసుని యాశయ మెంతటి యుదాత్తమైనదియుఁ గూడ, నిందుమూలమున విదితమగుచున్నది. శ్రీకృష్ణ వేదవ్యాసాదుల యుపదేశ కారణమున ధర్మజుని మనస్సు నాక్రమించిన తమస్సు నిరస్తమైనది; చిత్తమీశ్వరాయత్తమైనది.

"మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు
న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాపమొం
దునొకొ కుఠారమున్ జనులు దోసముఁ బొందరు కర్తయీశ్వరుం
డనియెడు నిశ్చయంబు దృఢమై మదినిల్చినఁ జాలు భూవరా."

"కర్మఫలం బీశ్వరుని యదియు. తదర్పణ బుద్ధి సహితంబుగాఁ
బ్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు."

గను పరాశరాత్మజుని వాక్యముల పరమార్థము ధర్మజునిచే గృహీత మినది. అహంకార మమకారములుఁ రాగమోహములు త్యక్తములు గాగా, మనస్సు కుదుటఁబడినది. కనుకనే ఆత్మజిజ్ఞాస ధర్మజునియం ఉదయించినది.

భవ్య ధ్యాననిరూఢతనున్న కృష్ణునిం గాంచి, ధర్మజుఁ డతని రూపించి.

"పంచాత్మకంబైన పవనంబు నిగృహీత
మైనది భవ దింద్రియములు మనసు
నం దాగఁబడ్డవి యవియును నదియును
బుద్ధియం దొదిగించి శుద్ధమైన
నాలవతెరవున లోలతా రహితముల్
గాఁగ నిన్నియును సంకలితములుగ
నంచితక్షేత్రజ్ఞునందుఁ గూర్చినవాఁడ
వీ పరమధ్యాన మేమికతన

నొలసెనొకో లోకములకు నొండొక్క వింత
లేక నెమ్మది యున్నదియే కరంబు
విస్మయముఁబొందె నామది వినఁగ నర్హ
మేని వినిపింపవే నాకుని త్తెఱంగు."

ప్రార్థించినాఁడు. ఇట్లు యోగనిష్ఠయం దాసక్తియు, పరతత్త్వము పఁ జిజ్ఞాసయు, ధర్మజునకుఁ గలుగుటచే నతఁడు గురూపదేశమును దుటకుఁ దగిన స్థితియందున్నాఁడు. కనుక శాంత్యనుశాసనిక గతమగు నాధ్యాత్మిక తత్త్వ ప్రకృతి రహస్యాదులన్నియు, ఁ గర్మయోగి నొనర్చుట కుపకరించినవి.

మఱియు, కథానాయకులగు పాండవుల జీవితమందలి చరమదశ ప్రశాంతతనొందుట యత్యవసరము. నాయకముఖ్యుఁడు, ఫలాధికారియునగు ధర్మజుని సశరీర స్వర్గప్రాప్తికిఁ బూర్వ మతనిచిత్తము శాంతి ప్రధానము గావలసియున్నది. ధర్మజుని విషయమున నొక వేదాంతార్థము కూడ స్ఫురించుచున్నది. పూర్వజన్మ సంచితమగు సంస్కార కారణమున, సత్యనిష్ఠ, ధర్మపరత్వ, దైవభక్త్యాదులఁ గల్గి, వాని సహాయమున నింద్రియాదులను క్రమమున వశపఱచుకొని, రాగద్వేషాదులనడంచి, తనధర్మమును నిర్వహించినవాఁడు ధర్మజుఁడు. క్షత్రియోచితమగు యుద్ధనిర్వహణమునందు రాజసము నవలంబించి విజృంభించినను, యుద్ధాంతమున మరల సహజ స్వభావమగు ప్రశాంతతను బొందుట యతని ప్రకృతి కుచితమైనది.

"నిసర్గసౌమ్యమేవ బ్రాహ్మం జ్యోతిః కుతోఽపి కారణా
త్ప్రాప్తవికారమపి పునః స్వభావమే వావతిష్ఠతే."
"కల్పాంత వాత సంక్షోభ లంఘితాశేషభూభృతః
స్థైర్య ప్రసాద మర్యాదా స్తాఏవహి మహోదధేః."

కల్పాంతమున మహావాయు సంక్షోభచే నుప్పొంగి, సమస్తపర్వతముల నతిక్రమించిన దయ్యును, మహోదధి, మరల శాంతమునుబొందిఁ మేర మీఱక నిలుచువిధమున, స్వభావముచే సౌమ్యమగు బ్రాహ్మజ్యోతి కారణాంతరమున రాజసాది వికారమును బొందినదయ్యును మరల తన సహజ స్వభావమగు సౌమ్యమునే పొందును.

మాయా సంసర్గముచే సాంసారిక బంధములం జిక్కిన పురుషుఁడు (జీవుఁడు) సంస్కార ప్రాబల్యమున నింద్రియాదుల నరికట్టి, విష్ణుభక్తి నాలంబముగఁ గొని,వివేకాది సాధనసంపత్తిచేనరిషడ్వర్గాదులజయించి, గురూపదేశముచే జ్ఞానియై, ఆత్మసాక్షాత్కారముఁగాంచి, జీవన్ముక్తుఁ

డగునను వేదాంతార్థమును ధర్మజునివిషయమున సమన్వయింప వీలగుచున్నది. మోహావిలసితుఁడై ధర్మజుఁడు ద్యూతమున మొదట ప్రవర్తించియు, పిమ్మట నరణ్యవాస తపోనియమాదులచేఁబూర్వసంస్కారస్మృతిఁగాంచి, యింద్రియముల నడంచి, శ్రీకృష్ణు నాలంబముగఁగొని, భీమార్జునాదిసహాయ (సాధన) సంపత్తిచే, దుర్యోధనాది శత్రువర్గమును (అరిషడ్వర్గమును) జయించి, భీష్మగురూపదేశముచే జ్ఞానియై, యాత్మసాక్షాత్కారముంగాంచి, తుది సశరీరస్వర్గప్రాప్తియను జీవన్ముక్తి నతఁడు గాంచుట పైనుదహరించిన వేదాంతార్థముతో సమన్వయించుచున్నది. ఆత్మసాక్షాత్కార ప్రతిపాదకమగు శాంత్యనుశాసనిక పర్వముల రచన యీ యంతరార్థపోషణకుఁ దగియున్నది.

ఈవిశిష్టమగు నాధ్యాత్మిక తత్త్వమును బ్రతిపాదించుటలో వ్యాసుఁడవలంబించిన విధానమును విశిష్టముగనున్నది. దివ్యాంశసంభూతుఁడును, నింద్రియవిజయియు మనోవాక్కర్మలయందు సంయమియు, జ్ఞానియునై, జీవితమును గడపి, వీరోచితమగు ధర్మయుద్ధమున ఫలాపేక్షలేక వర్తించి, తుదిఁ, బ్రశాంతుఁడై, యుత్తరాయణము నెదురు సూచుచు, నంపశయ్యపై, నిష్ఠయందున్న భీష్ముఁ డుపదేష్ట. ప్రాపంచికకష్టసుఖాద్యనుభవము కలవాఁడు, ధర్మపరుఁడు, నాత్మవిమర్శజాత పశ్చాత్తాపఖిన్నుఁడు, వీతరాగుఁడు, జిజ్ఞాసువు నగు ధర్మజుఁడు శ్రోత, బోధ్యమగు విషయము శాంతిప్రదాయకమగు నాధ్యాత్మికము. ఇట్టి విశిష్ట పరిస్థితి కనుగుణముగ తిక్కన రచనయందును బ్రశాంతతా గాంభీర్యములు నెలకొన్నవి. భావోద్వేగ వర్ణనాముల విసర్జించి, తిక్కన కూడ సంయమియై రచనకుఁగడంగినాఁడు.

విరాటపర్వ యుద్ధపర్వ, స్త్రీపర్వములను రచించుటలోఁ దిక్కన యవలంబించినది కావ్యవిధానము. తత్తద్ఘట్టములయందలి వర్ణనీయ

విషయ వైవిధ్యమును, పాత్రల శీలస్వభావ వైలక్ష్యమును, పాత్ర రస భేదములను, ననుసరించి, తిక్కన తన రచనావిధానము నుచితరీతిని మార్చి యుండుటచే, నితివృత్త మాదినుండి తుదివరకును నసాధారణ మగు చైతన్యముతో నొప్పుచున్నది. శాంత్యనుశాసనిక పర్వములందలి విషయము నీతిశాస్త్ర ధర్మశాస్త్ర సంబంధియు, వేదాంత గతాధ్యాత్మిక సంబంధియు నగుటచే, తిక్కన రచనా విధానమును నద్దాని కుచితముగ మారినది. విపుల ప్రపంచానుభవము, విశిష్ట లౌకికాలౌకిక జ్ఞానముఁ గల్గి, జితేంద్రియత్వ యోగనిష్ఠాదుల వలన నాత్మ సాక్షాత్కారముం గాంచి, బ్రహ్మానందముం బొందిన గురుఁడు, ఇహలోక విముఁఖుడు, పరిణత మనస్కుఁడు, భక్తుఁడు, ముముక్షువు, నగు శిష్యున కుపదేశించు విధమున నీ పర్వములు రచితములైనవి. భావావేశ భావోద్వేగముల కందేమాత్రమును ప్రశక్తి లేదు. కావ్య సంబంధములగు నర్థవైచిత్రి, శబ్ద చమత్కారాదులకుఁ గాని, ధ్వన్యలంకార వక్రోక్త్యాదులకుఁ గాని, యిందుఁ బ్రవేశము లేదు. అర్థమే యిందుఁ బ్రధానమగుటచే, దిక్కన సమాసములను, గఠినములగు శబ్దములను, బూర్తిగఁ బరిహరించి, రచనకు సారళ్యము నాపాదించినాఁడు రాజనీత్యాదులను, వివిధ ధర్మములను, బోధించుచో నుచితములగు నుదాహరణములు, నుపాఖ్యానములు, నర్థసిద్ధికై వివరింపఁ బడినవి. ఇట్లు ప్రసక్తములైన యుపాఖ్యానములను వివరించుటలోఁ దిక్కన కావ్య ప్రబంధాది విధానము కాక, పౌరాణిక మార్గము ననుసరించినాఁడు. దురవగాహములగు వేదాంత శాస్త్రార్థములు, నాధ్యాత్మిక విషయములు నతి సులభమగు శైలిలో, లోకసాధారణములగు చక్కని దృష్టాంతముల సాహాయ్యమున వివరింపఁ బడి యుండుట, యీ పర్వముల రచనయందు గానవగు వైశిష్ట్యము. ఈ ఘట్టములందలి శైలి, సమతలమునఁ బ్రవహించు గభీర ప్రశాంతమగు గంగాస్రవంతినిఁ బోలి యున్నది.

కథా కథన సందర్భమున, యుద్ధప్రశంస వచ్చిన సందర్భమునఁ దిక్కన యవలంబించిన విధానము ముఖ్యముగ గమనింపఁ దగినది. భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావం బెఱిగించుచు, నీశ్వరుని రౌద్రము నీ క్రింది విధమున వర్ణించియున్నాఁడు.

"కమలాసనుం డిచ్చిన యయ్యసిఁ గైకొని, విజృంభించి,
"హరుఁడు బెట్టుగనవ్వి పెల్లార్చుటయును
విని సముద్ధత రయమున దనుజకోటి
మునుగఁ బఱతెంచి తాకిన మునుకొని వ
ధించి యిలయెల్ల నెత్తుట ముంచె నతఁడు."

దైత్యుల నిట్లు గీటడంచి, ధర్మమునిల్పి, ప్రసన్నరూపుఁడై, యప్పరమ కారుణికుండు, త్రిలోకరక్షణౌదాత్త్యమునన్ వెలుంగు హరిం బిలిచి, యమ్మహనీయ ఖడ్గము నతని కిచ్చినాఁడు.

రుద్రుని దనుజసంహార విజృంభణము నంతను "బెట్టుగనవ్వి పెల్లార్చి, యిలయెల్ల నెత్తుటముంచె నతఁడు." అను నాల్గు పొడి మాటలలోఁ దేల్చివేసి, తిక్కన, వర్ణనీయ విషయమును వ్యంగ్య పఱచినాఁడు. పరశురాముఁడు కార్తవీర్యార్జునాది హైహయులను జంపుటయును, నిట్లే యొక్క పద్యముననే వర్ణితమైనది.

"రాముం డుద్ధత రోషపావక శిఖాప్రస్ఫీతుఁడై తున్మదున్
భూమీశాలిఁ గుఠారధార నని విస్ఫూర్జద్గతిన్ హైహయ
స్తోమంబాదిగఁ జొచ్చి రాజకులముం దున్మాడి చేసెం సము
ద్దామ క్రీడను రౌద్ర మొప్ప నిల రక్తస్యంద సంసిక్తగన్."

ప్రశాంత చిత్తముతో నిర్యాణ సమయమును బ్రతీక్షించుచున్న భీష్ము నిచే శాంతిరస ప్రధానమగు విషయమును జెప్పించుటలోఁ గవియు

నెంతటి సంయమనమును వహించి యున్నాఁడో యిందు వ్యక్తమగు చున్నది.

అశ్వమేధ పర్వమందలి యుద్ధభాగమును రచించుటయందును దిక్కన యిట్టి సంయమమునే వహించి యున్నాఁడు.

భగదత్త తనయుఁడగు వజ్రదత్తుఁడు, బాహుగర్వంబునను, బాల్య సిద్ధంబగు లౌల్యంబునను, నశ్వరక్షకుండగు నర్జునునిం దాకి, యతనిపై తోమరంబు లనేకంబు లడరింపఁగా, నర్జునుఁడు.

"అనల శిఖలువోని యమ్ములగమి వాని
రూపుమాపి యన్నరుండు వాఁడి
లేని దొడ్డతూపు లేనింటఁ దొడ్డి రాచ
కొడుకునేసెఁ దూలి పుడమిఁ గూల."

అట్లే, సింధుదేశాధీశు లర్జునుని సాంత్వన వాక్యముల సరకుఁగొనక యతనిపై విజృంభింపఁగా,

"వవ్వఁచు నానా శరముల
నవ్వీరులఁ బొలియఁజేయ నంతయువిని తా
నెవ్వగతోఁ దుశ్శల యా
కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్,"

"వచ్చి, కన్నీళ్లులు వదనంబుపై వెల్లిగొన రోదనంబుసేసిన, నతెండు దయ నిలనిడియె కోదండము."

జరాసంధుని పౌత్రుఁడను నతనిమాటఁ బాటింపక, విజృంభించి యుజ్జ్వల శరావళులఁ బఱఁగింపఁగా,

--వానినె

ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద
త్తను వొకబాణమేనియును దాఁకఁగ సేయ నరేశ్వరోత్తమా."

ఆసహా దేవపుత్రుఁ గాత్రంబు దాఁకకుండునట్లుగా శరంబులు నిగిడించి, యతని యాటోప మడఁగించి, యతని ననునయించినాఁడు. అట్లే శకుని కుమారుఁడు వచ్చి, తన్నుఁ దాకినప్పు డర్జునుఁడు,

"రాజులఁ జంపకుమని మా
రా జానతియిచ్చె నుద్ధురత నే నని న
య్యోజవిడిచినతైనఁ బ
రాజితుఁగా నన్ను నద్ధరాపతి దలఁచుఁ."

అని ధర్మజునభిప్రాయమును వెలిబుచ్చినాఁడు. విధాయక మగు యజ్ఞ కర్మను విఘ్నము లేక జరుపుటయే ధర్మార్జునుల యాశయనుగుటచే, యుద్ధమున, రాజసముకంటె సాత్త్వికమే ప్రధానముగఁ బోషితమైనది. విజృంభణ మర్జునుని యుద్ధము నందును లేదు, తిక్కన శైలియందును లేదు.

భారత యుద్ధారంభముననే యర్జునుఁడు గురు బంధు మిత్రాదుల హింసకు విముఖతను జూపినాఁడు. యుద్ధఫలానుభవమువల్లను, భీష్మ కృష్ణుల యుపదేశములవల్లను, ప్రబోధముం గాంచిన యర్జునుఁడీ యజ్ఞాశ్వరక్షణ కర్తవ్యమున నిట్టి సాత్త్వికవిధాన మవలంబించు టెంతయు నుచితమైయున్నది. తదనుసరణముగ తిక్కన రచన యందును సౌమ్యభావమే నెలకొన్నది.

తిక్కన కవితా సరస్వతీస్రవంతి శాంత్యనుశాసనికములందు, సాత్త్విక రూపమునఁ బ్రత్యక్షముగఁ బ్రవహించియు, నశ్వమేధ పర్వగత యుద్ధఘట్టమున నంతర్వాహినిగ నిగూఢయయ్యు వెలసినది.

"ఇంద్రియంబులు దమయిచ్చ నట్టునిట్టుఁ
దిరిగెనేనియు దుఃఖముల్ దెచ్చునవియ

కట్టువడి సుఖ మొనరించుఁ గాన యాత్మఁ
గావవలయు నింద్రియ చోరగణమువలన."

అను తిక్కన పద్యభావ మతఁడు శాంత్యాది పర్వములలో నవలం
బించిన శైలివిషయమునఁ గూడ సమన్వయమును బొందుచున్నది.
ఇంద్రియముల నడఁగించుటచే నాత్మ విశుద్ధముగఁ బ్రకాశిత
మగునట్లు, అలంకారాదుల నుజ్జగించుటవలన శాస్త్రార్థము చక్కఁగఁ
బ్రకాశితమగును. శాంత్యనుశాసనిక పర్వరచనయందుఁ దిక్కన
యనుసరించిన విధానము నిట్టిదియే.

రసాస్వాదనచేఁగల్గు నార్ద్రతా తన్మయత్వములును, విశిష్టార్థ
స్ఫూర్తి, వక్రోక్తి, చమత్కారాదులవలనఁ గలుగు హృదయాహ్లాద
చిత్తవికాసాదులును, గావ్యమునఁ బ్రధానములు. కనుక, రసధ్వని
గావ్యజీవముగను, నలంకార వక్రోక్త్యాదులు, తత్పోషకములుగను
బరిగణింపఁబడుచున్నవి. వాచ్యార్థము కంటెను లక్ష్యార్థ వ్యంగ్యార్థ
ములకుఁ గావ్యములందు, బ్రాధాన్యమెక్కువ. అంతరింద్రియములకుఁ
గూడ తృప్తినిఁ గల్గించుచు, నందును ముఖ్యముగ, మనస్సునకు
నాహ్లాదమును గూర్చుచు, స్థాయీభావ పోషకములగుచు రసోదయ
మునకు సాహాయ్యకములగు నలంకారాదులకుఁ గావ్యమునఁ బ్రయో
జనముగలదు. ఇందు, వర్ణనీయ విషయమునకంటెను వర్ణనావిధానమున
కెక్కువప్రధాన్యమున్నది. కనుకనే, లక్షణావ్యంజన శక్తులును, నలం
కారములును, భావపోషకములగు నితర చమత్కారములును, బహు
ముగ నుపయుక్తము లగుచున్నవి. శాస్త్రములు పదార్థ ప్రధానము
లగుటచే రచన విషయమునఁ గావ్యములకంటె భిన్నములగును. కనుక
నందు వాచ్యార్థము ప్రాధాన్యము వహించుచున్నది. ధ్వన్యలం
కారాముల ప్రాబల్యమువలన, వాచ్యార్థ మప్రధానమగుటయుఁ,

ప్రకృతార్థముకంటె నప్రకృతార్థమే చిత్తవికాస హేతువగుటయు, గావ్యములం దాదరణీయములు, అలంకారాదులు వర్ణనీయమగు ప్రకృతవిషయమునుండి, యప్రకృతములపైకి మనస్సునాకర్షించి, చిత్తవికాసమును గలిగించును. వస్తుజ్ఞాన ప్రధానములగు శాస్త్రములందీ విధానము చెల్లదు. విషయము ప్రధానమగుటచే నిందుఁ బ్రకృతార్థము ప్రచ్ఛన్నమగుటకుఁగాని, యప్రధానమగుటకుఁగాని వీలులేదు. అట్లగుచో శాస్త్రప్రయోజనమే సిద్ధించదు. కనుక శాస్త్రములం దలంకారాదులకును, నితర శబ్దార్థ చమత్కారములకును బ్రసక్తి కలుగదు. విషయజ్ఞానము కలుగుటకు సాహాయ్యములుగ లోకన్యాయములును, బ్రకృతి సిద్ధములగు నుదాహరణములును నిందు గ్రాహ్యములగుచున్నవి. ఐనను, నవి యర్థపోషకములుమాత్రమే యగును కాని, ప్రాధాన్యమును వహింపవు. కనుక ప్రయోజన వైవిధ్య కారణమున, శాస్త్రరచనావిధానము కావ్యరచనా విధానము కంటెను భిన్నమగుచున్నది. అధ్యాత్మ శాస్త్ర సంబంధములగు నీపర్వములను రచించుటలోఁ దిక్కన యీ విశిష్టమార్గము ననుసరించినాఁడు.

"ప్రకృతిదోఁ జెఁగి తన్నుఁ బరికించు జీవుండు
పరముఁ గాంచునపుడు ప్రకృతి సగుణ
తా నిరూఢి యడఁగి తన్మయత్వము నొంది
జీవకేవలత్వ సిద్ధి నొలయు."

"విను కేవలుఁడగు జీవుఁడు
దనుఁ బరముంగాఁగఁ జూచి త ల్లీనత్వం
బున వెలుఁగునది నిరామయ
మనంతమగు పదముసూవె యతులవివేకా."

విద్యావిద్యల నిరూపణ సందర్భమందలి యీపద్యములు కేవలము నర్థగౌరవ ప్రధానములై, శబ్దార్థ చమత్కార విరహితములై, శుద్ధసాత్త్విక రూపమున నొప్పుచున్నవి.

"ఉదిత సమగ్రబోధుఁడగు యోగికి నిశ్చల దీపరూప సం
పద సుఖసుప్త భంగి ఘనపంక్తులు లేని వియత్తలంబు నొ
ప్పిద మొదవుం దరంగములవెల్లునఁ దాఁ జలితంబుగాని వా
ర్ధిదశ నతం డకంప్యుఁడగు ధీపరివృత్తులు గల్గెనేనియున్."

నివాత నిష్కంపమగు దీపజ్వాలకుఁగల నిశ్చలత్వము, సుఖనిద్ర నున్న వాని ప్రశాంతత, మేఘరహితమైన యంబర వినిర్మలత్వము, తరంగ రహితమగు మహోదధి ప్రసాదస్థితి, -- యివి యంతర్ముఖుఁడై, ఆత్మ సాక్షాత్కార జన్యమగు బ్రహ్మానందమున లీనుఁడై యున్న మహాయోగి లక్షణములు.

"అవృష్టి సంరంభ మివాంబువాహమ్
అపామివాధార మనుత్తరంగమ్
అంతశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాత నిష్కంప మివ ప్రదీపమ్."

అను కాళిదాసు రచన యిందుఁ జక్కగ సమన్వయించుచున్నది. తిక్కనయారచన, నిశ్చల,ప్రశాంత,స్వచ్ఛతా, లక్షణముల నొప్పుచు, వేద వాఙ్మయమువలెఁ దేజోమయరూపమున భాసించుచున్నది.

క్షత్రియోచిత ధర్మమగు యుద్ధమును నిర్వహించియు, రాజ్యపాలన మొల్లక, తపోవన గమనమును గాంక్షించుచున్న ధర్మజునుద్దేశించి భీమార్జునులు పల్కిన వాక్యములు హేతుబద్ధములై, ప్రకృతార్థము నెట్లు ప్రకాశింపఁ జేయుచున్నదియు గమనింతము.

"పనివడి త్రవ్వి కూపమునందు నుదకంబు
పానంబు సేయని వాని భంగి
యాకొని యొడఁగూర్చి యన్నంబు తళియకు
వచ్చినఁ గుడువని వాని భంగి
యున్నత తరు వెక్కి జున్ను సేకుఱఁగొని
తేనియ యానని వాని భంగి
తమకించి యొకభంగిఁ దన వశంబుగఁ జేసి
మానినిఁ గవయని వాని భంగిఁ

గాదె కురువరేణ్య ఘన శక్తి శౌర్యసం
పన్నులైన పగఱ భండనమున
నోర్చి పూజ్య రాజ్య మొల్లక యడవికి
నేఁగు టీవ యెఱుఁగు దిత్తెఱంగు."

"కేవల నిష్కర్మత మో
క్షావహ మగునేని గిరులు నవనీజములున్
భూవర ముక్తిం బడయం
గావలదె యడవి నునికి కైవల్యదమే."

ఘనశక్తి శౌర్య సంపన్నులైన శత్రువులను మహాప్రయత్నము చేసి నిర్జించి, కార్యసిద్ధియైన యనంతరము రాజ్యానుభవ మొల్లకుండుట యెట్లవివేకమో, యర్థవత్తరములగు లోక దృష్టాంతములచే సమర్థింపఁ బడినది.

రాజధర్మమగు దండనీతి నర్జునుఁడు ధర్మజునకు వివరించుచు, హింసారహితమైన జీవిత మెవ్వరికిని సాధ్యము కాదని నిరూపించు టయు, నిట్లే యర్థ ప్రధానమై యున్నది.

"కాయలఁ బండ్ల నీళులను గల్గవె సూక్ష్మపుజంతువుల్ మునుల్
సేయరె హింస వాని నుపజీవితఁ ద్రవ్వరె కందమూలముల్
నీయెడఁ జూడు ప్రాణములు నిల్వఁగనేర వహింస నేరికిన్
వేయునునేల భక్ష్యముగ వేధ విధింపఁడె ప్రాణిఁ ప్రాణికిన్."

కృష్ణద్వైపాయనుఁడు ధర్మజున కపాత్ర పురుషుల నెఱిఁగించు విధానమును, నిట్టి యర్థప్రధానమగు నుదాహరణ మగుచున్నది.

"పునుకఁ గుక్కతిత్తిఁ బోసిన పాలు నీ
కృధికనిందఁ బొరయునట్లు దుష్ట
మైన పాత్ర విషయమగు నీగి వృథపోవు
నిచ్చుచోటఁ బాత్ర మెఱుఁగవలయు."

"మందునకు బిడ్డనిచ్చిన చంద మొందు
బూదిలో నేయి వేల్చుటఁ బోలు నోటి
కడవనీళ్లులు వెట్టిన కరణియగు న
పాత్రజనులకుఁ బెట్టుట పౌరవేంద్ర."

ఇట్లే పరబ్రహ్మప్రాప్తి సాధన ప్రకారమును వివరించు పద్యముల రచనయందును సారళ్యము విశిష్టత వహించినది.

"వినయము విద్యయుం గలుగు విప్రుని యందును గోవునందు నొ
ప్పు నెఱయు హస్తియందు నొకపోకకుఁ బోవని కుక్కయందు దా
ని నడిచి తెచ్చి వండి తిను నీచపు మాలనియందుఁ దుల్యద
ర్శనులు దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్."

ఇందుత్తమాధమ జీవుల నుదాహరించుచుఁ దిక్కన పాటించిన క్రమమును, నుపయోగించిన విశేషణములును ముఖ్యముగ గమనింపఁ

దగినవి. ఆధ్యాత్మిక విషయములను వివరించుటలోఁ దిక్కన యనుస రించిన విధానమును, నిట్లే విశిష్టమైయున్నది.

"పాలకడవ పెక్కుపసులలో డించిన
యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండు నట్లు లోన నునిచిన మనసు నే
మఱక యాత్మ వెదకు తెఱఁగు మేలు."

నిగూఢము, క్లిష్టము నగు వేదాంతార్థము లీ పర్వములయందు సులభ గ్రాహ్యమగు విధమున, సరళమగు శైలిలో వివరింపఁ బడినవి. బహుళ వ్యాప్తినందిన తేలిక తెలుఁగుమాటలను ప్రయోగించి, పారి భాషిక పదజాలముచే నర్థము మరుగుపడని విధమున, నెల్లర యను భవమునకును వచ్చిన లోకన్యాయముల సహాయమున నన్వయ క్లేశము, లేని చిన్న చిన్న వాక్యములలో, నీతిశాస్త్ర ధర్మశాస్త్ర వేదాంత శాస్త్ర విజ్ఞాన సర్వస్వసారమునంతను, సామాన్యులకుఁ గూడ సుగమ మగు రీతిఁ, దిక్కన వివరించి యున్నాఁడు. ఆర్యసారస్వతమున భారత మునకుఁగల విశిష్ట స్థానమునకు శాంత్యనుశాసనిక పర్వములే ప్రధాన హేతువులగుచున్నవి. భారత రచనాప్రయోజనము గూడనిందే సిద్ధిఁ బొందినది. మహర్షియు, దివ్య జ్ఞానస్వరూపుఁడు నగు, వ్యాసునిచే రచితమైన యీభాగము నవగాహన చేసికొనుటయేకాక, శాస్త్ర జ్ఞానము లేని వారికిఁ గూడ సులభ బోధ్యమగు విధమునఁ, దెనుఁగున రచింపఁగల్గిన, తిక్కన తెనుఁగువారి పాలిఁటి వ్యాసుఁడనుట యతిశ యోక్తి కానేరదు.

పుణ్యపాపములు, ధర్మాధర్మములు. సత్యాసత్యములు, మున్నగు వానికి సంబంధించిన క్లిష్టసమస్యలను బరిష్కరించుపట్ల, తిక్కన యవ లంబించిన రచనావిధానము గమనింపఁదగినది. ఏదిపుణ్యమో, ఏదిధర్మమో, ఏదిపాపమో, సత్యాసత్యముల స్వరూపమెట్టిదో యిద

మిత్థమని నిర్ణయింప వీలులేని పరిస్థితులెన్నియో జీవితమున ననుదిన మేర్పడుచున్నవి.

"ధర్మ మధర్మముభంగి న
ధర్మము ధర్మంబువోలెఁ దనయా తోఁచున్
నిర్మలమతి నరయవలయు
ధార్మికత నకోరువాఁడు దన కేర్పడఁగన్."

శాస్త్రపాండిత్యము, విశిష్టజ్ఞానము లేనివా రిట్టి పరిస్థితులయం దెట్లు నడచుకొనవలసినదియు, భారతమున సూత్రప్రాయముగ, సూటిగ నిర్వచింపఁ బడియున్నది.

బ్రహ్మచర్య, గృహస్థ వానప్రస్థ, సన్న్యాసముల నవలంబించిన వా రనుసరించవలసిన ధర్మము లెట్లు కొన్ని సందర్భములలో, స్థూల దృష్టికిఁ బరస్పరవిరోధములుగఁ గన్పట్టినను, సూక్ష్మముగఁ బరికించుచో నుత్తమ ధర్మములగునో యిందుఁ జక్కగ వివరింపఁబడియున్నవి. వర్ణధర్మ, ఆశ్రమ ధర్మములను భక్తిశ్రద్ధలతో నడపుట ముక్తికిసులభ సాధనమని వివరించుచుఁ, దిక్కన, వర్ణధర్మసమితిఁ గల విశేష సాధారణత్వంబులను సుగమము గావించి యున్నాఁడు. శాంతి పరులై జీవయాత్ర సాగింప నిచ్ఛగించువారికి జ్ఞాన మత్యంతావశ్యకమై యున్నది.

"వినుము ప్రతిగ్రహంబును యాజనంబును
నధ్యాపనమును ధరామరులకుఁ
బ్రజరక్ష నృపునకుఁ బశుపాలనము కృషి
వాణిజ్యము నివి వణిజులకును"

అని యిట్లు వర్ణధర్మములను వేర్వేరఁ బేర్కొని, సర్వవర్ణముల వారికిని సమానములగు నుత్తమ ధర్మములను, వివరించియున్నాఁడు.

... ... సత్య
శౌచంబులును నహింసయు ననసూయయు
శ్రాద్ధంబు నతిథిపూజనము నాత్మ
దారపరతయు సర్వ సాధారణంబు
లనఘ వీనను నిజవృత్తులను సమస్త
జాతులును నిహపర సౌఖ్యసంపదలకు
నాస్పదములగు నింద్యంబు లన్యవిధులు."

ఇట్లే ఆశ్రమధర్మములును తరణోపాయములని వివరింపఁబడియున్నవి.

— "బ్రహ్మచారి గృ
హస్థ వానప్రస్థ యతులు విహిత
కర్మనిష్ఠత సిద్ధిఁగాంతు రాశ్రమచతు
ష్కము జతుష్పర్వి కాఘటితమైన
నిఃశ్రేణి తుదిముట్టునెలవెక్కుటకు నిట్టి
క్రమవర్తనము సుకరంపుమార్గ
ము."

వివిధధర్మముల నవలంబించు వారిలో, తమ తమ ధర్మములపట్ల దురభిమానమును, నన్య ధర్మములయెడ నిరసన భావమును గలుగకుండుటకై, సర్వ ధర్మ సమానత్వము ప్రతిపాదితమైనది.

"విను మనేకవిధంబుల విస్తరిల్లు
ధర్మముల యందొకండును దలఁప నిష్ఫ
లంబులే దాత్మమోక్షావలంబియైన
ధర్మ ముత్తమమండ్రు తత్త్వజ్ఞు లధిప."

అని సర్వోత్తమంబగు ధర్మస్వరూపము వివరింపఁబడినది.

"దురమునఁ గైదువుఁ గొని తను
బొరిగొన నేతెంచునట్టి పురుషుని వేదాం
త రహస్యవేది యయినను
బొరిగొనినను గిల్బిషంబు వొందదు వత్సా."

అని, పాపంబులువోలె నుండియు, దూష్యంబులుగాని విషయములు వివరింపఁబడియున్నవి. సత్యాసత్యంబులతత్త్వమును విశదపఱచిన విధానమును నిట్లే విశిష్టమైయున్నది.

"సత్యంబు పలుకుట సర్వధర్మములకు
మిక్కిలి యనృతంబు మేటిపాత
కము తద్విశేషంబుగలదు చెప్పెద నొరు
నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచు పాతకులతో సూనృతంబాడుట
పాపంబు బొంకులు వలికి యట్టి
వారి హింసించుట వరధర్మ మిదిరొక్కఁ
డేల భూతములకు హితము సేయు

బొంకులెల్లను ధర్మముల్ భూతబాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము
భూతముల దుష్ట శిష్టత్వములు వివేక
సూక్ష్మతావేద్యములు వానిఁ జూడవలయు."

ప్రాణిహితముఁగోరి పల్కినవెల్లను సత్యములనియు, భూతహితము పరమ ధర్మమనియు నిం దుద్ఘోషితమైయున్నది. సర్వ మతములకును నిదియే మూలసూత్రము.

కర్మాచరణ విషయమున విద్యావంతులగు వారికిఁగూడ కలుగు సందేహములను, దిక్కన, యిందు సులభ గ్రాహ్యమగు విధమునఁ బరిష్కృతి మొనర్చి, సుకరమగు ననుష్ఠాన మార్గమును దెలిపి యున్నాఁడు.

"వేదంబు గర్మంబుల నాచరించుటయుం బరిత్యజించుటయుం జెప్పు. ఇవ్విధఁబులు పరస్పర విరుద్ధంబులై యున్నయవి. ఇందెద్దాన నెట్టిగతి సిద్ధించు నేర్పడ నెఱింగింపవే యనుటకు;—

"విను ప్రవృత్తి కర్మ మనఘ ని
ష్కర్మ మరయ బంధకంబు మోక్ష
ణంబు నగుట బోధసత్వసంపన్నులు
సారరు కర్మ తంత్ర కరణమునకు"

"కొందఱు కర్మకరణ మభి
నందింతురు వారలకు జనన మరణములం
బొందక పోరాదు మహా
నందముఁ బొందుదురు నిత్య నైష్కర్మ్య పరుల్."

"చిత్తశుద్ధిమాత్రఁ జేసెనేనియు నవి
ద్యాత్మకంబ చూవె యరయ, గర్మ
మదిదొఱంగు టంచితాత్మ విద్యాత్మక
ధర్మ మదియ మోక్షదంబు సుమ్ము."

అని కర్మాచరణముం గూర్చిన ధర్మసూక్ష్మమును జిజ్ఞాసులగువారి కెఱింగించి,

"ఫలములు గోరక కర్మం
బులు నడుపుచు వాని విమలబోధాగ్ని హుతిం

బొలియించుచు నిర్ద్వంద్వత
నెలకొను నేకాంతిజనులు నిను గంద్రు హరీ.''

అని, యాచరణ సులభమగు కర్మసిద్ధాంతమును సూత్రప్రాయముగఁ దిక్కన, నిర్వచించినాఁడు.

సంసారము నాశ్రయించియున్న సామాన్యజనులెల్లఱకును నాచరణ యోగ్యములైన తరణోపాయములును నిట్లే సులభబోధ్యమగు రీతి వివరింపఁ బడినది.

''జనులకుఁ గీడురోయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జన గురు పూజనంబులును సత్య హితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరి దయార్ద్రతయుం గలట్టి వా
రనిమిషలోక గాములని యాత్మ నెఱుంగుము మేనకాత్మజా.''

''పరుసనిపల్కు బొంకులగు పల్కులు నన్య ధనాభిలాషముం
బరవనితావిలోలతయు బాంధవ సజ్జన విప్రియంబు దు
శ్చరితుల తోడి మైత్రియును సంతత ధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేగెడివారి చిహ్నముల్.''

వివిధ ధర్మశాస్త్రముల యందుఁ జర్చింపఁబడిన విశిష్టార్థములన్నియు నిట్లు సర్వజన గ్రాహ్యమగు విధమున, సిద్ధాంతరూపమున నాంధ్రభారతమునఁ బ్రతిపాదితములై యున్నవి. ఈ విషయముల వైశిష్ట్యముం బట్టియే యాంధ్ర భారతము విజ్ఞానవ్యాప్తి కుత్కృష్టసాధనమై వెలసినది.

# ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థాన, స్వర్గారోహణములు

గురూపదేశమున విశిష్టజ్ఞాన సంపన్నుఁడై ధర్మజుఁడు ధర్మసింహా సన మధిష్ఠించి, రాజ్యపాలనముఁ గావించిన విధాన మాశ్రమవాస పర్వ పూర్వభాగమున వర్ణితమైనది. రాజుల నెల్లర ధర్మశాసన బద్ధులం గావించి, ప్రజా రంజకముగ, ముప్పదియైదు సంవత్సరముల కాల మతఁ డవిచ్ఛిన్నముగ, సత్య, న్యాయ, ధర్మములను పాలించినాఁడు. గాంధారీ ధృతరాష్ట్రాదుల జీవితవిధానము, వారియెడఁ పాండవుల వర్తనము. నిత్యాది వృత్తములన్నియు, నీభాగముననే కలవు. ఆశ్రమ వాసపర్వోత్తర భాగమున వర్ణితమైన ధృతరాష్ట్రాదుల యాశ్రమ గమన నిర్యాణాదులు, నాయకేతివృత్తపుఁ జరమదశకుఁ బ్రస్తావనగ నొప్పినవి. ధర్మజాదుల కిహలోక కాంక్ష యిదివరకే నశించినది. ఐనను. యుద్ధమువలనఁ గల్గిన శోక నిర్వేదములు నాయకులగు పాండ వుల హృదయములం దంతర్వాహినులవలెఁ బ్రవహించుచు, వారి తదనంతర జీవితములందు మాటిమాటికిఁ బ్రత్యక్షము లగుచునే యున్నవి; ఆశ్రమవాస కథాభాగ మేతద్విషయ ప్రాధాన్యమైనది.

వ్యాసునితో ధృతరాష్ట్రు నాశ్రమమునకు వచ్చిన పాండవులు గృహోన్ముఖు లగుటకు విముఖతఁ జూపినారు. గాంధారీ ధృతరాష్ట్రా దులు, రాజధర్మమును నిర్వహింపక తప్పదని ధర్మజు నొత్తిపల్క నతఁడు,

"ఇట్లు మీరు నన్ను నెంతయుఁ దఱిమిన
విపినభూమి మిమ్ము విడిచి పోవ

నియ్యకొనదు నాదు హృదయంబు మునుపోలె
కలుగదిపుడు రాజ్యకాంక్ష నాకు."
"విను పాంచాలుర మాత్స్యులు
వనితాజన శేషులైరి వారలు లేమిన్
జననీ శూన్యంబై తోఁ
చినయది రాజ్యంబు నాదు చిత్తంబునకున్."

అట్లుంగాక,

"సమరము దీరిన కోలెను
శమనిరతా, నామనంబు సారతపమునన్
రమియింపఁ గోరు యుష్మ
త్సమధిక తపమునకు నేను సందడి సేయన్."

అని కుంతితోఁ బల్కుచున్నాఁడు. సహదేవుఁడును నట్లే తపోవన వాసమునే వాంఛించినాఁడు. ఇవ్విధమునఁ గథానాయకులగు పాండవుల చిత్తవృత్తి యైహికములనుండి నివర్తితమై యాముష్మికమున కున్ముఖ మగుచున్నదో యీపర్వమున సూచితమైనది. ధృతరాష్ట్రాదుల యాశ్రమ జీవితము, వేదవ్యాసాగమనము, నతఁడు తన తపోమహిమచేఁ బాండవులకు మృతబంధుదర్శనముఁ గలిగించుట, కుంతీ గాంధారీ ధృతరాష్ట్రు లగ్నిదగ్ధులగుట, మున్నగు వృత్తము లన్నియు నాయకులకు నైహిక బంధ విచ్ఛేదనమును కలిగించినవి.

స్త్రీపర్వమున గాంధారి మనస్తత్త్వము ప్రదర్శితమైనట్లే, యీపర్వమునఁ గుంతి మనస్తత్త్వము ప్రదర్శితమైనది. క్షత్రియోచితమగు సందేశమును కృష్ణునితోఁ బాండవులకుఁ బంపి, వారిని యుద్ధమునకుఁ బ్రోత్సహించి, వారిచే రాజధర్మమును నిర్వహింపఁ జేసిన

వీరపత్నియు, వీరమాతయు, నగు కుంతి, యెట్లా రాజ్యభోగముల నొల్లక గాంధారీ ధృతరాష్ట్రులతో నరణ్యమున కేఁగి, వారితోడనే మరణించినదియు, నిందు వర్ణితములైనవి. కర్ణుని జన్మము మొదలుకొని, తన జీవిత మంతమగువరకును నీమె యనుభవించిన నిర్భరమగు హృదయ వేదన. యశాంతి, యీామె నిర్వేదమున కెట్లు హేతువులైనవియు, నిందు వ్యక్తమైనది. ధర్మజునితో నీమె,

— "దినకరసుతునిఁ

భావమునఁ దలఁపు మే నా
దేవసముని పుట్టు వడఁచితిం గపటమునన్."

"అవ్విధమునఁ గర్ణుఁడారడిఁబోయిన
నాదు మానసంబు వోదు నూఱు
పరియలై తలంప బలుతూఁతఁ జేసిన
వారు గాఁగవలయు వంశవర్య."

అని తన యీా వేదనను వెలిబుచ్చినది. అట్లే, ఆశ్రమమునకు వచ్చిన వేదవ్యాసునితో నీమె,

"కని యేటిలోనిడితిఁ గలఁ
గనినట్లయియుండెఁ దత్ప్రకారం బిది మీా
కనినయది దివ్యబోధం
బున నత్తెఱఁ గంతరంగమునఁ గొని కాల్చున్."

అని తన యశాంతి నతనితో మొఱపెట్టినది.

ఇట్లీఘట్టమందలి విషయము నాయకుల నిహాలోక విముఖులఁ గావించి వారి దృష్టి నంతర్ముఖముగఁ జేయుట కనుకూలించునదియై యొప్పినది.

తదనుయాయివృత్తమగు యాదవనాశము పాండవుల యిహలోకానుబంధమును బూర్తిగఁ ద్రెంచివైచి, వారి నాముష్మికోన్ముఖులఁ గావించినది. సురాసురులకుఁ గూడఁ దేఱి చూడరాని యాదవకులము విధిప్రాబల్యముచేఁ దద్వంశీయుల యన్యోన్య హననమున నశించుట రామకృష్ణుల నిర్యాణము, నర్జునాగమనము, ద్వారక సముద్రగర్భమున లీనమగుట, సత్యభామాదుల తపోవనగమనము, నిత్యాదులచే నొప్పు మౌసలపర్వేతివృత్తము కరుణరస ప్రధానమగు నొక విశిష్టకావ్యముగ విరచితమైనది. యుద్ధపర్వములో నందందు సూచితమై, స్త్రీపర్వ ఆశ్రమవాస పర్వములలోఁ బోషితమైన కరుణకు మౌసల పర్వమునఁ బరిణతి సిద్ధించినది. యుద్ధపర్వమునకు ముందున్న విరాటపర్వము వీర రస ప్రాధాన్యమైన మోదాంత కావ్యము కాఁగా, వానికిఁ దరువాతి దగు మౌసలపర్వము కరుణరస భూయిష్ఠమగు విషాదాంత కావ్యమైనది. ఇంతియకాక, సూక్ష్మముగఁ బరికించిన నీపర్వరచనలో నొక ప్రత్యేకత గన్పట్టును. శ్రీకృష్ణుని జీవిత పరమార్థమున కీఘట్టము ప్రత్యక్షవ్యాఖ్యానము. లోకమున నన్యాయము ప్రబలి, పాపము విజృంభించి, తన్మూలమున, సత్య ధర్మములకు హాని కలిగినపుడు భగవంతుఁ డవతరించి, ధర్మరక్షణ గావించునని పురాణములు వాకొనుచున్నవి. ఈ విషయమునే --

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అను మాటలలో శ్రీకృష్ణపరమాత్మయే యర్జునునకుఁ దెలిపి యున్నాఁడు. భగవంతుని దశావతారములును నిట్టి ప్రయోజనముతో నొప్పినవియే. అందును గృష్ణావతారమున నీవిషయము సువ్యక్తమగుచున్నది భారతయుద్ధ మధర్మ పరిణామ ఫలము. కృష్ణుఁడు సూత్రధారియై, యర్జునాదులచే యుద్ధమును నిర్వహింపఁజేసి, యధర్మపరి

ణామ ఫలమును లోకుల ప్రత్యక్షానుభవమునకుఁ దెచ్చి, వారికి ధర్మ ప్రవర్తనయం దాసక్తిఁ గల్గించి, లోకమున సత్య, ధర్మములను స్థాపించియున్నాఁడు. ఇదియే కృష్ణావతార ముఖ్య ప్రయోజనము. కృష్ణుని జీవితచర్యలు, నాతని రాజనీతి, దుష్టశిక్షణ, శిష్టరక్షణాది కార్యములలో నతఁ డవలంబించిన విధానములు, నిత్యాదుల కన్నిఁ టికిని పై ప్రయోజనమే పశ్చాద్భూమి యగుచున్నది. పాపమును ప్రతిఘటించుటకుఁ దగిన నైతిక స్థైర్యము చాలనివారై, ప్రత్యక్ష ముగ ఘోరము జరుగుచుండ నుపేక్షవహించియుఁ బిమ్మటఁ బాపులకు బాసటలై నిలిచి పోరియు, నధర్మమునకుదోహద మొనరించిన భీష్మ ద్రోణాదుల విషయమున, శ్రీకృష్ణుఁడవలంబించిన విధానము నకు, నీమహా ప్రయోజనమే కారణమగుచున్నది. కర్ణప్రయుక్తమైన 'శక్తి'చే ఘటోత్కచుఁడు గూలఁగా శ్రీకృష్ణుఁడు,

''ప్రమోదంబునొంది, సింహనాదంబుసేసి, శంఖంబుఁ బూరించి,
పగ్గంబులు నొగల ముడిచి, మందమారుతాందోళిత మందారంబు
చందంబుఁ దోప, నర్తించుచు, నరదంబు నడిమి కరిగి, కిరీటిం గౌగి
లించుకొని, వీపప్పళించి, వెండియు నార్చి,'' -

యిట్లు తనసంతోషాతిశయమును బ్రదర్శించినాఁడు. దుఃఖ సమయమున నిట్టివిపరీతప్రవర్తనకుఁ గారణమేమని యర్జునుఁ డడుగగాఁ, గృష్ణుఁడు; ఇంద్రదత్తము, నమోఘము నగు శక్తివలని భయ మింక నర్జునునకు లేకుండుట యొక హేతువుగాఁ దెల్పి,

''అదియునుంగాక, ఘటోత్కచుండును, కిమ్మీర బకహిడింబుల
తోడి వాఁడ, ధర్మద్వేషంబును, రోషంబును గలిమిం జేసి యొక్కప్పు
డొప్పమివచ్చుం గావున, నద్దానవుల యట్ల వీని పొలిసిపోకయి నాకభి
మతంబు. వీఁడు రావణునట్టివాఁ డగుట నిపుడు పావకుం డౌనేని బడంపడి

నాశన్ సంభవలయు, నిది సంతోష కాలంబు కాని శోక సమయంబు కాదు, '' అని పలికియున్నాఁడు. తనవారు పెరవా రనుభేదము లేక ధర్మద్వేషులు, ధర్మవిముఖులు, నధర్మమునెడ నుపేక్షాపరులు నగు వారెల్లరు నశించిననే కాని, కృష్ణుని ప్రయోజనము సిద్ధింపదు. ఇట్టి మహాప్రయోజనమును సాధించుకొరకే కృష్ణుఁ డర్జునుని మమతను బోగొట్టి యుద్ధము నతనిచే నిర్వహింపఁ జేసినాఁడు. అభిమన్యు ద్రౌపదేయాది కుమారులు, విరాట ద్రుపదా ద్యాప్త బంధువులు, నారాయణసైన్యము, నెల్లరు హతులు కావలసివచ్చెను. ఇలావంతుని మృతిచేఁ, బుత్రశోకానలసంతప్త చిత్తుండగు సవ్యసాచిం జూచి గోవిందుఁడు సుందస్మితంబుఁ జేసి, యతనికి సృష్టితత్త్వమును స్మరణకుఁ దెచ్చియున్నాఁడు. యుద్ధానంతరము పాండవులను రాజ్యాధిష్ఠితులఁ గావించి, వారిచే నశ్వమేధ మొనరింపఁ జేసి, భారతయుద్ధమునఁ జాల్గొనని రాజులను గూడ నశింపఁ జేసియో, లేక, ధర్మమార్గోన్ముఖులఁ గావించియో, కృష్ణుఁడు లోకమున ధర్మమును బ్రతిష్ఠించి యున్నాఁడు.

యాదవులు బలరామ కృష్ణుల ప్రాపునఁ బ్రబలి విశృంఖలులైరి. మదోన్మత్తులై, యవినీతిపరులై, ధర్మనాశముఁ గావించుటకు సంసిద్ధులైయున్న యాదవుల నాశముతోఁ గృష్ణుని జీవిత ప్రయోజనము పూర్తియగును. దానికి గాంధారిశాప మొక నెపము. ఆశాపము ఫలించు కాలము సమీపించు నప్పటికి, యాదవుల ప్రవర్తనయును నీతి బాహ్యముగఁ బరిణమించినది.

''బలుఁడు

హరియును దక్కఁగ యాదవ నివహంబు

బ్రాహ్మణ ప్రతతికి బాధసేయు,

"గురుల కవమాన మొనరించు దిరుగు లజ్జ
విడిచి యభిలాషముల వెంట విభుల పంపు
సేయ కున్మార్గములఁ దమ చిత్తములకు
వచ్చినట్ల వర్తింతురు వనిత లధిప."

సంఘమిట్లు నీతి బాహ్యమై, యధోగతి నందినప్పుడు, వినాశము తప్పదు. తద్వినాశమును సూచించుచుఁ, బ్రకృతివిరుద్ధము లగు విశేషములు గల్గుటయు సహజమే. అట్లే, ద్వారకా నగరమున మహోత్పాతము లనేకములు పుట్టినవి.

"అరుణములు ఘూర్ణితంబులు నైన లోచ
నములు మెఱయ మహోగ్రదండము ధరించి
తిరుగు నొక్కొక్క చోట నదృశ్యుఁ డగుచు
నంతకుం డిదె యదె తోఁచె ననగ నధిప."

"విను గూడు గూర పాకము
గనుఁగొని ప్రోయివాపి డింపఁగా నప్పుడ సం
జనితములై పురుగులు గల
గొన మిలమిల మెదలు నందుఁ గురుకులముఖ్యా."

అని మనస్సులు వికలము లగు విధమునఁ దిక్కన యా మహోత్పాతములను వర్ణించియున్నాఁడు. "అప్పుడ సంజనితములై పురుగులు గలగొన మిలమిల మెదలు నందుఁ గురుకులముఖ్యా," అను వాక్యమునఁ బ్రయుక్తములైన శబ్దము లెట్లు వర్ణనీయ విషయమును బ్రత్యక్షము సేయుచున్నవో సుగమము.

గాంధారీ శాపకాలము సమీపించుటయు, యాదవులు కణ్వాది మహర్షుల నవమానించుటయుఁ జరిగినది. యాదవుల దోషములవలనఁ

గలిగిన మునిశాపము నాధారముగఁగొని, పాప నిర్మూలనమునకు దోహద మొనరించి, శ్రీకృష్ణుఁడు స్వతంత్ర యోజనమును సాధించి నాఁడు. లోకుల పాపము ప్రదర్శిత మగునట్లు చేసి, పాపఫలమును వారిచే ననుభవింపఁ జేసి తన్మూలమున ధర్మమును స్థాపించుట యతని యాశయము. యాదవుల కట్టి శిక్ష నీయఁదగిన యవసరము వచ్చినది.

కణ్వాదిమహర్షులు యాదవ క్షయాపాదకముగా నొసంగిన శాపము సంగతి వినియు, నియతియగు నవస్థకు నన్యథాత్వకరణము తలఁపఁ జనదని యూహించి, కాలవేదియగు శ్రీకృష్ణుఁ డుపేక్షించి యుండెను. తన చుట్టునున్న బంధులఁ గనుంగొని, విధాతృకరణీయ మిట్టిదనియు, నిది వృష్ణికుమారుల తప్పిదమునఁ గల్గెనని చింతింపకుఁ డనియుఁ, బల్కి, వారి నూరార్చి కృష్ణుఁ డభ్యంతరమునఁ కరిగెను. ద్వారకాపురంబున మహోత్పాతంబు లనేకములు కలుగఁగాఁ, గృష్ణుఁడు సర్వవిదుండగుట, గాంధారీశాపము ఫలించు సమయ మేతెంచెనని గుర్తించి, యాదవ నాశము తీర్థ సమీప భూమియం దగుట శ్రేయమని నిర్ణయించినవాఁడై, యాదవుల నెల్లర నుత్సవ వ్యాజమున సముద్ర ప్రాంతమునకుఁ దరలించు కొనిపోయెను.

"తన రథము లేమి నొండొక
ఘన రథమును దారుకుండు గైకొని యెలమిం
గొని రా వెడవెడఁ గైసే
సిన కృష్ణుఁడు నిర్వికార చిత్తత వెడలెన్."

"తొడవు చీర పూత తొంటియట్టులు గాఁగ
నేమి వాహనమ్ము నెక్కి కించు
కేని వికృతిలేని హృదయంబు మిత్ర సం
భాషణంబుఁ గలిగి బలుఁడు వెడలె."

ఇట్లు నిర్వికార చిత్తులై వెడలిన రామకృష్ణుల యందుఁ గాలపురుషుని శాంత గాంభీర్యములు సూచితము లగుచున్నవి. సముద్రతీరమున యాదవులు ప్రవర్తించిన విధము, ఆసన్న వినాశమున కనుగుణముగ నున్నది.

"భూమిసురావళీ మహిత భోజన తంత్రముఁ దీర్పఁబూని హృ
ద్యామల రాజితంబులగు నట్లొనరించిన కూడుఁ గూర లా
కోమలు లాగఁగా గడఁగి క్రోఁతుల కన్నియుఁ బంచిపెట్టి రు
ద్దామ విహారలీల వసుధామర యాదవు లేమి సెప్పుదున్."

"విను తదనంతరంబ మదవిహ్వల భావము సేయఁజాలి యిం
పొనరిన యాసవంబులు సముత్సుకతం గనకంపుఁ గోటిలం
గొని హరి సన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగ మో
దన కరణంబులైన యుపదంశములన్ గొనుచున్ మహీశ్వరా."

ఇట్లు సాత్యకి ప్రద్యుమ్నాది యాదవులెల్లరు, విధివశమునఁ గొంతు దీఱఁ బానవిధి యొనర్చిరి. మదిరావేశమునకు లోనై సాత్యకి కృతవర్మను నిందించుటతోఁ గలహ మారంభమైనది. సౌప్తిక విషయగత మగు కృతవర్మ నీచ పరాక్రమమును సాత్యకి నిందింపఁగాఁ, గృతవర్మ, భూరిశ్రవ వధ విషయమును బేర్కొని సాత్యకినిఁ దూలనాడినాఁడు. శమంతకమణికై శతధన్వుఁడు సత్రాజిత్తును జంపినవిధమును, సాత్యకి స్మరణకుఁ దేగా, సత్యభామ వనితా స్వభావోద్గతాశ్రుపూర మైనది, కృష్ణునకును గృతవర్మాదులపై రోషము జనించినది.

ఆతఁడు కృతవర్మాదుల నతిక్రూరముగఁ జూచి, వారియెడఁ దన యసహ్య భావమును బ్రదర్శించినాఁడు. ఇట్లు సాత్యకి కృతవర్మాదులపై విజృంభించునట్లు చేసి యాదవ నాశమునకొక విధముగఁ గృష్ణుఁడు కూడ దోహద మొనర్చినాఁడు. కృతవర్మ వధానంతరము భోజాంధక వీరు

ల్లరును సాత్యకి నాక్రమించినపుడు, కృష్ణుఁడు, కాలవేదిరగ దమ్మునిఁ గాచు సముదగ్రత నొల్లఁడయ్యె. మునిశాపమాహాత్మ్యమునను విధిప్రాబల్యమునను యాదవులు క్రోధావేశ వివశులై, ముసలత్వ విస్ఫూర్తితో నొప్పిన తుంగలచే నొండొరుల మోదుకొని నశింపసాగిరి.

"తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక య
య్యలు దెఱంగువారు నేపురేఁగి
మడియమోద గాలిఁ బడు మ్రాకుగముల తె
అంగు దోఁచె నేమనంగఁ గలదు."

"మునిశాపము వారల మది
ననయము నసమొక్కఁజేయ నందొకఁడైనఁ
విను మఱలుట దెఱలుట లే
కని బెట్టుగఁ జేసి రథిప యాద్వులు సెలఁగన్."

అనిరుద్ధ ప్రద్యుమ్నాదులెల్లరు హతులు కాగాఁ, బరమ మునీంద్ర శాపశక్తిచేఁ గోపాగ్ని తనదు చిత్తమున నుద్ధురమై జనింపఁగాఁ గృష్ణుఁడును, హతశేషులగు ప్రతివీరులపైఁ గవిసి, తుంగలఁగొని మోది, నిరవశేషముగఁ జేసి, గాంధారీ వాక్యమును బారముందించెను. అనంతరము గజాదులను, నింతులను బురిఁజేర్చి తన తపోవన గమన నిశ్చయమును వసుదేవాదులకుఁ దెలిపి, వారిని వీడ్కొని, కృష్ణుఁడు బలరాముఁడున్న యెడకుఁ బోయెను. బలరాముఁడు తన యోగ బలమ్మునఁ బేర్మిఁ దనువు విడిచి, మహాభుజంగ రూపమున వియద్వీథి నంబునిధికిఁ బోవుటయు, ననంతుఁ డమూర్త్యంతరమును దన పరమమూర్తియందుఁ గలిపి కొనుటయును, గృష్ణుని దివ్యదృష్టికి గోచరమైనది. అట్లగ్రజుఁడు చనఁగా, లోకపాలనకునై భూలోకంబు

నందుఁ దాఁ బుట్టంగవలసిన యట్టి షేటి పనులెల్ల దీఱుట మనమునఁ దలపోసి, తనువిముక్తికి నిమిత్తము నరసినాఁడు. మునుల వాక్యము తెలుంగును, దొల్లి దుర్వాసు నవయవసమితిఁ బాయసముఁ బూయు నప్పుడరకాలఁ బూయుమి నత్తపస్వి యచట, నవిలంఘ్యమై యపాయంబు గలుగు ననిన మాటయుఁ జర్చించి, మనసు నడంగించి, గాఢ సమాధినొంది, మహీస్థలశయనుం డయ్యెను. 'జర' తన్ను మాయచే నావహింప నొకబోయ కృష్ణునిఁ జూచి, కృష్ణసారంగ మను భ్రాంతికి లోనై బాణప్రయోగముఁ గావించినాఁడు. ఇది తన తనువిముక్తికి నిమిత్తము కాఁగా, హరి మానుష దేహమును విసర్జించి, నిజపదంబు నొందుట కరిగెను. దేవ ముని గణములతో దేవేంద్రుఁ డాశ్రీహరి నెదుర్కొని భక్తితోఁ బ్రణమిల్లి,

"ధర్మరక్షణకునై దయావిధేయమగు ఖేలనంబున నవని నవతరించి, కంసాది పాపులనెల్ల సమయఁజేసి, భరత కులము కసటు వాపితి" వని స్తుతించినాఁడు. ఇట్లు యాదవ నాశముచేఁ గృష్ణావతార ప్రయోజనము పూర్తియైనది. శ్రీకృష్ణుఁడు వహించిన యుపేక్షవలన యాదవనాశ మవశ్యభావ్యమగుట కొంతవరకు వసుదేవునకు గోచర మైనది. ఎట్టికార్యము నైనఁ జేయవలఁతి, మృతుఁడగు పరీక్షితునిఁ బ్రతికించినవాఁడు, నగు కృష్ణుఁడు యాదవ నాశమునెడ నుపేక్ష వహించెనని వసుదేవుఁడు,

"వలసిన నెట్టి కార్యమును వావిరి నెట్టుగనైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరీక్షితుని వత్సలతన్ బ్రతికించె శౌరి యి
క్కలమున యాదవుల్ పెనఁగగాఁ గని మాన్పఁ డుపేక్షసేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁదలంచుట గాననయ్యెడున్."

కృష్ణుని నిర్యాణమును గూర్చి దుఃఖించు నర్జును నోదార్చుచు, వేదవ్యాస మహర్షి "హరి యెఱుంగు మున్న యాసంక్షయం" బని,

పలికెను. "మూడుభువనముల నన్యథాత్వంబుఁ బొందఁ జేయఁ జాలు వాఁడు కణ్వాదుల శాప ముడుప లేఁడయ్యెనే" యని పలికి వేదవ్యాసుఁ డర్జునునకుఁ గృష్ణుని జన్మరహస్యమును బోధించినాఁడు.

"ధరణి భరంబు వాప నవతారము నొందిన విష్ణుఁ డత్తెఱం
గరుదుగనిర్వహించి యజరామర నిష్కల నిర్వికార భా
స్వర నిజ సత్పదంబు నుపశాంతి పరుండయి పొందె దానికిన్
గురుకులవర్య శోకమునఁ గుందుదు రే మిముఁబోటి బోధనుల్."

"అవనీ భారము వాపి తాహరికిఁ దోడై భీమసాహాయ్య గౌ
రవ దుర్దాంత పరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్ను బాసి చనియెన్ దైవప్రకారజ్ఞ నీ
దు వరిష్ఠాచరణంబునన్ సురలు సంతోషించి రప్పౌరులన్."

"బలమును బుద్ధియుఁ జేవయు
నలఘు మతియు నుల్లసిల్లు నగు కాలమునన్
బొలియుం గాల విపర్యయ
కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే."

నర నారాయణులను బురాణమునులు లోక కల్యాణార్థమై పార్థ, పార్థ సారథులుగ జన్మించి, తత్ప్రయోజనమగు ధర్మసంస్థాపనఁ గావించిరని భారతమువల్లఁ దెలియుచున్నది.

"నరుఁడు నారాయణుండను నవంగ బఱఁగు
నిత్యపురుషులు నీవును నేను జుమ్ము
భువన హిత మాచరింపఁగాఁ బూని వేడ్క-
వచ్చి యిమ్మహిఁ బుట్టినవార మనఘ."

ఈ విషయమునే శ్రీకృష్ణుఁడును నర్జునునకు బాహిరాంతర భేదమును దెల్పుతఱి బోధించినాఁడు.

"నానారూపంబుల ని
ట్లేను ప్రవర్తింతు జగము లన్నింటను నీ
శానుఁడు నభవుఁడు నచ్యుతుఁడు
నైన శివుని నీవు గొల్వుము మర్జున యెపుడున్."

"ఏను రక్షింప జయము నీ కెసఁగ నొసగె
సమరమున శూలపాణినై శత్రుకోటి
నీదు మునుమున వధియించు నిరుపమాన
తేజు రుద్రుగా నెఱుఁగుము ధీరచిత్త."

అర్జును నొక నిమిత్తమాత్రునిగఁ జేసి, తానే భారత యుద్ధము నంతను నిర్వహింతునని, కృష్ణుఁడు నుడివియున్నాఁడు. ఈ విషయము నింతకుముందే వ్యాసుఁడు,

"నీ పనిసేయ నీవలని నెయ్యమునం గృప నన్యసైన్యముల్
దా వధియించు శూలధరతాస్ఫురణం బెసఁగంగ ముందు అ
ద్దేవుఁడు దానిఁ గాంచు భవదీయ సమంచిత దృష్టియున్ నినుఁ
గావఁడ యామురాంతకుఁడు గాలవిపర్యయ మావహిల్లుటన్."

అని యర్జునునకుఁ దెల్పి, యతని నావరించిన మాయను దొలఁగించి నాఁడు. అర్జునుఁడు శ్రీకృష్ణుని దివ్యత్వమును గ్రహించిన భక్తుఁడు. అతఁడు నిర్వహించిన ప్రతి కార్యమునకును శ్రీకృష్ణుని ప్రోత్సాహమే కారణము. శ్రీకృష్ణపరమాత్మ సంకల్పమును నిర్వహించు భౌతిక శక్తి యర్జునుఁడు. కృష్ణార్జునుల సంబంధము మనో దేహముల సంబంధమును బోలినది. యాదవనాశమును గూర్చి వినినంతనే భావిప్రళయ మర్జునునకు గోచరమైనది. మౌసలపర్వగతేతివృత్తమునఁ జిత్రితుఁడైన యర్జునుని యందుఁ బూర్వపు సాహసోత్సాహములు లేవు.

కృష్ణునినిర్యాణముతో నర్జునుని శక్త్యుత్సాహములన్నియు నతనికిఁ దెలియకయే, యెక్కడ్కిడి నంతరించినవి. ఉత్తర దిగ్విజయ, పాశుపతాస్త్ర ప్రయత్న, గోగ్రహణ విజయాది ఘట్టములందలి యర్జునుఁడు వేఱు, యిప్పటి యర్జునుఁడు వేఱు. ఇతివృత్తమునందలి దశా భేదముల ననుసరించి పాత్ర పోషణమున కవి యెంతటి యౌచిత్యమును పాటించియున్నాఁడో యిందుఁ జక్కగ వ్యక్తమగుచున్నది.

సైంధవ వధనాఁడు, లోకాతీతము, నద్భుతము, దివ్యము నగు శక్తిసామర్థ్యములను బ్రదర్శించిన యర్జునుఁడు మౌసలపర్వ కథాభాగమునఁ గేవలము నరుఁడైనాఁడు. శాంతి స్థైర్యములు, నుచితజ్ఞతా బంధు ధర్మములు, ప్రజారక్షణభారము, పరిణతమగు జ్ఞానము,—నివి యిప్పటి యర్జునుని జీవితమునఁ బ్రాధాన్యము వహించినవి. ప్రాపంచిక విషయములయెడ నొక విధమగు వైముఖ్యము, విధివిలాస మవిలంఘనీయమను జ్ఞానము, తత్ఫలమగు నిరాసక్తి, వీనితో నొప్పుచున్న యర్జునుఁడు, విషాదగర్భితము, కరుణరస భూయిష్ఠము నగు మౌసలపర్వ కథయం దుపనాయకుఁడై, కృష్ణుని యంతిమాదేశమును శిరసావహించి, తనధర్మమును నిర్వర్తించినాఁడు. ఇట్లు, మౌసలపర్వమందలి యితివృత్తము కృష్ణావతార ప్రయోజనమును, సువ్యక్త మొనరించుచు, భగవంతుని యీ యవతారమునకుఁ బ్రత్యక్షవ్యాఖ్యయై యొప్పినది.

మఱియు, మానవుని జీవిత పరిణామమున కంతకును మూలకందమై, యతని శీల స్వభావ ప్రవర్తనాదులకు హేతువై, యనుల్లంఘ్యమై యొసఁగు సంచిత కర్మ పరిపాక ప్రాబల్య మెట్టిదో యీఘట్టమున నిరూపితమైనది. మణిహారమందలి సూత్రమువలె భారతేతి వృత్తమున నాదినుండియుఁ బ్రచ్ఛన్నముగ, ననుస్యూతమై వచ్చిన విధిప్రాబల్యమిందుఁ బ్రకాశితమైనది.

"వినుము పురాతన జన్మం
బునఁ జేసినయట్టి కర్మముల ఫలములు ప్రా
జ్ఞునినైనఁ బొందు వానికి
నది శోకము నావహించు నత్యంతంబుగా,"

"విను విధికృత్యము లూరక
కనుఁగొనుచును సిద్ధ్యసిద్ధి కల్పిత సుఖదుః
ఖ నిరూఢిఁ బొందకుండఁగ
మనముం దొలఁగించు వెలివు మహనీయమగున్."

అని యీ విధమున విధివిలాసము పలుచోట్ల వివరింపఁబడినది. నముచి యింద్రునితో, దైవము యొక్కయు, కాలముయొక్కయు ప్రభావ మిట్టిదని యిట్లు చెప్పినాఁడు.

"సకల భూతములకును శాసకుఁడు గలఁడు
గాదె యొక్కరుఁ డాతని కల్పనమున
ప్రాప్తమైనది నీళ్ళులు పల్లమునకు
వచ్చుక్రియ దాన వచ్చుఁ గీర్వాణముఖ్య.
"కాలమడఁగించు జనుల
ల్లోలిని గిరిఁ ద్రెంచుకరణి లోభక్రోధా
శీలత్వ కామ భయములఁ
దేలు జనుఁడు మూఢచిత్తతీవ్రత్వమునన్."

ఈవిషయమునే మౌసలపర్వాంత్యభాగమున వేదవ్యాసుఁడు వివరించి యర్జునునకు జ్ఞానోపదేశముఁ గావించియున్నాఁడు.
"కాలమూలంబు సర్వంబు గాన దీని
కొండు తలఁపులు దక్కి మీ రుత్తమంపు

గతికిఁ జనుఁడు నిశ్చింత విశారతనులు
విడిచి యార్య జనంబులు వినుతిసేయ."

ఈ బోధనవలన శోకమోహంబులు వాసినదై, యర్జునుని డెందము నిర్భరానంద మొందినది. అట్లర్జునుఁడు ప్రబోధమునంది హాస్తినాపురికిఁ జని, కృష్ణ బలరామాది యాదవుల వృత్తాంతము సర్వమును, దనదు తెఱఁగును, సత్యవతీ తనూభవు హితభాషణంబులుఁ, నేర్పడంగఁ జెప్పిన విని, యుధిష్ఠిరుండు, ప్రస్థానంబునకు మది యొలయ నతనితో,

"కర్మసంత్యాగకలనంబు కార్య మిప్పు
డను వినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గనుచుంటి విదితమయ్యె
నాకు."

అనిపల్కి మహాప్రస్థానమునకు నిశ్చయించినాఁడు. ఇట్లు మౌసలపర్వమునఁ గవి యాదవవంశేతివృత్తము నాలంబనముగఁగొని, యనుల్లంఘ్యము, నప్రతిహతము నగు విధివిలాసముయొక్క మాహాత్మ్యమును, గాలప్రభావమును, బ్రత్యక్షమగు విధమున వివరించుచుఁ, గృష్ణుని జీవిత తత్త్వమునకు వ్యాఖ్య యొనర్చియున్నాఁడు.

ఇట్టి యుత్కృష్ట ప్రయోజన ముండుటచేఁ దిక్కన యీఘట్టము నొక సమగ్ర స్వతంత్ర కావ్యముగ రచించినాఁడు. కావ్యమునకు విశిష్టత నాపాదించు గుణములలో సమగ్రేతివృత్త పోషణ మొకటి. కావ్యవస్తువు నుచితరీతి నుపక్రమింపఁ జేయుట కావ్యరచనయందు మొదటిఘట్టము. ఇట్లుపక్రమింపబడిన వస్తువును రసస్ఫోరకములగు సన్నివేశములచే విస్తరింపఁజేయుట రెండవది. అట్లు విస్తృతమైన యితివృత్తమును, దైవికమగు నొక సంఘటనచే రసోన్ముఖముగఁ జేయుట మూఁడవఘట్టము, రసోత్పత్తియు, రసానుభూతియుఁ గలిగిన

విస్మృట, నుద్వేగమును తగ్గించి విషయము నుపసంహరించుట నాల్గవది. ఇట్లుపసంహృతమైన యుద్వేగమును శాంతియందుఁ బరిణమింపఁజేసి, కావ్య ఫలసిద్ధితో నితివృత్తమును ముగించుట నిర్వహణ మగును. ఉదాత్త వస్తు భావ సమన్వితములు, మానవ కల్యాణార్థ ప్రతిపాదకములు, నిత్యానందదాయకములు నగు నుత్తమ కావ్యములం దీ లక్షణములు కాననగుచున్నవి. మౌసలపర్వ మిట్టి యుత్కృష్ట కావ్యలక్షణములతో నొప్పు నుదాత్తరచన.

ఇతివృత్తము యాదవ వంశగత మగుట వస్తు వుదాత్తమును, ప్రఖ్యాతమును నైనది. మహానుభావుఁడగు శ్రీకృష్ణుఁడు కథానాయకుఁడగుట వలనఁ గావ్యమున కుత్తమ నాయకత్వము సిద్ధించినది. భారత వీరుఁడు, దివ్యాంశ సంభూతుఁడునగు నర్జునుఁ డిందుపనాయకుఁడై, కృష్ణుని సంకల్పము నిర్వహించుటకు సహాయకారి యగుచున్నాఁడు. కరుణము ముఖ్య రసముగను, వీరము తదంగముగను పోషితములైనవి. యాదవనాశ, బలరామకృష్ణ నిర్యాణములచే నుత్పన్నమైన కరుణరస మర్జునుని యుత్కంఠయందును, యాదవాంగనల యాక్రందనములందును, నుద్వేగముఁ గాంచినది.

కృష్ణుఁడు లేమిచేఁ గాంతి విహీనమై, దీనమై కన్పట్టు ద్వారకను బ్రవేశించినప్పటి యర్జునుని యవస్థ కరుణ రసోత్పాదకముగ వర్ణితమైనది.

"అరిగి మగండుసచ్చిన కులాంగనయుం బోలె శశి గ్రుంకినట్టి శ
ర్వరియును బోల్పఁ బట్టగుచు వారిజనాభుఁడు లేని దీనతం
బొరసి కృపైకభాజనతఁ బొందిన యప్పురిఁ జూచి మానసం
బెరియఁగఁ జొచ్చె నేటి కెదురీదినచాడ్పున నేమి సెప్పుదుం."

ప్రియబంధుఁడగు నర్జునుని జూచుటతో నంతవఱకడఁగియుండిన దుఃఖమంతయు నొక్కుమ్మడి పైకుబికి, యాదవాంగనలను ముంచివైచినది,

"చనుటయుఁ గ్రొత్త పేరడలు సైపఁగలేక మురాంతక ప్రియాం
గనలు పదాఱువేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారి రో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రువడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్లు దెరలన్ జనుదెంచిరి పార్థుపాలికిన్"

సన్నిహిత బంధుదర్శనముతో శోకవేగ మగ్గలమగుట ప్రకృతిసహజమే కదా! వారి శోకప్రవాహమం దర్జునుఁడును నిమగ్నుఁడైనాఁడు.

"వారలఁ గాంచి శోక మనివారణఁ జిత్తము పెల్లగింప న
క్కౌరవసత్తముం డెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్
దేరొకభంగి డిగ్గి యిలఁ ద్రెళ్ళిన యద్దురవస్థఁ జూచినన్
వైరులకైన డెందములు వ్రయ్యలుగా వగఁదాకు భూవరా."

ఇట్లు పాఠకుల హృదయములు ద్రవీభవించు విధమున కరుణ పోషింపఁబడినది.

కృతవర్మపై విజృంభించిన సాత్యకివర్ణన యందును, యాదవుల పరస్పర హననమునందును, యుద్ధవీర మంగముగఁ బోషితమైనది.

"అనుచున్ సంయమిశాపజాత ముసలాత్యంతాద్భుతస్ఫీత శ
క్తి నిరూఢమ్ముగ నూనినట్టి నిజనిస్త్రింశంబు శీఘ్రంబునం
గొని తద్దీధితిరాజిచే నతనిచూడ్కుల్ విహ్వలత్వంబు నొం
ద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తాంబు ప్రసారంబుగన్."

అట్లు కృతవర్మం దెగటార్చిన సాత్యకి యంత నిలువక యుద్ధతుఁడై, బాహావిలాసంబు మెఱయ భోజకులంబుపైఁ గవియ, భోజాంధక వీరు లెల్లరు నతని నాక్రమించినారు. ప్రద్యుమ్నాదులు సాత్యకికి సహాయులుగా,

"కనుఁగొని వృష్ణివీరులు నికామ సముజ్జ్వల రోషవహ్ని నె
మ్మనమున నత్తితంబుగ సమత్సరశౌర్యము విక్రమోద్ధతిన్
బెనుపఁగ వారలిద్దరకుఁ బ్రీతి యెలర్పఁగ సింహనాదముల్
ఘనపథమెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్."

విజృంభించినారు,

ద్వారకాప్రజల రక్షణార్థమై, యర్జునుఁడు బలరామకృష్ణుల నిర్యాణమును రాజాంతఃపురకాంతలతోఁ జెప్పక, నిగూఢముగ నుంచి, సూర్యోదయమునకుఁ బూర్వమే ప్రజలను బురినుండి నిర్గమింపఁజేసి, వారిని రక్షించుటలో, నతని స్వార్థత్యాగము ప్రదర్శితమైనది. దైవగతి నంబుధి పట్టణము నాక్రమించుట మరునాఁడ యగుట యెఱింగి యర్జునుఁడు,

"యీరేయి సెచ్చెర బ్రయాణ
మునకుఁ గృత్యములగు పనులెల్ల సమకట్టి
వేగంగఁ గ్రక్కున వెడలవలయు
"గాని వెడలకున్న భానూదయంబున
వనధి పురము ముంచికొనిన గణన
సేయరాని యట్టి సేగియుఁ బ్రయ్యుఁ బా
పంబు వగయు నెల్లభంగిఁ గలుగు."

అని పల్కుటలో నతనికి లోకహితము నెడఁగల జాగరూకత వ్యక్తమయినది. రుక్మిణ్యాదులయుఁ, దనయొక్కయు సుఖదుఃఖాదులిం దర్జునునిచేఁ దృక్తములగుటఁ ద్యాగవీరమును నొక యంగముగఁ బోషితమైన దనవచ్చును. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ' మ్మను సిద్ధాంత మీపర్వమున నిదర్శన పూర్వకముగఁ బ్రతిపాదితమగుటచేఁ గావ్యమున నుదాత్తత సిద్ధించినది. మౌసలపర్వకథ

భారత కథాంతర్భూతమగు నొక భాగమే యైనను, నారంభమునుండి నిర్వహణము వఱకును, గార్యకారణ శ్రేణిచే సంబద్ధమై స్వతంత్ర కావ్యమువలెఁ బోషితమైనది. శాంతిపర్వాదుల యందువలె వివిధ ధర్మ వివరణములకు, నుపాఖ్యానములకు నిందుఁ బ్రసక్తి లేదు. కథా గమనమున కంతరాయములగు విషయాంతర వర్ణనలు లేకుండుటచే, నిర్వృత్త మేకధారగ, ఫలోన్ముఖమై ప్రవహించుచున్నది. విరాట పర్వమునఁ గూడ లేని వస్త్వైక్య మీ మౌసల పర్వమున సిద్ధించినది.

పర్వారంభముననే వర్ణితములైన ధర్మరాజు రాజ్యమునందలి యుత్పాతములచేఁ గథాంతర్భావము సూచితమైనది,

"భారత సంగ్రామ పారీణుఁడై జయ
రమ యుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ
బాండవ ముఖ్యునిఁ బట్టంబు గట్టిన
యది యాదిగాఁగ ముప్పదియునైదు
సంవత్సరంబులు సన ననంతర వత్స
రంబునఁ బ్రజకుఁ భయంబొనర్చు
నుత్పాతములు పుట్టె నుర్వీశ విను మహా
వాయువు శర్కరావర్షి యగుచు,

"వీచు నర్కు నుదయవేళల బింబంబు
బలసి దోఁచు ఘన కబంధసమితి
నీరదములు లేక నిర్ఘాతపాతముల్
గలుగు నుల్కలెల్ల కడల దుల్లు."

"పరివేషము లిన రజనీ
కరులకు నతి రూక్షరుచులు గలిగి కలుగు నం

బరమొల్లఁ గప్పి వేసవి
బరగుం బెనుమూడ మంచు పౌరవముఖ్యా."

ధర్మజు రాజ్యమునఁ గల్గిన యీ భయోత్పాదకములగు ప్రకృతి వైపరీత్యములు మౌసల పర్వేతివృత్త సూచకము లగుటయే కాక, ప్రధానమగు భారతేతి వృత్తమునకు నాయకులైన పాండవుల మహాప్రస్థానాదులను గూడ సూచించునవియై యున్నవి. ఇతివృత్తము కణ్వాదుల శాపముతో నుపక్రమింపఁ బడినది. తదనంతరము ద్వారకయందు గల్గిన మహోత్పాతములు, సాంఘిక కల్లోలములు, కథాబీజము నంకురోన్ముఖముఁ గావించుచున్నవి. సముద్రోత్సవ సందర్భమందలి యాదవుల యున్మార్గ ప్రవర్తనచే నితివృత్తము పోషితమై, యాదవ వినాశముచే రసోన్ముఖము గావింపఁబడినది. బలరామకృష్ణుల నిర్యాణముచే రసోత్పత్తి సిద్ధించినది. యాదవాంగనల యాక్రందనములం దుద్వేగమును బొందిన కరుణరస మర్జునుఁ డొనర్చిన ప్రజారక్షణాద్యనుయాయి వృత్తములచే నుపసంహృత మైనది. యాదవకుమారుల పట్టాభిషేకములు, సత్యభామాదుల తపోవన గమనము, నిత్యాది ఘట్టము లితివృత్తోప సంహారమునకు సహాయకములై కథను శాంతి రసోన్ముఖముఁ గావించినవి. వేదవ్యాసుఁ డర్జునున కొనర్చిన తత్త్వోపదేశమునందు శాంతి వెలసి కరుణను దనయందు లయింపఁ జేసికొనుచున్నది. కరుణరస ప్రధానముగఁ బోషితమైన యాదవ వంశేతివృత్త విశ్రాక్రమమున శాంతియందుఁ బరిణతిఁ జెందినది. ఇట్లీ పర్వరచన సలక్షణమగు, నుదాత్త దృశ్య ప్రబంధ రచనతోఁ దులదూగుచున్నది.

నాయకవధ సర్వదా త్యాజ్య మను లౌకిక కావ్యలక్షణమునకుఁ గృష్ణుని నిర్యాణము విరుద్ధముగఁ గన్పట్టును, కాని, భగవదవతార ప్రయోజనమగు ధర్మసంస్థాపనము సిద్ధించుటయు; నంత, నవతార పురుషుఁడగు కృష్ణుఁడీ లింగశరీరమును వీడి,

"అమృతం బజరం బవ్యయ
మమలం బవితర్క్య మచల మాగమగమ్యం"

బగు నిజపదమును జెందుటయు, లోక కల్యాణమునకు హేతువులగు టచేఁ బూర్వోక్త విరోధము పరిహృత మగుచున్నది.

భారత రచనచే వేదవ్యాసుఁడు నిర్వహింపఁబూనిన ప్రయోజన మీ మహాసలపర్వ కథాభాగములోఁ బూర్తిగ సిద్ధించినది. వివిధ వర్ణాశ్రమ ధర్మములను, సత్యన్యాయ ధర్మాదుల తత్త్వములను, సుఖ దుఃఖాది జీవిత విషయముల స్వభావ స్వరూపములను; భారతీయ మతానుసారముగ, సర్వజన గ్రాహ్యమగు విధమున, జనులకు బోధించి, సంఘమును సంస్కరించుట యీ ప్రయోజనమందొక భాగము. ఇంతియకాక, వేద వేదాంతర్గతములై, లోకమునం దత్యధిక సంఖ్యాకులగు వారి కందుబాటులోలేని, భగవత్తత్త్వ సృష్టిరహస్యాదులు, కర్మయోగ జ్ఞానయోగాది ముక్తిమార్గములు; మున్నగు నాధ్యాత్మిక విషయములను, శాస్త్ర పరిచయము లేని జిజ్ఞాసువులకు సాధ్యములగునట్లు చేసి, తనక్కాలమున, నిహలోక జీవితమునకు శాంతినిఁ బ్రసాదించుటయు నొక ప్రయోజనము. ఇట్టి యుత్కృష్ట ప్రయోజన సిద్ధికి పాండవేతి వృత్త మాలంబనమైనది. మహాసలపర్వముతో నీ యుత్కృష్ట ప్రయోజనమును, పాండవేతి వృత్తమును, జాలవఱకుఁ గడముట్టినవి. శాంత్యనుశాసనికములందు బోధింపఁబడిన జీవిత తత్త్వము యాదవేతి వృత్తమునఁ బ్రత్యక్షముగ నిరూపితమైనది. పాండవు లిహలోకమును ద్యజించి, మహాప్రస్థానగతు లగుటకు, యాదవేతివృత్తము ప్రబల కారణమై, ప్రధానేతివృత్తమును ఫలోన్ముఖముఁ గావించినది. మూల కథతోఁ బూర్వాపర సంబంధముగల్గి, యుదాత్తములగు ప్రయోజనముల నొప్పియున్న యీ మహాసలపర్వ కథ తిక్కనచే నుత్కృష్టము, సర్వాంగ సుందరము, రసవత్తరము నగు విధమునఁ బోషితమైనది.

మౌసలపర్వగతమగు యాదవనాశ, కృష్ణబలరామ నిర్యాణముల కారణమునఁ బాండవుల కిహలోక బంధము పూర్తిగఁ దొలఁగినది. పరీక్షితునకు రాజ్యాభిషేకముఁ జేసి పాండవులు ద్రౌపదీసహితులై తపోవన గతులగుటయు, భీమాదులు నిర్యాణము నందుటయు, నిత్యాదులు మహాప్రస్థానపర్వమునను, ధర్మజుని యలౌకిక శీల ప్రవర్తనములు, నతని నశరీర స్వర్గప్రాప్తి మున్నగునవి స్వర్గారోహణ పర్వమునను వర్ణితము లగుటతో నితివృత్తము సమాప్తమైనది. ఇట్టి కథాక్రమము ననుసరించి స్త్రీపర్వమున శోకోద్వేగమును, శాంత్యనుశాసనికములలో నిర్వేదమును, మౌసలపర్వమున గరుణయుఁ, బ్రధానములైనను, ధ్యేయమగు శాంత మామూఁడు ఘట్టములందును నంతర్వాహినిగఁ బ్రవహించి, కడపటి ఘట్టమున నితివృత్తమును దనలో లయింపఁ జేసికొనుచున్నది.

# కర్మయోగి - వాఙ్మయ యజ్ఞము

విరాటపర్వమాదిగ బహువిధముల విస్తృతిఁ జెంది, ప్రకృతి తత్త్వమును సుగమముఁ జేసి, శాంత్యధిష్ఠితమగు స్వర్గారోహణముతో సమాప్తిఁ జెందిన యీ భారతభాగమును రచించుటలోఁ, దిక్కనఁ, యెట్లు తత్తత్సన్నివేశముల కనుగుణముగఁ దన కవితాశిల్పము నుచిత విధమునఁ బ్రదర్శించినదియు సహేతుకముగ నిరూపితమైనది. మౌసల పర్వ గతమగు యాదవనాశ, కృష్ణ బలరాముల నిర్యాణముల కారణమునఁ బాండవుల కిహలోక బంధము పూర్తిగఁ దొలఁగినది. పరీక్షితుని రాజ్యాభిషిక్తునిం గావించి, పాండవులు ద్రౌపదీసహితులై ప్రస్థానగతులగుటయు, భీమాదులు నిర్యాణముం బొందుటయు, మున్నగునవి మహాప్రస్థానమునను, ధర్మజుని యలౌకిక లీల ప్రవర్తనములు, నతని సశరీర స్వర్గప్రాప్త్యాదులు స్వర్గారోహణ పర్వమునందును వర్ణితములైనవి. ఇట్టి కథాక్రమము ననుసరించి, విరాట పర్వము వీర శృంగారములకును, యుద్ధపర్వములు వీర రౌద్రాదులకును ప్రాధాన్యము వహించినవి. స్త్రీపర్వమున శోకోద్వేగమును, శాంత్యనుశాసనికములలో నిర్వేదమును, మౌసలపర్వమునఁ గరుణయుఁ, బ్రధానములుగఁ బోషితములు, శాంత మీ కడపటి మూడు ఘట్టములందును, నంతర్వాహినిగఁ బ్రవహించుచుఁ, గడపట నితివృత్తమును దనలో లీనముఁ జేసికొనుచున్నది.

ఆదినుండీ యంతమువఱకును, నితివృత్తమును, బాండవుల జీవితములును, బరస్పరాశ్రయములై, యొక క్రమపరిణామము ననుసరించి యుండుట గమనింప నగును. బాల్యమునఁ దండ్రినిఁ గోల్పోయి నిస్సహాయులై పితృవ్యుని పోషణముననున్న బాలుర జీవితము

లోకమునకుఁ గ్రొత్త కాదు. ఈర్ష్యాపరులు, దురాశాపీడితులు నగు దాయాదులు పన్నుకుట్రలు, వారు పెట్టు బాధలు, నధర్మమునకాదియందుఁ గలుగు విజయము,-- మున్నగునవి, లోకమునఁ బ్రత్యక్షముగ మనము దిన దినము చూచు విషయములు. పాండవుల బాల్యమును నిట్టిదియే యగుటచే నీ యితివృత్తము మన జీవితమున కత్యంతము సన్నిహితమై యున్నది. వివాహ సంబంధ కారణమునఁ దగిన సహాయసంపత్తి లభింపఁగా, పాండవు లున్నతస్థితికి వచ్చుట కనుకూల పరిస్థితి యేర్పడినది. దానికి స్వశక్తి సామర్థ్యములును, ధర్మనిష్ఠయుఁ దోడ్పడినవి. తత్ఫలితముగ వారికున్నతస్థితి సిద్ధించినది. కాని, ధర్మవిజయ మింకను స్థిరపడలేదు. లోకమున నధర్మమునకు విస్తారప్రాబల్య ముండుటచే, దుర్యోధనాదుల పన్నాగములు ఫలించుటయుఁ, బాండవులు రాజ్యభ్రష్టులగుటయు జరిగినది. ధర్మజుని దోషలేశముకూడ నిందులకు హేతువైనది. ఈపరిణామ క్రమము మానవ జీవితమున కెంతయు ననుగుణముగ నున్నది. కించి దాత్మదోష కారణమునఁ బదవీపరిభ్రష్టులై, పలుబాధలఁ బడినవారనేకులు లోకమునఁ గలరు. కష్టానుభవ కారణమున సాత్త్వికుల హృదయములు పరితప్తము లగుటయుఁ, గ్రమముగ వారికి జ్ఞానోదయమగుటయుఁ గూడ నట్లే సహజము. అరణ్యవాసాజ్ఞాత వాసానుభవము ధర్మజుని చిత్తశుద్ధికిఁ గారణమైనది. లోక కల్యాణము నపేక్షించి, యతఁడవలంబించిన శాంతివిధానము ప్రయోజన సిద్ధిం గాంచక పోవుటచే స్వధర్మమగు క్షాత్రము నతఁడవలంబింపక తప్పినది కాదు. కాని, అధర్మపక్షముతోఁ బాటు ధర్మపక్షము కూడా యుద్ధమున నశింపవలసి వచ్చినది. ఇది ప్రకృతి తత్త్వము. సంఘర్షణయం దుభయపక్షములకును నాశము తప్పదు. ధర్మజునకీసత్యము ప్రత్యక్షముగ విదితమై, యతనికి వైరాగ్యోదయము గలుగుటకు హేతువైనది.

యౌవనమున నుత్సాహ ప్రధానముగ నుండిన మానవుని జీవితము, రాను రాను, ప్రాపంచిక కష్టసుఖాద్యనుభవ కారణమునఁ గ్రమపరిణామముం గాంచి, కడపట శాంతి ప్రధానమగుట లోక సహజము. తత్పరిణామము ననుసరించి, జీవిత మధ్యకాలము వఱకును, ముఖ్యముగ నైహికములపైఁ గేంద్రీకరించి యుండిన మానవుని దృష్టి, జీవితపు నుత్తర భాగమునఁ గ్రమముగ నైహికవిముఖమై, యాముష్మికముపైఁ బ్రసరించుటయును నైజమే. పాండవుల జీవితచరిత్ర, యీ క్రమ పరిణామము ననుసరించి యుండుటయు, భారతేతివృత్తమందలి వివిధ ఘట్టము లీ పరిణామమునకుఁ గారణములై యుండుటయు, సులభముగ గనుపింపనగును. మానవ జీవితపరిణామ విధాన క్రమ మాదినుండి తుదివఱకును, ధర్మజుని జీవితచరిత్ర యాధారమున నిందుఁ బ్రత్యక్షమగురీతిఁ జిత్రితమైయున్నదని చెప్పవచ్చును. ఇతివృత్తమును, నాయకజీవితమును గూడ, జీవితపరిణామ క్రమముతో నిట్లను సంధించుచుండుటచే, భారతము సర్వతోముఖమగు జీవితచరిత్రకు సమగ్ర వ్యాఖ్యయని చెప్పుటకుఁ దగియున్నది.

ఇట్టి పరిణామముతో నొప్పు భారతభాగమున కనుగుణముగఁ, దిక్కన రచనయు నుచిత పరిణామము నందినది. యుద్ధపర్వాంతము వఱకును లౌకికమైయున్న యితని రచన, తదనంతర భాగములలోఁ గ్రమముగ నలౌకిక విధానము నవలంబించినది. నాయకజీవిత మెట్లు లౌకికములనుండి మఱలి, యలౌకికములపైఁ బ్రాకి, క్రమముగ నంతర్ముఖమై, కడపటఁ బ్రశాంతతను గాంచినదో, యట్లే తిక్కన రచనయుఁ, గ్రమముగ లౌకిక కావ్య లక్షణములగు ధ్వన్యలంకార, చమత్కారాదులను విసర్జించి, యంతరంగమగు నర్థపోషణమునే పరమ ధ్యేయముగ నిడికొని తుదిఁ బ్రశాంత తేజోమూర్తిగఁ బరిణమించినది.

వేదవేదాంగములు, పురాణములు, ధర్మశాస్త్రములు, పరబ్రహ్మ స్వరూప ప్రతిపాదకములగు నుపనిషదుత్తరమీమాంసగతార్థములు, వివిధదర్శనములు, నిత్యాదుల నన్నిఁటిని మథించి, భారతీయ ప్రాచీన సంస్కృతి నంతటిని గ్రహించినవాఁ డగుటచేఁ దిక్కనకు మహాభారత రచన సాధ్యమైనది. సాంఖ్యాది యోగ సూత్రార్థములు, జీవాత్మ పరమాత్మ తత్త్వ వివరణములు మున్నగు నాధ్యాత్మిక రహస్యములన్నియు, సుస్పష్టమగు విధమున వివరింపఁబడి యుండుటంబట్టి, తిక్కనకు అధ్యయన గురూపదేశ మూలకమగు జ్ఞానము మాత్రమే కాక, అనుభవ జ్ఞానముకూడ గలదని విదితమగుచున్నది. ప్రతివిద్యకును, అధీతి, బోధ, ఆచరణ, ప్రచారము లను నాల్గు దశలున్నవని పెద్దలందురు. భారతరచనతోఁ దిక్కన, తానేర్చిన విద్యకుఁ నాల్గవదశను గూడ సాధించినాఁ డని చెప్పవచ్చును.

విద్యాప్రచారముచే లోకకల్యాణ మను నుత్కృష్ట ప్రయోజనమును సాధింపఁ బూనినవాఁడు తిక్కన. పరబ్రహ్మ రూపప్రతిపాదకమగు భారతాంధ్రీకరణమునకుఁ బూనుచు, తిక్కన యజ్ఞరూపమగు నీశ్వరార్చనమును నిష్ఠమై నిర్వహించి, చిత్తమును భగవదాయత్తముం గావించినాఁడు. వాఙ్మయరూప శిష్ట యజ్ఞమున కారంభించు తిక్కనకీ వైదిక యజ్ఞకర్మదీక్ష యత్యావశ్యకమైనది. అహింసాత్మకమగు, వాఙ్మయాధ్వరార్చనకుం గడంగు తిక్కన విషయమున నీ వైదికకర్మకాండ యొక యుత్కృష్టసాధన మైనది. తత్సాధనచేఁ జిత్తమునకుఁ బ్రశాంతత సిద్ధింపఁ దిక్కన, మహాకవిత్వ దీక్షతోఁబాటు, వాఙ్మయ యజ్ఞరూపమగు యోగదీక్షను బూని, భారతరచనకుఁ గడంగినాఁడు. ఈ కావ్యముచే నితఁడు సాధింపఁ బూనినది, ఆముష్మికఫలము,- జన్మరాహిత్యము.

"తపమునకు విద్యకును జన్మస్థానమైన
జననరహితుని యజ్ఞాత్ము శౌరి వాఙ్మ
యాధ్వరార్చితుఁ జేసితి నా జనార్ద
నుండు మద్భజనమునఁ బ్రీతుండు గాత."

అను, శరతల్ప గతుఁడగు భీష్ముని కృష్ణస్తవ రూప వాక్కులు తిక్కన విషయమునఁగూడ, చక్కగ సమన్వయమును బొందు చున్నవి. విద్యాతపస్సుల జన్మమునకు స్థానమైనవాఁడును, జనన రహితుఁడును యజ్ఞమూర్తియు, నగు పరబ్రహ్మను వాఙ్మయరూప యజ్ఞముచేఁ దిక్కనయుఁ బూజించినాఁడు. తన యీ భజనచే భగవంతుఁడు ప్రీతుఁడగుటయే యతని యాశయము.

"శరణాగతుండ భక్తుఁడఁ
బరమపదవిఁ గోరెదను శుభంబుగ నన్నున్
బరికించి యేది మేల
య్యెరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా."

అను ప్రార్థన తిక్కన విశిష్ట జ్ఞానమునకు నిదర్శనము. భగవత్ప్రీ త్యర్థము, భక్తిశ్రద్ధలతో సత్కర్మనాచరించి, ఫలాపేక్ష లేక, జీవితము నీశ్వరార్పణముం గావించిన తిక్కన ఆదర్శకర్మయోగి. 'ఏది మే లయ్యెరవు దొర కొనంగఁ దలపవే కమలాక్షా" యని తన భావిశ్రేయమును గూర్చిన చింతను గూడ తిక్కన భగవాదా యత్తముఁ గావించినాఁడు. వ్యాసరచిత గీతాతత్త్వమును వాచ్యము చేయక, తిక్కన యిట్లాచరణ రూపమునఁ బ్రకాశిత మొనర్చుటచే నతఁ డాంధ్రలోకమున కాదర్శపురుషుఁడైనాఁడు.

యోగ, తపో, యజ్ఞాదు లీతని యభిమాన విషయములు. నిర్మ లాంతఃకరణ సాధ్యమగు బ్రహ్మజ్ఞాన మితని ధ్యేయము.

"యోగులకు యోగబలమున
రాగము మోహంబునుం జిరస్నేహముఁ గా
మాగమముఁ గ్రోధము నునా
యోగము వడుసఁ బెడఁబాప నున్నతి తొలఁగున్."

"ఘనరఘుమమున్ సముద్ధతమృగంబును జాలముఁ ద్రవ్వి వాగురా
వినిహతిఁ జేసి యిష్టపదవిం జనుచాడ్పున యోగతంత్ర రో
ధనమున లోభజాత దురితవ్రజముం బెడఁబాచి సత్పథం
బునఁ జరియించు యోగి సుఖమూర్తిత సుస్థితగా వహించుచున్."

అని, యోగ మెట్టి విశిష్ట మోక్ష సాధన మగునదియు వ్యక్తము గావింపఁ బడినది. అంతియ కాక,

"యోగనిరూఢుఁడు సంగ
త్యాగానందైకరతుఁ డతనికి జనన సం
యోగము మృతి దైన్యంబును
భోగాభోగ సుఖదుఃఖములు లే వధిపా."

అని యోగలబ్ధమగు నానంద మెట్టిదో తిక్కన వివరించినాఁడు.

"అనఘ యంచిత స్వాధ్యాయమునను యజ్ఞ
మున సమాచారమున నిష్ఠ నొనుగుపడక
యుండు నెవ్వారలకు వార లోపి నడపు
నదియ కనుము ధర్మము సూక్ష్మపదవిగాఁగ."

"వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ
నము నహింసయు నియత కృతత్వములు సర్వ
జనుల కిమ్మగు గుణములు మనమునందు
దృఢముగా నిల్పి నడపుము ధీరవర్య."

అని పలుచోట్ల తపోయజ్ఞాదుల విశిష్టత వివరింపఁ బడినది. తిక్కన

రొకచో "యజ్ఞాత్మక రూప నిశ్చలావ్యయదీపా" యని పరమేశ్వరుని సంబోధించి యుండుట గమనింపఁ దగినది.

ఇతని యాశ్వాసాంతపద్యము లీతని మనస్తత్త్వమును, విశిష్ట జ్ఞానసంపత్తిని, మహోన్నతాశయములను వ్యక్తపఱచు చున్నవి.

1. "నియమనికటవర్తీ, నిష్కళానందమూర్తీ."

2. "యమనియమవికాసీ వ్యాసచేతోనివాసీ."

3. "యమనియమాద్యష్టాంగ
క్రమాభ్యసన నిర్మథిత వికారసుచేతః
కమలామోదమయాత్మా."

4. యమనియమ వికాసి ధ్యానగేహ ప్రదీపా
దమశమకలితానంద ప్రకాశ స్వరూపా."

అను సంబోధనలు, తిక్కన యింద్రియ విజయు యని సూచించు చున్నవి. యమనియమాదులను క్రమముగ నభ్యసించుటచే, వికారము లడంగి, చిత్త మెట్లు శుద్ధిగాంచునదియు, నట్టి విశుద్ధమగు నంతఃకరణ మెట్లాత్మ స్వరూప జ్ఞానమునకు నవసరమగునదియుఁ, దిక్కన పలుచోట్ల వివరించి యున్నాఁడు.

1. "ప్రమదవిషాదాది ద్వం
ద్వమలాపిహితాంతరంగవాసా."

2. "అపగత కామరోష హృదయాంతర ఖేలనకల్య."

3. "ధర్మాధర్మ విదూర నీతిపర విద్వచ్చిత్తయోగీ."

ప్రమోద విషాదములు, సుఖదుఃఖములు, ధర్మాధర్మములు, కామ రోషములు, రాగద్వేషములు, —మున్నగు ద్వంద్వముల నధిగ మించిననే తప్ప, చిత్తమునకుఁ బ్రశాంతత లభింపదనియుఁ, జిత్త శాంతి సిద్ధించిననే కాని పరబ్రహ్మస్వరూపము బోధపడదనియు

నీ వాక్యములచేఁ దిక్కన సూచించుచున్నాఁడు. ఇవి యతని విశుద్ధాంతరంగ ప్రదర్శకము లగును.

1. "సకలనిగమవేద్యా."

2. "నివృతనిగమశాఖావిశ్రుతాయగ్రకవేద్యా."

3. "సుమహాదుపనిషత్ప్రస్తుత్యభి శ్రావ్యసేవ్యా."

4. "ఉపనిషదవగమ్యా యోగభావ్యైకరమ్యా."

అను వాక్యములు, తిక్కనకు వేదములయందును, నుపనిషద్గత వేదాంతము నందును గల పూజ్యభావమును వ్యక్తపఱచుచున్నవి. వేద వేదాంత విశిష్ట జ్ఞానముచే భగవత్స్వరూపము బోధపడునని యిందుచే సూచితమైనది. భారత రచనారంభమునకుఁ బూర్వము, పూర్వమీమాంసా ప్రతిపాదితమగు వైదిక కార్మకాండచే నాకర్షింపఁ బడిన తిక్కన మనస్తత్త్వము శాంతిపర్వ రచనా కాలమునాఁటికిఁ బొందిన పరిణామము ముఖ్యముగ గమనింపఁ దగినది.

1. "ప్రకృతి పురుషయోగీ వికృతి రహితమూర్తీ."

2. "సుస్థిరానందవర్తీ."

3. "కేవలభావానందమయా."

4. "భాస్వ దానందమార్గా."

అను సంబోధనలలోఁ, దిక్కన, పరబ్రహ్మతత్త్వము నాత్మ సాక్షాత్కారజన్యమగు బ్రహ్మానందముతో నభేదముగ వర్ణించినాఁడు. మఱియు, దేహాభిమాన కారణమున వృద్ధిఁజెందిన మోహాంధకార మును వివేకముచే నశింపఁజేసినచే కాని, యాత్మ ప్రబోధము కలుగ దని తిక్కన గ్రహించుట మాత్రమే కాక, యాత్మ సాక్షాత్కారమును గూడఁ గాంచినాఁడని యాక్రింది పద్యమువలన నూహింపనగును.

"దేవాభిమాన సంభృతి
మోహాతమోనిరసనాభిముఖ భూరివివే
కాహీన మహాతత్త్వస
మాహిత చిన్మాత్రరూప మధురిమసుభగా."

సదసద్విచార జ్ఞానముచే మోహము నిరస్తముకాగా, లభించిన చిత్తవికాసమే పరమాత్మస్వరూప మనుటచేఁ, దిక్కనకు జ్ఞానకాండ యందుఁగల దృఢవిశ్వాసము సూచితమైనది.

యోగులు పరమాత్మైక సంధానమునం జేసి, భవబంధ మోక్షణముం గాంచినట్లు, తిక్కనయుఁ, గవిత్వ దీక్షావిధిం బూని, శబ్దబ్రహ్మైక సంధానమునం జేసి, జ్ఞాన జ్యోతిస్వరూపమగు పరమాత్మ సాక్షాత్కారముం గాంచి, భవబంధ విమోచనముం బొంది యున్నాఁడు.

"కరణఫల పరిత్యాగ వ్రతోదాత్తచేతః
పరిణతసుఖపీఠ భ్రాజమానా నతాంహో
నిరసనచరణాబ్జోన్నిద్రతారాజమానా
నిరవధిపరిణాహా నిర్భరానంద దేహా"
"అనపేక్షితఫలతా శో
భనమహనీయ క్రియా విపాకాత్మరూ
ప."

అను సంబోధనలు, తిక్కన, విశిష్ట కర్మయోగి యనుటకు సాక్ష్యములు. భారత రచనతోఁ బాటు తిక్కన హృదయమును బరిణతి నందుచు వచ్చినది. అధ్యాత్మిక విషయ ప్రధానములగు పర్వముల రచనాటికిఁ దిక్కనయు నింద్రియముల బాహ్యప్రవర్తన నరికట్టి, యంతర్ముఖుఁడై, పవనాదుల నిరోధించి యాత్మ సాక్షాత్కారముం బొందినట్లు కన్పట్టుచున్నది.

శాంత్యనుశాసనికాది పర్వగతమగు నితని రచనయే యిందులకుఁ బ్రబలసాక్ష్యము. భిన్నవర్ణ మణులయందుఁ బ్రసరించిన సూర్యకాంతి తత్తన్మణిస్వభావము ననుసరించి, భిన్నకాంతులతో భాసించునట్లు తిక్కనరచనయు, విషయ వైవిధ్యము ననుసరించి, వివిధ భంగుల విరాజిల్లు చున్నది. విరాటపర్వమాదిగ యుద్ధాంతము వఱకును నితని రచనా విధాన లౌకిక వాఙ్మయమున కుత్తమాదర్శమై యుదాత్త కావ్యలక్షణములతోఁ బ్రకాశించినది. శాంతిపర్వాదులయం దితని రచన, కవిత్వ పరాకాష్ఠ నందికొని, యలౌకిక వేదవాఙ్మయ స్వరూపం దాల్చి, తేజోమయమై, జ్ఞానజ్యోతియై విలసిల్లినది.

"త్రియుగ కమల వీధీదీప్తపంచారలీలా
నియమిత పవ నాత్మాగ్ని ప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచ మహాబ్జస్వైర మాధ్వీక ధారో
దయమయ మధుకాత్మా దర్శి తానంద వర్త్మా."

సంపూర్ణము